శ్రీ రస్తు.

శ్రీ మత్పరదేవతాయైనమః

# భక్తరత్నాకరము

ప్రథమ తరంగము

---

భక్తరత్నము భద్రాద్రిరామదాసు





శ్రీ తిరుమలతిరుపతి వెంకటేశ్వరస్వామివారు

గ్రంథకర్త : ప్రకాశకులు

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటేశ్వరకవిగారు

శ్రీ రస్తు.

శ్రీ మత్పరదేవతాయై నమః

# భక్తరత్నాకరము

ప్రథమ తరంగము

---

భక్తరత్నము భద్రాద్రిరామదాసు





శ్రీ తిరుమలతిరుపతి వెంకటేశ్వరస్వామివారు

గ్రంథకర్త : ప్రకాశకులు

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటేశ్వరకవిగారు

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయై నమః

శ్రీ.................................................................................................గారికి

గ్రంథ కర్త అభినందన పురస్సరమ్ముగ నొసంగిన

కా వ్య పు ష్ప ము

శ్రీ మద్భక్త రత్నాకర మహాకావ్య రచనా ప్రకటన

మ హో ద్య మ ప్రో త్సా హ క

వ దా న్య శే ఖ రు ల కు

# కృతజ్ఞత

కం॥ ఒరునున్నతిఁ గనుగొని సం
బరమును గొను వారి పాదపద్మమ్ములకే
నెఱగుచు మత్కవితాలత
కరుదుగ దోహదముఁజేయు నార్యులఁదలఁతున్.

మ॥మతిమన్ముఖ్యులు మెచ్చుత్యాగధనులన్ మన్మానసంబందున౯
దతభక్తిన్ గొనియాడుదున్ దలఁతు మద్గ్రంథావళీబద్ధశా
శ్వత తాత్కాలిక సుక్రమాగత లసద్వర్గోరు సమ్మానరా
జిత కీర్త్యార్జిత దిగ్దిగంత వితతశ్రీవైభవోపేతులన్.

# శ్రీ భక్తరత్నాకర మహోద్యమ ప్రోత్సాహక వదాన్య శాశ్వత వర్గములు

| | |
|---|---|
| శాశ్వత మహోద్ధారకులు | 11116-00 |
| శాశ్వతోద్ధారకులు | 6116-00 |
| శాశ్వత మహారాజ పోషకులు | 1116-00 |
| శాశ్వత రాజపోషకులు | 660-00 |
| శాశ్వత పోషకులు | 560-00 |

ఈ పైవర్గములవారి ఫొటోలున్నూ ప్రకటింపబడును.

| | |
|---|---|
| మహారాజపోషకులు | 316-00 |
| రాజపోషకులు | 216-00 |
| పోషకులు | 116-00 |
| సహాయకులు | 60-00 |
| ప్రోత్సాహకులు | 40-00 |

ఈ పై వర్గములు అనువత్సరము సత్కరించినచో క్రమాగత శాశ్వత మహారాజ పోషకాది శాశ్వత వర్గము లలంకరింపగలరు శాశ్వతవర్గములవారి ఫొటోలు ఒకపరి ప్రకటింపబడును ఆర్టుపేపరు, ఆర్టు ప్రింటింగు చార్జీలు దాతలు భరించుచున్నచో నూతన కావ్యము లెన్ని వచ్చిన అన్నింటిలోను ఆయా వర్గములవారి ఫొటోలున్నూ పేర్లు ఆయావర్గములలో తప్పక ప్రకటింపబడును. నూతన కావ్యములు స్వయముగ నిచ్చుటయో పోస్టుద్వారా పంపుటయో జరుగును. పోస్టుద్వారా పంపినచో పోస్టుఖర్చులు దాతలు భరింపవలయును.

# విజ్ఞప్తి

ఆంధ్ర గీర్వాణ, భాషాకోవిదులు, భక్తిజ్ఞాన విరాగ నిలయులు, రసజ్ఞశేఖరులు, సహజౌదార్య సంపన్నులు, నగు మహాభాగులకు :—

ఆర్యులారా ! భక్తరత్నాకరమను మహాకావ్యము అనేకులు భక్తరత్నముల చరిత్రములతో మూడు వందల తరంగములగు వ్రాయుపూనిక భగవత్ప్రేరణను కలిగినది. ఆ మహాగ్రంథమున ప్రథమతరంగమే ఈ భద్రాద్రి రామదాసుచరిత్రము ప్రథమముద్రణము పశ్చిమ గో॥జిల్లా కొణితివాడ గ్రామస్థులు, మహారాజశ్రీ మానేజర్, యరకరాజు సత్యనారాయణరాజుగారి ధనసాహాయ్యమున అచ్చొత్తింపబడినది. మరియు నేడు **శ్రీ తిరుమల తిరుపతిదేవస్థానం హిందూ ధర్మరక్షణ సంస్థవారిధన సాహాయ్యమున ముద్రింపబడినది.** యీయుపకృతి నొనర్చిన ధర్మసంస్థకు నేనెంతయుం గృతజ్ఞుడను. లోగడ అనేకులు మహాకవుల కావ్యములు గద్యపద్యాత్మకములు, రసవత్తరములు, భక్తి, జ్ఞాన, విరాగ సంపన్నములగు కావ్యములుముద్రింపించిరనియు వినియుంటినిఅందందు కనుచుంటిని, ఇంకను అస్మదాది మహాకవులకు, పండితులకు జేయూతనొసంగి వేదధర్మమును పెంపొందింపగలరని నమ్ముచున్నాను. శ్రీ తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామి వారి కృపచే నా యొనర్చు యత్నమును ననతికాలమున సిద్ధింపగలదని విశ్వసించుచున్నాను.

మంగళంమహత్ శ్రీశ్రీశ్రీ

ఇట్లు, గ్రంథకర్త

**బ్రహ్మశ్రీ చెళ్లపిళ్లవెంకటేశ్వరకవి.**

# విషయసూచిక



గ్రంథకర్త:

బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటేశ్వర కవిగారు

హాలుమకాం - కాకరపఱ్ఱు

తణుకు తాలూకా (ప॥ గో॥ జిల్లా.)

శ్రీ ర స్తు

శ్రీ మత్పరదేవతాయైనమః



## కృ తి స మ ర్ప ణ ము

చ॥ కనుగొనుమమ్మ! పేరిమిఁగకారము రూపముగా వెలుంగు నో
జనని! సమస్తలోక శుభసౌఖ్య విధాయిని, భుక్తి, ముక్తి దా
యిని! రజతాద్రినాథహృదయేశ్వరి! యీశ్వరి అస్మదీయ భా
వన సుమ పూజలందుమ! కృపామతిఁబ్రోవగదమ్మ! శాంకరీ!

తే॥గీ॥ కలవు రత్నాకరమ్ములు దలఁప బ్రహ్మ
నిర్మితమ్ములనేకముల్ నేడొకండు
భక్తరత్నాకరం బిటుఁబ్రభవ మందె
నిందుఁబ్రథమతరంగమ్ము నందికొనుమ!

మ॥కవిరాజుల్ దలలూపఁబండితులు, లోకజ్ఞుల్ మహాభాగు లౌ
నవునంచున్ నుతియింప నెందు భవ దవ్యాజానుకం పాత్తమ
త్కవితావార్ధి తరంగ సంజనిత విద్వద్రత్న మీనామదా
నవరత్నాభిధ భక్తరత్నముకు నిచ్చన్ గొన్నమ్మ! కామేశ్వరీ!

మ॥భవుకంబై భవదీయమైన యనుకంపాదృష్టిఁ బెంపందు మ
త్కవితాభారతి నీపదాంబురుహయుగ్మం బౌదలందాల్చి యీ
భవముం దాటఁగ భక్తరత్నవిలస ద్భవ్యోదయమ్ముల్ కృతుల్
భవదీయమ్ములుగా నొనర్తుఁ గొనుమమ్మా దేవి! కామేశ్వరీ !

మ॥ జననీ! బాల్యమునుండి నీదు పదకంజాతమ్ములం గొల్చు భ
క్తుని నన్నుం బెరవానియట్లు లెదగన్గోజెల్లునే నీకు ? నా
పని నీకే బరువైనఁదేఁలి కగునే ? పైవారికెప్డేని ? నీ
మనమం దారసి వేగఁబేర్మిఁగను మమ్మా ! దేవి ! కామేశ్వరీ !

మంగళం మహత్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# భక్త రత్నాకరము

## ప్రథమ తరంగము, భద్రాద్రిరామదాసు.

### మంగళాచరణము

ఉ॥ శ్రీలలనా దృగంత సరసీజ లతాంత విలోల మాలికా
జాలములం దగుల్కొనియు జ్యోతిరుణీ కుచగుచ్ఛలోలదృక్
కీలల లోకముల్ మనుచు శ్రీ ధరణీవరుఁడేలుగాత భ
క్తాళి మరుస్మహీజము శుభావహ దృష్టుల మమ్ము నెల్లెడన్.

కం॥ హరియురము నంటి లోకఁపు
పరువ్రస కాదరవు నగుచు బ్రహ్మాండములం
గరుణన్ వెలయుం గను నా
సిరి మమ్మున్ మనుచుఁగాత సిరి సంపదలన్,

చ॥ గొనకొని వెండికొండకొనకొమ్మ నరత్నమయంపుటాసన
స్థనసురభూజమూలమున మొక్కలిడన్ సకలామరుల్ హిమా
నిధరజాత వామతనుభాగ్యమునన్ విలసిల్ల నిండుకొ
ల్వున వెలుగొందుచున్ జగముఁ బ్రోచెడు శంకరుఁ డోము
మమ్ములన్.

4. మ॥ కలుముల్ గూర్చి విభాగ్యభోగ్యములఁ దూగం జేసి లోకాలపో
కలఁ గో మర్మమెఱింగి వర్తిలెడు విజ్ఞానమ్ముఁ జేకూర్చి యి
మ్ముల సౌభాగ్యపరంపరల్ దతశుభమ్ముల్ వొందఁగన్ గాంచు పి
చ్చిలు నెమ్మిన్ నిజభక్తులన్ మనుచు మా శ్రీమాత మమ్మేలుతన్॥

5. చ॥ తనచతురాననమ్ముల నుదాత్తగతిం జతురాగమమ్ము లా
ననఁ బఠియింపఁ ద్రవ మహాయన వీణియ నాలపించు వా
ణిని మురిపించుచున్ మునుల నేకులు గొల్వఁగఁ గొల్వుఁ దీర్చు చి
క్షిని కమలాసనుండు మముఁ గాంచెడు గాత చిరాయురున్నతిన్.

6. కం॥ అన్నలువ మోముదమ్ములఁ
జెన్నొందెడు వాణి నాదు జిహ్వాగ్రమునన్
గ్రొన్నెలలన్ వెలయుత బుధ
సన్నుత సత్తసవిశేష సంపన్మహిమన్.

7. మ॥ అల విఘ్నాంధతమఃప్రభాకరుని దివ్యద్బుద్ధిసిద్ధ్యంగనా
లలితాన్యాన దృగంత నూత్నజలజాలంకారునిన్ భక్త గే
హ లసత్కల్పమహీరుహున్ దతమదీయాభీష్టసంసిద్ధికిన్
విలసద్భక్తిఁ దెలంతుఁ గొల్తు, సుమనోవీధిం బ్రసన్నాననున్

8. కం॥ జననీ జనకులఁ బుల్ల
మ్మను జోగవధానిఁ గొల్తు ననఘుల విద్వ
జ్జననుత చరితుల నిక నే
జననముఁ గొనఁ బోని తెలివు సంఘల భక్తిన్.

9. మ॥ ప్రథితంబౌ మనయాంధ్రరాష్ట్రమల 'మద్రాస్ రాష్ట్ర'ముం గూడిన
న్థిరస్పందము లేక మ్రాన్పడఁగ బత్యగ్రుల్ మహీంద్రసంపుప్ర
ప్రథ మార్థానకవీంద్ర గాంవపద భ్రాజిష్ణువా మద్గురున్
బుధసమ్మానితు వెంకటేశ్వరకవీంద్రుం గొల్తు నశ్రాంతమున్.

10. మ॥ అల ప్రాచేతస బాదరాయణులపాదాంభోజయుగ్మంబులొ
దలఁ గేల్మోడ్పుల భక్తితత్పరతఁ జిత్తస్వర్ణపీఠమ్ము నం
దలరన్ నిచ్చలుఁ గొల్తుమామక కవిత్వాంభోజపత్రేక్షణా
లలితాపాంగము లాన్నరాజపథ సల్లక్ష్య ప్రదీపాళిగాన్.

11. తే॥ గీ॥ కాళిదాసాది సంస్కృతకవుల కెఱఁగి
తెలుఁగుకవులకు నన్నయాదులకు మ్రొక్కి
నిగమధర్మమ్ముఁదలఁదాల్చు నేటి సుకవి
వరులఁబూర్వకవీంద్రుల పగిది నెంతు.

12. మ॥ లలితాస్మత్కవితామరుల్లతిక లీలన్ రేగి పుష్పించు ప
ద్యలతాంతాల్ శతముల్ సహస్రములునీయంజాలితిందన్క నిం
కెలమిం దావక పాదపద్మముల నెంతేభక్తి నూర్వేల పూ
వులఁబూజింపఁగ నెంచు నాదగు తలంపుం దీర్చు కామేశ్వరీ!

13. మ॥ పదులున్, వందలు, వేలు, లక్షలును సంఖ్యావింపగా లెక్కయే
ముద మొప్పన్ భవదీయ పాదజలజమ్ముల్ భక్తిఁబూజింప నీ
దు దయాదృక్ప్రసర ప్రపుష్టకవితా ద్యోవల్లికా పుష్పసం
పద కోటిప్రసవార్చకుండనఁగ నల్పంబోదె? కామేశ్వరీ!

14. శా॥ ఏనాఁడీవు మదన్వవాయజులకెం దిత్వేల్పవైనావొ మే
మానందావిగఁద్వత్కృపామృతద్రుగంతాసారధారా ప్రవృ
ష్టానూనామున రాజసంపదయు నిత్యానందసంధాయి బ్ర
హ్మానందాస్తియు నందనస్థలమె కాదా? తల్లి కామేశ్వరీ!

15. మ॥ జననీ! శ్రోత్రియబ్రాహ్మణాన్వయుఁడనై జన్మించుటం జేసి
యిం పనుకం దచ్ఛ్రుతిసూక్తిరత్నములనిత్యమ్మున్ భవత్పాదజీ
వనజాతార్చన జేయుచుంటి మది నీపై సాగునో? సాగదో
యను శంకం గొనఁజేసె వార్ధకము దాపై తల్లి! కామేశ్వరీ!

16. మ॥ రసవద్భావ్యసుసూనవల్లిశతసహస్రమ్ముల్ మహాకావ్యగు
చ్ఛసహస్రమ్ములు భక్తిరత్నసుషమాసంశోభితోదార భ
క్తిసుధాపాత్రములున్ ద్విదంకితములై దీపింప నస్మత్కవి
త్వసురాగమ్ము సుమింప నీదుకృప నింపం గన్ము కామేశ్వరీ!

17. ఆ॥వె॥ భక్తరత్నచరిత భక్తరత్నాకరం
బగుచు వెలయఁజొచ్చె నలఘుబుద్ధి
నరసి తత్కథామృ తాస్వాద నామోద
రసధి మునుక లిడరె? రసికవరులు.

18. శా॥ ఆరత్నాకరమందుమలభ్యమగునామూరత్నసంతాన మె
వ్వారిందుర్భవ వార్ధిముంచి విషయవ్యాసంగులం జేయు నెం
దీరత్నాకర వీచులన్ వెలయు నాయీ భక్తరత్నాళియె
వ్వారిన్ ముక్తిరమావినోదులుగ ముంపంజాలుముద్వార్ధిన్

19. శా॥ ఆరత్నాకర గర్భసంజనిత కల్పాగాభ్రమాతంగ చిం
తారత్నామృతకన్య కాసురభిచంద్రశ్రీతురంగాదు ల
య్యారే! అందనిమానిపంక్తులయి నిలింపానీక భోగ్యమ్ములై
చేరెన్ ద్యోపతి, నావికుంఠపతి, నాశీతాద్రి కన్యాపతిన్.

20. శా॥ సారాసార విచార సూక్ష్మధిషణాసారుల్ ముదంబందనెం
చీరత్నాకర గర్భసంజనిత మర్త్యేభాదు లానంద క
ల్పారామప్రియగీతులాటవెలదుల్ వ్యాకోచము క్త్యంగనా
గారప్రాపక పూతికా గణముల్లై వర్తిల్లెడిం జెప్పుహన్.

## శ్రీ రామశాస్త్రి ఆత్మవిమర్శనము

21. సీ॥ సుఖ లేములై పాడు సురుచి రాపాంగమ్ము
లలర సత్తిలు సరి వెలసె నచటఁ
దలఁచుచే తెసఁపుగఁ దలఁపు లిడేయుచు
సురభి కల్పాదు లెచ్చోట్టఁబోవమోఁ
ద్రిదశులై యమరులై తేజరిల్లుచు సురల్
ముదమంద నమృత మొం దుదయ మయ్యె
నుడుపతిత్వం బూని మృదుమహాళి భూవయనా
నోషధీశుఁడు బుట్టుచుండె నెందు

22. తే॥ గీ॥ సిద్ధి, బుద్ధి, ప్రమదుండు లక్ష్మిగణపతి
ప్రభవ మొందాయె నిరుపమ రత్నరాశి
కాకరం బద్ది సకల జీవాళి కేది
పయిడితొలకరి యయ్యెదే పాలకడలి,

23॥ కం॥ ఆ కడలికాన్న భౌతిక
ప్రాకృత విభవమ్ము లొసఁగు పట్టున నెంతే
వాకొనఁ దగుఁదత్కృపణా
లోకమునఁ గాదె? నాకలోకము వెలయున్.

24॥ కం॥ ఆదేవలోక భోగము
లాదర్శమ్ములుగ నడువ నగునా? యన నా
మోదము దిరమని తెలుపవు
వేదార్థము లెఱిఁగి తెలుపు విజ్ఞుల వాక్కుల్.

25. చ॥ తిరమగు మోదముం గొనెడి త్రేకువ లభ్యము గాక యున్న దు
ర్భరమగు గర్భనారకపు బాధల కాకరమౌ సత్రీ, సుతో
త్కర ధన,ధాన్య,వైభవ నికామనరూపగభీర ఘోర దు
స్తర భవవారిరాశి నెటు దాటెదు నెంతటి బుద్ధిశాలియున్

26, కం। ఆ నిత్యానందం బీ
మేనున బొందంగ జీవి మేకొన కున్నన్
భూనభము లె దిక్కౌ గద?
యేనాటికిఁ జచ్చి పుట్టుటే గతి యగుటన్.

27. కం॥ గురుతర భక్తిని గురువర
చరణాంబుజములను గొలిచి చదివితి విద్యా
వరుణాలయుఁ డనియెడు మేల్
బిరుదమ్మును బడసి యుంటి విద్వత్సభలన్.

28. కం॥ ఎఱింగితి మంత్రార్థమ్ముల
నెఱి పుణ్యక్షేత్రవితతి నిరుపమ భక్తిం
దరిసితి గంగాది మహా
సరి దవగాహన మొనర్చి సంబరపడితిన్॥

29. కం॥ ఆ యా క్షేత్రము లందును
నా యా తీర్థములఁ జేయ నగు సత్క్రియలన్
జేయం జాలితి నఘములు
పాయన్ బహుజన్మ సుకృత ఫలము ఫలింపన్.

30. ఉ॥ వేదవిధుల్ బొనర్చుపృథివీసురరత్నపదాంబుజాతముల్
మోదమునన్ భజింతు మునిముఖ్యులు చెప్పిన ధర్మమార్గసం
వేదుల వెంబడింతుఁ గను వేదుఱు కాకరమా విలాసనీ
స్వాదువచోనిగుంభసల చాడ్పులకుం దరికా నొకప్పుడున్.

31. కం॥ జననీ జనకుల మృదుపద
వనజమ్ములె శరణములుగ వర్తిల్లితి మిం
దనుకం బెద్దలు వారలు
దనియన్ మత్సతియు నేనుఁ దరియింపంగన్.

32. కం॥ అరుదెంచు నతిథు లందున
నిరుపమ భక్తిప్రపత్తి నిత్యము మమ్ముం
దరియింపఁ జేయ వచ్చెడు
పరమేశ్వరు రూపముగనె భావింతు మెదన్.

౩౩. కం॥ గృహి యొనరుప మహితాగమ
విహితంబగు ధర్మకర్మ విస్తృత మతినై
రహిఁదత్ జ్ఞోక్తిని నడువనె!
యిహపరలోకముల నెన్నకేఁ ప్రత్యూహమున్.

౩౪. కం॥ అనవరత రుద్రపారా
యణాదికొపాయుఁడ నయిన నదియేమో! నా
మన మొక్క నిమేషం బై
నను నిలువదు భవుని పాద నళినము లందున్.

౩౫. ఉ॥ ఆ మదనారి పాదజల జాసవమత్త మనోద్విరేఫగీ
తామృతధారలం దనిసి యానని మెచ్చుచు మోవి తేనియల్
ప్రేముడి నానఁ గౌగిటను బిగ్గబిగించెదు ముక్తికామినీ
ధామ సుఖానుభూతిఁ బ్రమదమ్మునఁ గైకొను టెట్టులబ్బెడున్

౩౬. కం॥ తరిగెడు నాయు వటంచును
బరిపరిరీతులను బాధపడనా? మన మా
గిరిజావరు పదసరసిజ
మరయన్ నిలుపోప దింత యని యేడువనా?

౩౭. వ. అని మనమ్మునఁ దర్కించుకొనుచు సర్వమ్మునకు దైవంబ
శరణ్యంబను నిశ్చయబుద్ధి భగవధ్యానపరాయణుండయి,

శా॥ ఆయు శ్శేషము నీపదాంబుజయుగ ధ్యానమ్మునం జెల్ల సెం
దేయే వేళ భవత్స్వరూప విభవం బీక్షింపగం దోయి వా
క్కాయమ్ముల్ విషనాడి యన్యము నినుం గై సేయఁ బ్రార్థింప దే
వా! యీ మోరకు నేలరావె? యనుకంపాదృష్టి సర్వేశ్వరా!

39. మ॥ అని ప్రార్థించుచు నద్రిజాపతినిఁ జిత్తారామ సీమమ్మునం
దునఁ దార్కొన్న భవప్రతాపశిఖి సందోహమ్ముఁ జల్లార్చు సా
ధనరాజం బొకఁడుం గనుంగొనమిఁ జింతాక్రాంతుఁడౌ విప్రవ
ర్యుని శ్రీరామబుధేంద్రునిం దరియ నార్యుం డొక్కఁ డల్లంతనే

## బుధాగమనము

40. కం॥ దరిసెడి యావిప్రోత్తము
డరి కెదురుగఁ గేలు మోడ్చి తరలియు విద్వ
ద్వర! మిముఁబోలు మహాత్ముల
వరపద పాంశువులు ముక్తిపద మార్గమ్ముల్.

41. తే॥ గీ॥ అనుచు భక్తి ప్రపత్తి సుస్వాగతాస
నముల నిడియును రజతపాత్రమునఁ బాద
యుగము నుంచియు సతి సువర్ణోదపాత్ర
జలము నింపఁగఁ గడిగి తచ్చరణ యుగముఁ.

42. తే॥గీ॥ సంప్రదాయానుసరణిఁ దచ్చరణజలము
లాదలం దాల్చి హస్తములందు నర్ఘ్య
మిచ్చి మధుపర్కమున నెంతయేని ముదము
నందఁబూజించి భూమి సురాన్వయమణి.

43. వ. ఆ భూసురవరుం డిడు మంగళాశీస్సులంది మరియు
నంజలించి శ్రీరామబుధవరుం డిట్లను.

44. ఆ॥ వె॥ కలదు సాధ్వి జాయ గల దుత్తములు సుతుల్
గలదు భాగ్యచయము గలదు చదువు
గలదు శిష్ట వీథి వెలుగున కొకయింత
లోటులేదు స్వామి! లోటులేదు.

45. కం॥ వెలికనువిం దగు నా యీ
కలుములఁగని మురియవలెనో కనఁజాలని లో
పలి కనుపండువ యగు నా
కలిమికి విలపింపవలెనో? కలకాలమ్మున్.

46. కం॥ శరదభ్ర చలమ్ములు రా
సిరు లని లోకమ్ము తెలియఁజెప్పెడు శాస్త్రాల్
మరిమరి ఘోషించెడు నే
సిరిఁగోరన్ వలెనో? ముదముఁజెంద మహాత్మా!

47. కం॥ ఇది కాదిది కాదిది కా
దిది కాదని పలుకుచుందు రింతియ కానీ
యెదియో కైకొనఁదగినది
యిదియని రూపించు విబుధు లెందేఁగలరే?

48. కం॥ అని బహు భంగుల నానె
మ్మనమున విలపించు తరిని మద్భవ తాప
మ్మునుఁబాపఁ జేర్మి దైవము
నినుఁజూపె నటంచు నెంతు నేడు మహాత్మా!

49. కం॥ అని ప్రొక్కెడి నిత్యానం
ద నిరూఢిన్ వెలయు భాగ్యదశ చెన్నారన్
నను మీ శిష్యుని మనుపం
గనవే? యో భూసురేంద్ర! కరుణాదృష్టిన్.

అని ప్రార్థించుచు నశ్రుపాతముల సాష్టాంగ ప్రణామమ్ములన్ మనసారం బరమేశ్వరాకృతిగ సంభావించి సేవించి పావన చారిత్రుని దన్మహీసురవరుం బ్రహ్మణ్యునిన్ సోమయాజిని శ్రీరామబుధోత్తముండు నిలువంజాంతన్ మహీదేవుఁడున్.

## బుధ ప్రబోధము

51. కం॥ విను! శ్రీరామబుధోత్తమ!
ననుఁబిన్ననుఁ బెద్దఁజేసి నాయందు హరిం
గను ప్రజ్ఞాన ధనాఢ్యుఁడె
వెవయో? జగ మెఱుఁగునీకు నెన్నఁగ నన్యుల్.

52॥ తే॥గీ॥ వేదవిదుఁడవు గార్హస్థ్యవిభవ మాగ
మోక్త విధి నందు భూమిసురోత్తముఁడవు
తల్లిదండ్రుల మది కెక్క దైవభావ
నమున సేవించు సద్ధన్యతముఁడ వీవు.

53. కం॥ నీ దారయు నీ సుతులును
నీదు మన మ్మెఱిఁగి వరలు నిస్తుల బుద్ధుల్
గాదన నేటికిఁ దొలిజన
కాదులు నినుఁబోలు మేల్గృహస్థులు గారే?

ఉ॥ దాను దరించి యాశ్రితులఁదద్దయునుం దరియింపఁ జేయ
జ్ఞానిధి గేస్తు గాఁడె? సనకప్రముఖుల్ నుతియింప రోకొ
దానమహోదయుం గృహి నుదారగుణాకర! రామధీః
జ్ఞా
నానుడి నాలకించితె? మనమ్మున నెంచితె?తద్రహస్య

55. కం॥ తాతలు దండ్రులు బహువి
ఖ్యాతిం గైకొన్న దాత లాగమ వేత్తల్
నీ తీరు నెన్న నన్నిటఁ
దాతల కెన యనరె? కవు లుదారులు విజ్ఞుల్.

56. కం॥ నీవు పఠింపని విద్యయు
నీ వెఱుఁగని ధర్మవితతి నేనే గా దెం
దేనాఁడు నెఱుఁగడన్నది
భావించి వచింప నిజము పండితముఖ్యా!

57. కం॥ వినను నేనొకఁడేదియొ
యూని పఠింపంగ నెంతు నుజ్వలమతి వీ
వౌనన కుండెదవే? యని;
మానస మలరంగ వినుమ! మహితగుణాఢ్యా!

58. ఉ॥ ఈకలివేళ వేదవిధి కింతయుఁదా విడ దే ప్రభుత్వమే
కాకిగఁబోవ భోజనమె కర్వ్యగుఁ బల్లెలఁబట్టువాల యుం
దాకలి యాకలోయనుచు నార్చుచు మానధనాఢ్యులెందరో
కూకటివేళ్ల తోడుతనె కూలుచు నుండిరి నీవెఱుంగవే?

59. కం॥ తొలి నృపులు వేదధర్మ
మ్ముల మనికికి నగ్రహారముల నిచ్చిరి బా
పల కా భూములను "దశా
వుల" పాలొనరించె నే డెఱుంగవె? ప్రభుతన్

60. ఆ॥వె॥ వేదధర్మవితతి విశ్వాసముంగల
ప్రభుత మరియు నా పరాత్పరుండె
వెలయఁ జేయవలయు విశ్వమ్ము సర్వమ్ము
ముదము నందు భుక్తి ముక్తిదనర.

61. కం॥ కాసల కేగెద మన నా
కానలకును సుంక మిడక కాలిడ నీ రా
కానల దొరకెడు కూరల
కైనను ధనమిడక లభ్యమగునే? యవియున్.

62. తే॥ గీ॥ వేదమూలమ్ము బ్రాహ్మణ్యమ్ము విత్తమూల
మఖిల జగమను నార్యోక్తి నరయ వొక్కొ?
వేదముల విత్తముల నీవు వెలయు చుంట
నెందు నున్నను నీకు లోటింత లేదు.

63. ఉ॥ నేటిప్రభుత్వ వైఖరిని నిక్కముగా మదినెంచిచూడ వే
యేటికి నీతి నేమము నొకింతయు నిల్పెడు నన్నమాట ము
మ్మాటికిఁదోచ కున్నయది మానితవర్తనులిందునిల్వఁగా
జోటొకయింత యున్నయటు చొప్పడ దాత్మనుదాపుఁధీవరా!

64. కం॥ కలియుగఁపు రాజ్య వైభవ
ముల తెఱవ్రులు భూమిసురుల పోకలు రాజ
న్యుల బ్రదుకులు సర్వమ్మును
వెలుపఁడొకో? వ్యాసమౌని తెల్లముఁగాఁగన్.

65. కం॥ ఇట్టితఱి వైదికక్రియ
లెట్టుల సాగెడిని? ధర్మ మెట్టుల నిలుచున్.
గట్టా! యని పైఁబడు ని
క్కట్టులు దాటుటకె ప్రొద్దు కర వగుచుండెన్.

66. కం॥ నిను బోల్నైష్ఠికు లందం
దున నుండుట వేదధర్మ ధుని యింకుచు నిం
కని యట్టిల్ దోచెడు నిం
కను నో శ్రీరామవిబుధ! కనుపండువుగాన్.

67. శా॥ లోకజ్ఞుండవు శాస్త్రవేత్త వగుటన్ లోకంపుతీరింత నీ
వాకర్ణింతు వటంచుఁ దెల్పితి ననన్యాయత్తచిత్తుండవై
యాకర్ణించితివంచు నెంచితిమదీయాంతర్యముం దెల్పెదన్
నీకున్ ధీవర! విన్ము నానొడుల నిర్ణిద్రామతి స్ఫూర్తిమై

68. తే॥గీ॥ ప్రభుత యెట్లున్న లోకపు వర్తనమ్ము
దెట్టు లుండిన నార్షమ తేతరంపు
కృతులు మన హైంద వావని కతుకఁబడవ
టన్న నిగమోక్తియే సత్య మనరె? బుధులు

69. కం॥ అలసులు మందమనీషులు
దలక్రిందుం జేయ నెంచు తలఁపులు వెలయం
గల వొకొ? కుక్కగొడుగుల
బలె మోసెత్తియును నేలపా లగుఁగాని.

70. తే॥ గీ॥ కొండలం గొట్టి, కొమ్ముటేన్గులను ద్రోసి,
వృక్షముల బెల్లగించి, పల్లియల ముంచి
కొలదియెఱుఁగక చెలరేగు కొండకాల్వ
లెంతశక్తాత్మలో లోక మెఱుఁగ దొక్కొ?

71. కం॥ ఒక మేలున నొక కీడును
నొక కీడున నొక్క మేలు నుండుట నైస
ర్గిక మని తెలుపవె? విద్వ
త్ప్రకరోక్తులు సందియంబుఁబడ మన కేలా?

సారాంశమ్మును దెల్పెనెంతు విను మీసంసారముంబాయ నె
వ్వారల్ గాని నిరంతరమ్ము భగవత్పాదారవిందార్చనా
సారుల్ దద్గుణవర్ణ నాంచిత కథాసారామృతాస్వాదనా
సారుల్ దక్క యనన్యు లన్న నుడియే సత్యమ్ము ముమ్మాటికిన్.

73. కం॥ జగముల రాకలుపోకలు
జగముల వైచిత్ర్యములను సర్వమ్మును నా
భగవల్లీలలుగాఁ గని
భగవత్పాదములు గొలుచు భక్తులె ముక్తుల్.

74. కం॥ భగవద్భక్తుల చరితలు
భగవచ్చరితముల కన్న బహుప్రియతమముల్
భగవంతున కనుచును నా
భగవద్వాక్యముగ నంద్రు పరతత్వ విదుల్.

75. కం॥ అల వైకుంఠపురమ్మున
నిలువను యోగీంద్రహృదయ సీ రేజములం
దలఁపను స్థిరమతి మద్భ
క్తులు గానముఁ జేయుచోటఁ దొలఁగక యుందున్.

76. కం॥ అని మును నారదమునితో
ననె నా వైకుంఠమూర్తి యని నారదుఁడా
డిన యటు భక్తుల కెల్లర
కనుఁ దెలుపుచు నుంద్రు గాదె? కోవిదముఖ్యుల్.

76. కం॥ భగవద్భక్తుల చరితలు
దగ వినిచిన వినిన భక్తితత్పర మతులై
భగవ త్సాయుజ్యం బనఁ
దగు నిత్యానంద పదవిఁదనరెద రనరే ?

77. ఉ॥ ఆరసి శౌన కాది మును లాగమ నిష్ఠులు సత్రయాగ దీ
క్షారతు లౌచు నైమిశపు కానన మందున వేడ్క భక్తమం
దారుని భక్తరక్షణ కథాసుధ లానరె? వీను లార యా
సూరివ రేణ్యసన్నుతుఁడు సూతమునీంద్రుఁడు దెల్ప నొక్కెడన్

78. మ॥ భగవల్లీలలు భక్తజీవిత కథాప్రస్తావనా సంగతిన్
నిగదింపంబడుఁగాన భక్తుల కథానీకమ్ములన్ భావుకం
బగు దృష్టిన్ వినుచో నిరంతరము బ్రహ్మానంద రా జ్యాధినే
తగ నెవ్వాఁడును వెల్గు నంచనవె? విద్వద్వర్గ వాగ్వైఖరుల్

79. కం॥ కావున శ్రీరామబుధేం
ద్రా! విస్తృత ధర్మకర్మ తత్పరమతి వీ
భావము నీమదిఁజొచ్చిన
నే వినిచెద భక్తవరుల యిద్ధచరిత్రల్.

80 కం॥ అని సోమయాజి నుడివిన
విని విద్వద్వినుత చరిత! విద్వజ్జన రం
జనములు భక్తచరిత్రలు
వినియెదనని రామబుధుఁడు వేడుకఁదెలుపన్.

## వి ద్వ దా గ మ న ము

81\. వచ్చెను సోమయాజియను వార్త నెఱింగిన తత్పురీ బుధుల్
హెచ్చిన భక్తిఁదన్మహితు సిద్ధచరిత్రునిఁ గాంచు వేడుకన్
వచ్చిన యంత రామబుధవర్యుడు స్వాగత మిచ్చె నెల్లధీ
మచ్చయ ముల్లసిల్ల బుధమాన్యులుమెచ్చగ సోమయాజియున్

82\. కం॥ అరుదెంచు నిఖిల విద్యా
ద్వరులుం గేల్మోడ్చి కుశల వాగ్వైఖరులన్
వరలం దద్ధరణీసుర
వరుఁడుం బ్రణుతించి యిట్లు పలుకం జొచ్చెన్

ధరణిసురేంద్రులార! విబుధప్రతతుల్ గొనియాడఁ దొల్లి శ్రీ
కర నిరతాన్నదాతృ ఘనగౌరవ సత్యకథాప్రసంగ వి
స్తర వచ నోరుభాగ్య పరతంతుఁడ నైతిని నే భవత్కృపా
భరిత మదీయ మానస మపార ముదంబుధి నోల లాడగన్.

84\. కం॥ మన యీ శ్రీరామబుధేం
ద్రుని నిరుపమ దైవభక్తి దురితాపహ స
జ్జన సేవాసక్తి యునె
వ్వనియందున్ నేడు చూడఁబడునే? తలఁపన్.

85 కం॥ అనుకూలవతి కులాంగన
యనుసారులు సుతులు గొమిరె లఖిల శుభాఢ్యల్
ధనములు దలమున్కలు జి
త్వని యీ మన రామ శాస్త్రి ధన్యుఁడు బళిరే!

భక్తరత్నాకరము, ప్రథమ తరంగము

86. కం॥ అని శ్రీరామబుధేంద్రునిఁ
గొనియాడియు నెల్లబుధులఁగొండాడెడు చి
ద్ఘనునకు యాజికి నిట్టని
రనుపమ నిష్ఠాగరిష్ఠులా భూమిసురుల్.

87. కం॥ నిర తాన్నదాన దీక్షా
పర చరితామృత మొసంగి బ్రహ్మానందో
ద్ధుర భాగ్యోదయులుగ మము
నెఱపితి భవదీయ మధుర నిరుపమ సూక్తిన్.

88 కం॥ వినిన కొలందిని మాకున్
వినవలె నను కోర్కె వొడము విద్వజ్జన రం
జన వాగ్వైభవ! మమ్ముం
దనుపవె? భవదీయ వాక్సుధా రస ధారన్.

89. కం॥ అని పలికిన యా విద్వ
జ్జనులం గని సోమయాజి సద్భక్తి నిరూ
ఢిని భజియించియు గురుపద
వనజద్వయి మానసమున; బద్ధాంజలియై.

## సభా ప్రారంభము

90. కం॥ విరసిన తామరపూవుల
సురుచిర మగు కొలనుభంగి సూనృతవిద్వ
ద్వరవదన నీరజమ్ముల
వరలెడు నీ సభ కొనర్తు వందన శతముల్.

91. ఉ॥ఆగమ ధర్మకర్మరతు లాగమ ధర్మరహస్య వేదులున్
ద్యాగధనాఢ్యులున్ విబుధు లౌననఁజాలు స్వధర్మరక్షణో
ద్యోగులు బుణ్యమూర్తులు మహోజ్జ్వల తేజులు సభ్యులంట మ
ద్యోగ మదెట్టిదో! తెలియ నొప్పునె? నేనట వక్తనంటహో!

92. కం॥ బుద్ధిమ దగ్రేసరు లగు
వృద్ధులు విద్యాంబునిధులు వినియెడు సభ్యుల్
శుద్ధాంతఃకరణు లు వా
క్చుద్ధులు నా యెఱిఁగి తెలుపు సుద్దులు వినరే?

అని కేల్మోడ్పు శిరమ్మునం దిడి తపస్స్వాధ్యాయ సంపన్ను లా
ర! నితాం తోజ్జ్వల బ్రహ్మకర్మరతు లారా! విస్ఫురత్సాధు స
జ్జన సేవాధను లార! భక్తి భవ దాజ్ఞన్ నేడు భద్రాద్రిధా
ముని సేవించిన రామదాసు చరితమ్మున్ విన్తు నాలింపుడీ!

94. కం॥ నను వినిచెడి సాధనముగఁ
గొని వినిచెడి వాడు కలఁడు కొండొకడని నె
మ్మనమునఁ గని యవధానముఁ
గొని విని ననుఁబేర్మిఁగనుడి! కోవిదు లారా!

95. కం॥ బా గోగుల కలయికయే
యే గతిఁగనుగొన్నఁదోచు నెందును నా వా
క్యేగతి నున్నను నందలి
బాగుం గన నా యొనర్చు ప్రణతులు గొనుడీ!

96 కం॥ బాగే తిర మగు బ్రహ్మం
బోగే యస్థిరము ప్రకృతి యోగం బనరే ?
ఓగున్ వీడక యెందుం
బాగున్ గన నేర్తు మెక్కొ? పండితు లారా!

97. కం॥ బా గోగుల సంయోగ వి
యోగము లెఱుఁగంగఁజాలు నుజ్వల విద్యా
సాగరులు మీర లీ నా
బా గగు నుడి వినుఁడు వినుపఁబ్రారంభింతున్.

## కథా విధానము

కలదు నిజాము రాజ్యమున గ్రామము పేరునఁగొండపల్లె నా
వెలయుచు గోలుకొండపృథివీపతి యేల్బడిఁ దెల్గునాడు నం
దలరుచు నుండి రగ్రజముఖాఖిల వర్ణములన్ వివేక వం
తులు ధన ధాన్య సంపదలఁదూగెడు గేస్తులు దత్పురమ్మునన్

99. తే॥గీ॥ ఆపురమ్మునఁగల బ్రాహ్మణాన్వయముల
యాజ్ఞవల్క్య నియోగుల యన్వయములు
గలవు గల వందునను బేరుఁగన్న సిరుల
వరలు గంచెర్లనాబడు వంగడమ్ము.

100. పేరున భాగ్య భోగ్యముల పెంపున దానదయాది సద్గుణో
దార విశేషసంపదలఁదద్దయుఁదజ్ఞులు మెచ్చు వెట్టిది
ద్వార యశస్కమైన సచివ ప్రవర ప్రకరాలవాలమై
ధారుణిఁ దత్కులమ్ము బహుధా విలసిల్లె సురద్రుమమ్మునాన్.

101. ఆ నెలకొండపల్లె పుర మందలి కంచెర లాన్వయంపు వి
జ్ఞానము, దైవభక్తియును, త్యాగము, స్వామియనుగ్రహమ్ము,సు
జ్ఞాను తెజింగె మెచ్చు లిడు సంతునుఁగాంచఁగనో యనంగఁబ్ర
జ్ఞానిధి పుట్టి లింగన జగన్నుత వర్తనఁగామమం గొనెన్.

పు త్రో ద య ము

102. కం॥ ఆ మహనీయ గుణాఢ్యులు
గామాంబా లింగనల సుగౌరవ దాంప
త్యామో దామృత వననిధి
సోముం డనఁబొడమె సుతుఁడు జూడ్కుల విందై.

103. కం తనయుడు వొడమిన వార్తను
విని నంత ముదంబురాశి వీచీ నివహ
మ్మున మునకలు వైచుచు లిం
గనమంత్రి పురోహితులకుఁగైమో డ్పిడి తాన్.

104. కం॥ చేతఃప్రీతి సచేల
స్నాతుండై సూతికా నిశాంతము నెంతే
నాతురతఁజొచ్చి సుతునకు
జా తాభిద కర్మఁజేసి శాస్త్రోక్తముగన్.

105. కం॥ మున మలరం బదుకొండవ
దినమున బందుగులు బుధులు దీవింపఁగ గో
పన యని తండుల పాత్ర
మ్మునఁబేరిమి నామకరణముం బొనరించెన్.

106. వ॥ అంత దినదిన ప్రవర్ధమానుండగు కొమరుం గనుంగొని ముదం బందుచు.

107. కం॥ గొనకొని యారవ మాస
మ్మున బుధు లౌనన౯గ మంచి మూర్తమ్మున గో
పన కన్నప్రాశనమును
బొనరిచె లింగన్న బంధుముఖ్యులు మెచ్చన్

108. కం॥ మూడవ వత్సర మందున౯
జూడా కర్మమ్ము౯జేసె సూరివరుల్ గొం
డాడ౯గ లింగన సుతునకు౯
గూడి ముదంపడ౯గ బంధు కోటియు హితులన్

చిరునగు మోము గోము సరసీరుహ సంపద నాహరింప వా
క్సరిణి శుకోక్తికిన్ గురుతగా ఘలుఘల్లని గజ్జె లందియల్
మొరయ౯గ౯ దప్పటడ్గులను ముందుకు వచ్చుచు౯గేలుసాచు నా
చిరుతను ౯గౌగిటం గొనుచు౯జెక్కిలి ముద్దిడుచుత్సహించుచున్

110. కోవాబిళ్ళలు బంచదారచిలుకల్ గోధూమ ఖాద్యాదులున్
యావద్బంధుగణమ్ము మిత్రగణ మాహ్లాదమ్ముతోడన్ సుహృ
ద్భావౌదార్య విశేష సంపదల చందం బేర్పడన్ బెట్టివ
త్సా? వర్ధిల్లుము! వేయియేండ్లకని చేతఃప్రీతి దీవించుచున్.

111\. కం॥ తల నిమురుచు నెమ్మోమునుఁ
దిలకించుచు వెడద కనుల దీధితి పుంజ
మ్ముల నూటిసాటి నెదలోఁ
దలపోయుచుఁగొంద రంగదుఁపద్మజులు దక్షుల్.

112\. కం॥ ఈ కామము లింగన్నల
ప్రాకృతి భాగ్యం బదేమొ! బహువిధ సుకృతీ
స్వీకృత ఫలరాశిగ నే
డీ కుబ్జుఁడు వొడిమె ననుచు నెన్నందగెడిన్.

113\. తే॥గీ॥ పూవు పుట్టిన యంతనె పొడముఁ బరిమ
ళమ్మనిన యట్టు లీ పట్టి నెమ్మొగంపు
తేజు, పల్కుల చవి జూపు తీరు నిఖిల
మాత్మవిస్మణి యగు నన్న యటులఁదెలుపు

114\. కం॥ ఈ కుబ్జని విజ్ఞానం
బా కమ లాననుఁడొ నీరజాక్షుండో గౌ
రీ కాంతుఁడొ యెఱుఁగందఁగుఁ
గా కన్నులెటుల్ గ్రహింపఁగల రజ్ఞానుల్.

115\. కం॥ ఇప్పసిపాపని యడుగుల
చొప్పునుఁ, జప్పటులతీరు, సూక్తుల పసయున్
జెప్పక చెప్పెడి నా తా
నప్పను మెప్పించు భక్తుఁడగు నను నట్టుల్.

ఉ॥ సంతతి లేకలేక బుధసంతతి మెచ్చఁదపం బొనర్చి యీ
సంతునుఁ గాంచె లింగన బ్రశస్త గుణాకర . కామమాంబ యెంత
దెంతయు సప్తపూరుషము లీ కొల మందుఁదరింప నాగ సు
స్వాంతుల నోము లన్వయ లతాంకురముల్ భవవార్థి నౌక

117. కం॥ అని కామమ లింగన్నలఁ
గొనియాడుచు గోప నార్భకుని సర్వాంగ
మ్మునుఁ బరిశీలించి యితం
డనుపమ భక్తాగ్రగణ్యుఁడగు ననుకొనుచున్.

118 తే॥గీ॥ అంత లింగనమంత్రి యాహ్వాన మంది
యెలమి నెం దిష్ట మృష్టాన్నముల భుజించి
యా సమారాధ నోన్నతి నాడు కొనుచుఁ
దమలముం జేసి యెంతయుఁబ్రమదమునను.

119. తే॥గీ॥ కొంత తడ వుండిచను బంధుగులనుఁ జూచి
వెడలి రావిజ్ఞు లెల్ల రవ్వేళ వార
లెల్లరును మోద మందుచు నెలమి లింగ
నార్యు మెచ్చెడి వారలై రాత్మయందు

120. కం॥ క్రమవృద్ధిఁగొనుచు ముద మిడు
కొమరునకున్ లింగమంత్రి గొండొక సుముహూ
ర్తమునను నైదవ యేటనుఁ
బ్రమదమ్మునఁజేసె నక్ష రాభ్యాసమ్మున్.

121. కం॥ బడిలో వైచుచు తడవుగ
సుడికారప్పు సొంపెటింగి నోరూర గురుల్
నొడివిన యట్టుల నుడువుచు
నుడినుడి మధు వుట్టిపడ ననూనపు భక్తిన్.

122. కం॥ గురువుల మెప్పుం గొనుచును
గఱచుచుఁ బాఠముల వాచకమ్ములఁ దెఱవుల్
బరకించుచుఁ బద్యమ్ముల
సరణిం గురుతించుకొనుచు సంబరపడుచున్.

123. తే॥గీ॥ బాలరామాయణమ్ముఁ జేఁబట్టి యున్న
దాది శ్రీరఘురాము పాదాంబుజములు
నెమ్మదిని నిల్పి సతము ముదమ్ము గదుర
నెంచుఁ దత్సేవకులఁజేర నెంచు భక్తి

124. కం॥ జననీ జనకుల మృదుపద
వనజమ్ముల కనుదినమ్ముఁ బ్రణమిల్లుచు భ
క్తిని సుద యాస్తమయమ్ములఁ
బని యొండొనరించు దైవభావం బొప్పన్.

గురుతర భక్తివృద్ధులనుఁ గోవిదులం గనినంత మ్రొక్కుచుం
దఱచుగ రామచంద్రుని యుదార కథాశ్రవణోత్సుకుండు నై
వరలుచు వీధిలోని బడిపంతులు జెప్పెడి పాఠ్యభాగముల్
జరచర యొప్పఁజెప్పి గురుల్‌న్ మురిపించుచు ముద్దు సుద్దులన్

126. కం॥ అనుదినమును రామాయణ
మును వినుటయు రామభజనమును జేయుటయున్.
జననీ జనకులు ముదముం
గొన నడచుట పనియుగాఁగ గోపన యుంటున్.

127. కం॥ కను విందుం బొనరించెడి
తనయుని చైదములు గనుచుఁదద్దయు జననీ
జనకులు గామాంబాలిం
గన మంత్రులు మది నమాన కౌతూహాలు లై

128. వ॥ ఉండు నత్తరి నొకదినమ్మునఁ గామాంబసతి బతింగని
శిశ్రం గురించి యిట్లను

129. కం॥ ఆడినఁబాడిన నిదురం
గూడియుఁగలఁగొనిన భుక్తిఁగొనుచుండిన నే
మాడిన రామా! యని తొలి
నాడక యే యొక్కఁడాడ డయ్యదియెమో!

రారా! నాయన! బువ్వ కంచనిన మార్మాటాడకే రామతా
మా! రామా! రఘురామ! రామ! యనుచమ్మా! వచ్చుచున్నాడ సీ
తారామా! భవవారిరాశి ఘనపోతా! రామ! యం చాడుచున్
నోరారన్; గడుపార నోగిరముఁగొం చుండున్ ముదంబొప్పగన్.

131. కం॥ మన యీ నిసువున కెట్టి
బ్బైనొ కానీ యిట్టి భక్తి జెదరఁడు జెదరం
డనుమానింపం డెయ్యెడ
ఘనయోగిం బోలు నిష్ఠఁగను నోకఁడున్నన్.

ఈడుం జోడయి కూడియాడుకొనునా యీబాలకుల్ వెల్తిరో

132. గూడం బోయెడు నీడలట్టులను సంకోచింపకే వేచి పై
డాడం బోయెడునంతదన్క; మది నాహ్లాదమ్ము రేకెత్త వా
రాడం బోయెద రద్ది చూచు నెడ నాకాశ్చర్యముం గొల్పెడిన్

133. కం॥ బుద్ధులు సెప్పందగియెడు
పెద్దలు సైతమ్ము వీనిఁ బ్రేమించుటలేఁ
గొద్దిగ నష్టపెటుఁగుదు
నద్దిర! యనిపించు నద్ది యరసిన యంతన్.

మన యీకుఱ్ఱని వర్తనమ్ముఁగని ధీమంతుల్ బ్రశంసించు చుం
డిన యట్టుల్ గనుచుండినన్ మనకునుం డెందమ్ము రేకెత్తు చుం
డినగానీ యదియేమొ నాయెడదనం బెన్ వీని భావ్యున్నతిం
గనుఁగొనేర్తునె? యన్న పెన్నెగులు నా కందోయి నోమెట్టిదో?

135. కం॥ కలిమియు బలిమియుఁ గలిగియు
ఫల మున్నదె? సంతులేని బ్రదుకు కనుచున్
విలసించి చేయు వ్రతముల
ఫలముగ నీ సుతుఁడు వొడమెఁ బ్రమదం బొప్పన్.

చ॥ పొడమినదానికిన్ సుగుణభూషణుఁగంటివి తల్లి! యంచు నే
రుడుగని పేర్మినన్ బొగడు చుండుట మీ యనురాగవల్లి నా
కడుపునఁబూచి కాచియునుఁగన్నుల పండువు సేసె నంచు నా
యెడఁదకుగల్గు మోదమున కే యెడ నెందును మేర యున్నదే?

137. కం॥ పురుషుని యనురాగ సుధా
సరసున నోలాడు సాధ్వి సతి తా నెందా
ర్యురువీచులఁదూగాడదె?
సురచిర భాగ్యముల పెంపు సొంపున వెలయన్

138. కం॥ నాకును మీకును లోపం
బేకరణినిఁగన్న లే దహీనగుణాఢ్యం
డీకుఱ్ఱఁడనుచుఁదెలుపుదు
రే కోవిదముఖ్యు లెంతయునియుఁ బేర్మిన్.

139. కం॥ ఐనను నా మనమునఁగల
యీ సెగలుకు హేతు వున్న దార్యా! యది నా
మానసము నిచ్చి తెల్పెదఁ
బూనుమ! నా కోర్కెఁదీర్పఁబుణ్యచరిత్రా!

140. కం॥ మన కుఱ్ఱని జాతకమును
మన జాతకములనుఁ జూచి మహనీయుఁడొకం
డనుమానింపక దెలిపెను
మన భావియు వాని భావి మరి సర్వమ్మున్.

141. కం॥ ఇంతవకు నాయు నెఱుఁదెల్పి నట్టులే
జరుగు చున్న దింక జరుగ కున్నె ?
మనము సందియమ్ముఁ గొననేల? యీ వసం
తమున వడుగుఁ జేసి ప్రమద మంద

142 కం॥ వచ్చినయది యేడవ యే
డచ్చుగఁ గుఱ్ఱనికి నుపనయమ్మునుఁ జేయన్
మెచ్చరె? విబుధులు నాదగు
ముచ్చటయినుఁ దీరకున్నె? **ముదముం** దనరన్.

మన హితముం దలంచు గుణమాన్యులు గారె? పురోహితుల్ జగ
143 జ్జన నుత పండితప్రకర సంస్తవనీయులు వేదపారగుల్
మన కిఁక నేమిలోప మనుమానము నందుచుఁ జూడఁ గుఱ్ఱఁ డెం
దనుపమ వాగ్విశేషరసనాగ్రుఁడు దారులు నాదుసోదరుల్.

144 కం॥ వడుగుం జేసిన యంతనె
యిడి పిల్లనుఁ బెండ్లిఁ జేయ నెంచెద రీనా
యెడదం గల కోరిక వెం
బడిగం దీర్పంగ నెంచ వలదే? మీరల్

అని నిజ జాతకక్రమము నంతయుఁ దెల్పియుఁ బూసగ్రుచ్చిన
ట్లనుపమ సత్యభాషలు మదగ్రజు లెన్నఁడు నాదు మాటఁగా
దని యన రీ నిసుంగుఁదమ యల్లునిగాఁ గయికొండ్రు మీరలుం
గని ననుఁ బేర్మి నాదగు మనమ్ము ముదంపడఁ జేయఁ బూనరే?

146. కం॥ అని జన యాయుశ్శేష
మ్మునుఁదెలుపం జూచి పొంగి పొరలెడు దుఃఖ
మ్మును నాపికొనఁగలేమిన్
గనుకొని కను లశ్రుపాతఁపుంగమి గురియన్.

147. కం॥ పలుకంజాలక నిజపద
ములఁబడుసతి లేవ నెత్తిముగుదా! యెంతేఁ
దెలిసిన వారల కన్నను
దెలివింగొను ధీర యిట్టి తీరుం దగునే?

148. తే॥ గీ॥ జనన మరణాలు నైజముల్ మనకు వాని
గోల యేటికి? మన బిడ్డకుం గడింది
వైభవమ్మున నీ మనో భావ మలర
నడుగఁజేసెద దీనికి వగవ నేల ?

ఏ యే యోగము లైనఁ జెప్పెదరు గానీ తెల్పఁగా నేర్తురే ?
యాయుర్భాగ్యము, డసకోన మయి నీ స్వాంతమ్మునఁదింతగా
హేయం బైన దురంతచింతఁగొన నౌనే? యౌర! యింకేని నీ
నా యాయుర్విషయమ్ము నెత్తక ముదం బందఁగ నీ కొప్పెడిన్

ఉ॥ బాపలు పండితోత్తములు ప్రజ్ఞగలా రగుగాక పార్వతీ
శాపముఁద్రిప్పఁజాలుదురె? శాస్త్రరహస్య మెఱింగి తెల్పఁగా
నోపునె? యెంత ధీయుతుఁడు నూరక నీ మన మందు నిట్టి సం
తాపము నందఁబోకయ ముదం బలరన్ శుభముల్ దలంపుమా!

శా॥ అని లింగన్న యనేక రీతులను గావ్యా బానత్తి మానస
మ్మున నెక్కన్ బ్రియ భాషణమ్ములను సంబోధించుచుం బెంచిం
గొనగోటం బయికొంగునం గను కొలంకుల్ జార కన్నీటి ధా
లునుఁబోగిటుచు నొత్తుచున్న తరి ముల్లోలాశ్రుచిన్మూర్తియై.

మ॥ పతి పాదమ్ముల కంజలించి సుమసీ భావమ్ము రేకెత్తసం
తత మాత్మేశ్వరు పాదసేవనమె చిత్తం బందు వాంఛించు నా
మతి యన్యం బెటు లెంచుమీహృదయ సమ్మానంబె యీనాడుజీ
విత భాగ్యోదయ మన్న కామసుసతిన్ వీక్షించి లింగన్న దాన్.

మ॥ వరుసన్ దెప్పుడు మంగళాత్మక వచస్సారాబ్ధి నీదాడు చ
య్యరవిందాలయు కీడుజోడయిన కామాంబా ముఖాబ్జమ్మునం
జిరునవ్వుల్ నవమల్లికా సుమములై చేదోడు వాదోడుగా
విరసెన్ గన్నవ లల్లకల్ప కవకున్ వియ్యమ్ము నెయ్యమ్ముగాన్.

ఉ॥ అంతఁబురోహితప్రవరుఁడాదట రాఁదలఁగొల్పి టించ శు
ద్ధాంతర భక్తి మ్రొక్కిడి సుఖాసనమున్ వెలయంగఁజేసిమీ
యంతటి పండితుల్ గురుప్రభావునుఁ గాదె? మదీయభాగ్యమిం
తింతనరాని పుణ్యఫల మిచ్చెడిఁగిరితి బూాలు బూచెదన్.

మ॥ అని లింగన్నయుగామమాంబికయు నాహ్లాదమ్ము రేకెత్తభ
క్తినిరూఢిన్ వచియించు వాక్సరణి కెంతే మోదముంబొంది చి
త్తసి యా తద్బుధపుంగవుం డిడుచు వేదాశీస్సు లల్లంతఁజెం
తన గేల్మోడ్పుల నున్న గోపననుఁజేతఃప్రీతి దీవించియున్.

156 ఆ॥వె॥ ఇతని కతన మీకు నెంతయే నభ్యుద
యమ్ము గలుగు వంగడమ్ము వెలయు
నితని కీర్తివల్లి యీరేడు జగముల
విరిసి భక్తిపుష్పవృష్టి గురియు.

మ॥ అనుచుం జేరిమిమంచి మూర్తి యిడి బ్రహ్మజ్ఞానియన్ భాగ్యభో
గ్యనిధానుం డగు నీ కుమారుఁడని లింగన్నన్ బ్రశంసించి యం
తన గామమ్మనుఁజూచి నీ కడుపు పంటన్ నేనునున్ ధన్యతం
గనినాడన్ జుమి మీకు బ్రహ్మనగుటం గళ్యాణి! నిక్కమ్ముగాన్

158 కం॥ అని యా యుత్తమ దంపతు
లను వారల పుణ్యఫలములను నెమ్మన మం
దున నెంతేఁదలపోయుచు
నెలమిని దీవించి విప్రుఁడేఁగెడు సంతన్.

159. కం॥ సరిగంచులు గల నూత్నాం
బరములు ఫల కుసుమ విసర పరిమళ వస్త్రా
త్కర యుత తాంబూలము బం
గరు పళ్లెర మందు నునిచి కౌతుక మొప్పన్.

చ॥ తనయునిఁజూచి దీనిఁబ్రియమదానఁబురోహిత హస్తయుగ్మమం
దున నిడు నాయనా! యనుచుఁదోరఁపు భక్తినిఁదెల్పునట్టి లిం
గనకునుఁగామమాంబకు మనం బలరం బ్రణుతించి భక్తి గో
పన నుదు రంటబ్రాహ్మణునిపాదయుగమ్మునుఁబట్టిమ్రొక్కియు

చ॥ తనయునిఁజూచి దీనిఁబ్రమదానఁబురోహిత హస్తగ్నయు మం
దున నిడు నాయనా! యనుచుఁదోరఁపు భక్తినిఁదెల్పునట్టి లిం
గనకునుఁగామమాంబకు మనం బలరం బ్రణుతించి భక్తి గో
పన నదు రంటఁబ్రాహ్మణుని పాదయుగమ్మునుఁబట్టిమ్రెక్కియున్

చ॥ గురువర! మీ పదాబ్జములు గొల్చియు మీరిడు పేర్మిదీవనల్
మురిపెముతోడ నంది ముదముం గదురన్ మిము సత్కరింపఁగా
నెఱపియు నేడు నాడు జననీ జనకుల్ ముద మందఁజేసి రె
వ్వరు సరివత్తురొక్కొ? పితృపాదులకుం దలపోయ నెందునేన్.

162. చ॥ అనుమను నారితేరిన మహాకవి యట్టుల గుప్పకుప్పలై
తనరఁగఁబద్యరత్నము లుదారుఁడు గోపన సత్కరించినన్
మన మలరం గ్రహించి బుధమండనుఁడైన పురోహితుండు గో
పన! భవదీయ సత్కృతి యపార ముదావహ మయ్యె నేడహో!

163. వ॥ అని యాశ్చర్యమాన మానసుండై నెమ్మనమున నిట్లు
వితర్కింపందొడంగె.

164. కం॥ వయసున కేడవ యేడట
బయికా డట కవనమందు భక్తిజ్ఞానో
దయుఁడట మియ్యవి సైజము
లయి యుండఁగ నోపు లేక యఁటవడు కెట్టుల్.

165 కం॥ చెప్పిన మాటయె తిరిగియుఁ
జెప్పన్ సరిపడని వయసు జిటిపొటిపద్యాల్
జెప్పినఁజెప్పందగు నిటు
లొప్పెనె? యత్యాశుధార యుబికి వచింపన్.

166. కం॥ పండితకవులే నన్గన
బెండుంబడి పద్య మల్ల వెఱతురు వీడు
ద్దండుం డవ్యాహతముగ
దండికవిత్వమ్ముఁజెప్పె దక్షత మెఱయున్.

చ॥ కనుఁగొన వీని తీ రితఁడు గారణజన్ముఁడునై జనించె లే
కునికి నెటుల్ లభించు విబుధోత్తము లౌదలఁదాల్చు కైతన
జ్జననుతు లౌననం దగిన జ్ఞానము, భక్తియు నీ వయస్సునం
దున, నిజమాడ యోగిజనధూర్వహుఁడెవ్వఁడొ యిట్టుపుట్టెడిన్

168. కం॥ శంకరభగవత్పాదులు
జంకెనె? గర్భాష్టమమున శాస్త్రార్థము ని
శ్శంకం జేయఁగ నితఁడా
యంకెకు వచ్చెడినిఁగైతయం దనదగెడిన్.

ఉ॥ వింటినిగాదె? పద్యములు వీనుల విందుగ దోస మొక్కఁడే
గంటినె? యెందునేని నుడికారఁపు తీయదనమ్ముతోడుతన్
జంటగ నర్థభావముల సౌరభముల్ వెదజల్లుచుండు టే
కంటినిగాని భక్తిరసకంధినిఁగ్రుంకుచు నీదులాచుచున్:

170. కం॥ నా కన్నుఁగవకు నేఁడియో
యాకృతి గనుపట్టు నితని యాననమున ది
వ్యాకృతి యిదియని తెలుపన్
నా కన్నను వాక్కు జాలునా? యనిపించున్.

171. తే॥గీ॥ఇతని కుపనయ నమునుఁజేయింప మూర్త
ముంచు భాగ్యమ్ము నేఁడు లభించి యుండె
నింక బ్రహ్మోపదేశమ్ము నెలమిఁజేయు
భాగ్యమున ధన్యుఁజేసి నై వరలఁదగనె?

172. కం॥ అనుచు ముదంభోనిధియం
దునఁగుంకుచు విప్రవరుఁడనూన గుణాఢ్యుం
డనుపమ విద్యావిభవుఁడు
గొనకొని గోపన్న వంకకుం గను నంతన్.

173. కం॥ ముకుళిత కర కమలుం డయి
ప్రకటిత భక్తిప్రపత్తి వరలుచుఁగుఱ్ఱం
డకలం కాత్మా! విద్వ
త్ప్రకరార్చిత! గురువరేణ్య! ప్రణుతి శతమ్ముల్.

174. కం॥ అని వందనమునుఁజేసినఁ
గని నాయన! మనుమ! వెలయఁగలిమియు సుయశో
ధనదీ ర్ఘాయుష్యమ్ముల
నని గురుఁ డాశీర్వాదించి యానందమునన్.

175. కం॥ అనె చేరఁజీరి కౌఁగిటఁ
గొని బుగ్గలు పుణికి ముద్దుగొని పేరిమి గో
పన! యేఁగి వత్తు నని లిం
గనకామమ్మలు ముదమ్ముఁగని వెంబడఁగన్.

చ॥ గురుతర పాండితీ విభవుఁ గోవిద ముఖ్యుఁబురోహితోత్తమున్
మురియుచు సాగనంపి నగుమోమున వెంబడి వచ్చుపుత్త్రినిన్
మురిపెముతోడ నెత్తికొని ముద్దిడుచుం బతితోడఁగూడి సం
బరమునఁగామమాంబ యెడఁబాయని వేడుక నిల్లుచొచ్చియున్

177. కం॥ తనయుని వడుగు ముహూర్తఁపు
పనులున్ బుధ, బంధు, మిత్రవర్గాహ్వాన
మ్మును మున్నగు కార్యమ్ముల
వినుపన్ లింగన్నమంత్రి వేడుక వినియున్.

178. తే॥గీ॥ ఆప్తమిత్త్రులు, బంధుగు, లఖిలవిబుధ
వర్గములు బేర్మి రా శుభాహ్వానములనుఁ
బంపి యీనాడె నేనును బయన మగుదు
నీదు సోదరులనుఁ బిల్వ నీరజముఖి.

ఉ॥ తక్కిన కార్యజాతము నుదాత్తమతిం దలపోసి చేయఁ బె
న్మక్కువ నూను మిత్రజన మాన్యు లనుంగులునుం గలారు నే
నొక్కఁడ నీ సమస్త మెటు లోపెదనో యను శంక వీడి నీ
వెక్కుడు వేడ్కఁజేయఁదగు నెల్లపనుల్ వొనరింపబూనుమా!

వ॥ అని సహధర్మచారిణి కామాంబ సర్వం బెఱుంగం దెల్పి.

వినయ విధేయతల్ మెఱయ విజ్ఞతఁజేయఁగఁదగ్గ కార్యముల్,
బనిఁగొని చేయఁగాఁదగినవారలకున్ నియమించి యెందుఁ బా
యని యనురాగవల్లి విరియన్ సుకులాంగన దాను వేడ్క న
క్కనచుచు, మాదనన్ బిలువఁగాఁజనె వేకువ గోలుకొండకున్

182. కం. తనసోదరు లక్కన మా
దనలం బిలువంగఁ జేర్మవళు కొత్తఁగ నేఁ
గిన పతి బంధు ప్రీతిని
మనమునఁ గొనియాడుకొనుచు మఱి కామముదాన్.

ముదమునఁ దొల్తఁజేయఁదగు ముఖ్యము లౌ పను లేవి యేవియో
మదిఁగని వానికిం దగు సమర్థుల కయ్యవి దెల్పి బుద్ధిసం
పదమును నోరుపున్ మెఱయ బందుగులౌ నని మెచ్చ వీధిలోఁ
బదయును మోప కుండఁబతిభావమురంజిలఁగూర్చె నన్నియున్.

కొడుకును వద్దుపెండ్లికొడుకుం బొనరింపఁగ మంచిమూర్త మే
ర్పడె నని రద్ది రేపకడ పచ్చెడు లె దెడ మింత యింటి కీ
గడియకు రాకయుండెఁబతి కారణ మేమొకొ? యన్న శంక దా
నుడుగక యుండి యుండి కనుచుండెను గ్రామము వీధివంకకున్.

అంతన లింగనాహ్వయ మహాసచివాన్వయ వార్ధిచంద్రుఁడ
త్యంత ముదబ్ధి వీచి నివహమ్ములఁ దూగుచు నుండె నాగ గ
త్యంతర వాజివాహనుఁడువై చనుదెంచుటఁగాంచు కామమా
స్వాంతముపొంగెఁబార్వణశశాంకునిఁగాంచుసుధావర్ణవంబటుల్.

ఉ॥ అత్తరి సంతలోన నెదు రౌ పతి కంజలి జేసి మున్న యా
యత్తముఁజేయు కప్పురపుటారతియిచ్చియుఁ బాద్యమర్ఘ్యమున్
మెత్తని యాసనమ్ము నిడి మేకొని వీచుచు సేవదీరఁగన్
బత్తిని నాఘపాల నిడు పాత్రికఁజేతికి నందియిచ్చియున్.

చిర్తునగుఘ్రాణమ్ము బ్రాల్కఁ ధళిచెన్ను వహింప మృదూక్తి పుష్పమా
ధురి శ్రుతిపేయమై తనర దోర్లతికల్ బరిసేవనా సుమో
త్కర సుపరీమళమ్ముల నితాంత ముదంబుధిఁగ్రుంకు వెట్టఁగా
నెఱపెడు కామమానతి మనీషితముం బతి దా నెటింగియున్.

188. కం॥ పలుకుంబల్కుకున్నఁ దేనెలు
జిలుకన్ స్యాలకుల రాచసిరులును నవ్వా
రలు ధనకుఁజేయు మర్యా
దలు లింగన దెలుప సతియుఁదనియుచు సంతన్.

189. కం॥ మావదెనలు మా యన్నలు
భావము రంజిల్ల సపరివా రోదార
శ్రీవెలయ నెత్తు-రోక్కొ?
యీవేళవ సమయమునకు నేనియు నన్నన్.

190. కం॥ చెచ్చెర వచ్చినచో రా
వచ్చును నీనాడె వీలుపడ కుండినచో
వచ్చెద రీ వేకువకే
నచ్చగ విద్వద్వరేణ్యు లౌనని మెచ్చన్.

191. కం॥ అని పలికిన లింగన ప
ల్కును విని కామమ్మ ముదముఁగొని యంతం గో
పనసుం బెండ్లికుమారునిఁ
బొనరుప రాఁబిలువ వచ్చు ముత్తైదువలన్.

కని కన్నంతనె కేలుమోడ్పు లిడు చాకారించి రావించి యా
సనముల్ గూర్చి హరిద్రఁబూసియుఁబదాబ్జాతాలకుం కుంకుమం
బునఁబొట్టుంచియు నెమ్మొగమ్ముల ముదమ్ముం గొంచునవ్వారిదీ
వనలం గుఱ్ఱనిఁ బెండ్లికొడ్కు నొనరింపం బూని కామమ్మ దాన్.

193. తే॥గీ॥ ఆడుబిడ్డలు నట్టింటు నడుగఁబెట్టు
కుండఁగుఱ్ఱనిఁ బెండ్లికొడుకుం బొనర్ప
నగు నొకో ? కాకిచేఁ బిల్వఁబంపునంత
వచ్చి వాలరె? మా యాడుపడుచు లెప్డు.

194. తే॥గీ॥ వెంటఁగొని వచ్చెదను నాడుబిడ్డల నని
వెడలె నెంతేని ముదమునఁబిన్నమఱది
మొన్నటికె వారు రాఁదగి యున్నవార
లిప్పటికి నేని రాకుండి రేమి సేతు?

195. తే॥గీ॥ ఆడుపడుచుతనమ్ములు నతిశయములు
నెఱుఁగ రెన్నడు మా సేమమే తలంతు
రట్టి మా యాడుపడుచు లిప్పట్టునందు
నాలసింపఁగఁగతమేమొ! యరయనైతి.

196. తే॥గీ॥ ఆడుపడుచులు మంగళహారతు లిడి
పెరిమి నాశీస్సుభాక్షతల్ పిల్లవాని
శిరమునం దుంచు భాగ్యము జేకుర కుని
కేమి కలగిన ఫల మొకయింత గలదె !

197. కం॥ నను నొకయప్పుడుఁ గాదని
యని యెరుగరు మేరు వట్టు లరయుదు రన్న
త్తనయునిఁగను నంతనె స
జ్జనసుతమతు లేమనంగఁజాలెద ? వారిన్.

198. ఆ॥ వె॥ మాటవరున కేని మా యిచ్చు కాన్కలు
జాల వనుచుఁబలుకఁజాల రెపుడు
వారితలఁపెఱింగి వర్తిల్లుటే కాని
యెగ్గుఁజేసి యెఱుఁగ నే నొకప్డు.

199. ఆ॥ వె॥ లేక లేక కన్న యీ కందు కీనాఁడు
వడుగుఁజేసికొనెడి భాగ్య మబ్బె
నాడుబిడ్డ లింట నడుగిడ కుండెడు
దశ యదేమొ ! నేడె తారసిల్లె.

వ॥ అని యనుకొనుచు నాడుపడుచులకు నన్నగారియందుం గల భక్తిప్రపత్తియు,దనయందుం గల గౌరవభాగ్యమ్మును, నముంగు మేనల్లునియందుం గల యనురాగసంపత్తియుఁ దలంచుకొనుచు.

201. తే॥గీ॥ ఆడుపడుచుల యాశీస్సు లందకుండు
శుభము శుభముగ నామదిఁజూడఁజాల
నస్మ దాంతర్యమే మంచి దయిన నిపుడ
వచ్చి వాలరె? నా యాడుపడుచు లెలమి.

202. వ॥ అని కృత నిశ్చయుమై మనఃపరిశోధనా రత శుద్ధ
సంకల్పుఁడై కొంత తడ వుండి యెందులకు రా॥
కుండెదరు? వచ్చితీరుదు రెదు. రేగ ధర్మ వని
సింహద్వారము వంకకుఁజను నంత.

చ॥ అలయిక నెంచకే వదెన యందలి గౌరవ మన్నబిడ్డ యం
దలి యనురాగ మన్న యెడ హత్తిన బత్తియు రూప సంపదల్
బొలిచె ననంగ లేనగవు మొల్లలు దీయని పల్కు తేనియల్
జిలికెడు మోముదమ్ములనుఁజెచ్చెర వచ్చెడు నాఁడుబిడ్డలన్.

చ॥ కని కనినంతఁ బెన్నిధులు గైవసముం బొనరించుకొన్న చా
డ్పునఁదలఁదాటి పొంగు ముదముం గను లశ్రుల వాన లీనఁ బో,
యనితమి బాహువల్లికలు నక్కునఁ గ్రుచ్చి కవుంగలింప నా
య్యనఁదన యాడుబిడ్డలను నర్మిలిఁబల్కుచుఁ గామమాంబదాన్.

205. తే॥గీ॥ పాలమున్నీట ముద్దులపట్టి యాది
లక్ష్మి యానా డొకర్తుక ప్రభవ మందె
నస్మదీ యాన్వవా యాబ్ధి నవతరించి
రీ మహాలక్ష్మ లీనా డహీన గుణలు.

206 కం॥ ఏమియు నెఱుఁగని ముగుదల
సీ మా మరదండ్రఁగంటిరే? యని దరహా
సామోదామృత వాక్సుమ
దామయునై కామమాంబ దనరెడు పేరిమిన్.

207. తే॥గీ॥ ఆల వెంబడు లేగలలీలఁ గన్ను
విందుఁజేసెడి తన్న యాఁడుబిడ్డల నిసు
వులను బుగ్గలు పుణుకుచు నెలమి ముద్దుఁ
గొనుచు నక్కునఁజేరుకొనుచు నంత.

చ॥ అలరుచు నాడుబిడ్డల కరాంగుళులం గొని లేతనవ్వులన్
బలుకుల తేనియల్ దొరలఁబాల్కడలిం దలపింపఁజేయు మో
ములఁగని పేరంటాండ్రు ముదముం గొన బ్రేదులతాంత్రగుచ్ఛపుం
గలిమియొ నాగ వచ్చె నతి కామను దీవన లెంచి బిడ్డకున్.

209 వ॥ అయ్యెడ.

210. తే॥గీ॥ ముద్దుమోమున నామమ్ము, బుగ్గఁజుక్క,
పసపుగోచియు, నొదలఁబగిడి, యడుగు
లందుఁబసపును, బారాణి యందగింప
నదితిసుతునోలు వాని మేనల్లువాని.

211. కం॥ తలదాటిన కొమ్మురువున
నలరెడు నవవటువు గోపనార్యకు మేన
త్తలుఁగని యాశీరక్షత
లెలమిం దల నిడియు నార తిచ్చిరి వేడ్కన్.

ఆలరుచుఁ జేరఁటాండ్రుడు, ముదియవ్వలు,ముగ్ధలు, గన్య, లెల్లవా
రలును శుభోక్తులన్ వటు శిరమ్మున నుంచిరి మంగళాక్షతల్
దలఁపులు బాల వాన లయి దద్దయుఁగామమ మోదవారిధిం
జలకము లాడ లింగన యజన్రు శుభోదయుఁడై వెలుఁగఁగన్.

213. వ॥ అంతఁగామమా సతి నెమ్మనమ్మున నిట్టనుకొను.

214. కం॥ అరవిచ్చు కలువపూవుల
నెరి విరిసెడు తమ్మిపూల నిరుపమ శోభా
కర వర మగు కొల నటు లీ
వర కాంతాజన సదస్సు వైభవ మొప్పన్.

215. కం॥ ఈనాటికిఁగద యిందరు
మానవతీ మణులు వచ్చి మన్మందిర మెం
దానందవనము సేసిరి
నా నోముఫలమ్ము పంట నాగన్ బళిరే !

216. వ॥ అని బహుప్రకారమ్ములఁదలపోయుచు నక్కాంతా నివ
హమ్ము లానందమ్ము నందఁబాదమ్ములకుఁబసపురాచి
చందన తాంబూలాదు లొసంగఁదగు వారల నేర్పరించి

ఎనయు ముదమ్మునన్ మొలకలెత్తుచు నార్ద్రత వీడకుండుమేల్
సెనగలు వాయనమ్ము లిడఁ జెచ్చెర నిండుగఁబళ్లెరమ్ములం
గొనుచు బహూకరించుచును గోరిక వీరిక లెత్తఁదత్సతీ
జనములు బంధు సంతతులు సంతస మందఁగఁజేయు సత్తరిన్.

219. తే॥గీ॥ బావమరదులు, మిత్రులు, బంధుజనులు
ప్రమదమున వచ్చుచుండిన వార్త నెఱిఁగి
తత్తరమ్మున నెదు రేఁగి మెత్తని మదిఁ
బ్రేమవల్లిక దృక్సుధావృష్టి గుఱియ.

220. తే॥గీ॥ దరిసి చిరునగు మల్లెదొంతరల వెలయు
వదన నీరజ మానంద వార్ధి ముంప
నాద రోదార భావపుష్పాంజలు లిడ
బాహులత నిక్షురస మిడఁబలుకుతీపి.

221. కం॥ హెచ్చును లోచ్చెఱుఁగని మది
వచ్చిన బందుగులు నెల్లవారలు నెంతే
మెచ్చన్ రావించుచుఁదా
నచ్చఁపు గూరిమిని లింగ నాహ్వాయుఁడంతన్.

222. తే॥గీ॥ ఆస నార్ఘ్యాదు లొసఁగి యుష్ణాంబువులను
స్నాన మొనరుపఁజేయు చుత్సాహ మొదవ
నెల్లవారలు నవ్వారి నేమములను
సలుపుకొనఁదగు సదుపాయముల నొనర్చె

223. వ॥ అట్టి యెడ.

తన గేహమ్మున కేఁగుదెంచెడు సుహృద్వర్గమ్ము, బంధూత్కర
మ్మును, విద్వజ్జను, లెల్లవారలును సామోదమ్మునుం బొందుటే
పనిగా నెంచి యొనర్చు లింగనకృతుల్ భావించి యెవ్వారలున్
మనమం దెంచుచు లింగనన్ మఱియుఁ గామాంబన్ ప్రశంసించుచున్

225. వ॥ ఆహ్నిక క్రియ లొనర్చుకొను నంతం బురోహిత
ప్రవరుండు గామాంబం గని యిట్లను.

226. కం॥ ఇఁక రాఁదగు ముత్తైదువు
లకు సాయంసమయ మపుడు రా నిడఁదగు రా
రిఁక నే నారీమణు లి
ష్టకలంకముగా నొనర్ప నగుభోజనముల్.

227. కం॥ వచ్చిరి బంధుగు లెల్లరు
వచ్చిరి గ్రామస్థు లెల్లవారలు నేరే
వచ్చిన వత్తురు వడ్డన
మచ్చుగ నగుసరికిఁ జేయు మాయతనమ్మున్.

నాపుడుఁ గామమాంబిక మనమ్మునఁ దద్గురు నాజ్ఞ భక్తి సం
భావనఁ జేసి మౌళిఁ గరపంకజముల్ ముకుళింప మ్రొక్కి భూ
దేవ పదారవిందయుగ దీధితి మోమునఁ గ్రొత్త తళ్కుడన్
దా వినయమ్ముతోడుత ముదమ్మున మ్రొక్కుడఁ జేసెఁ గుజ్జుచేన్.

229. వ॥ అంత.

శా॥ విద్యుత్సన్నిభకాంతిపుంజములఁగన్పిందుల్, గవోష్ణంబులో
ఖాద్యాడుల్రుచిరాన్న,సూప,ఫలశాకా, లేహ్య,చోష్యావళుల్
ప్రద్యోతింపఁగ భోజనార్థు లలరన్ వడ్డింప సంతుష్టు లై
రాద్యం తామ్రుతకృష్టులన్ మునిఁగియాయాబంధు విప్రావళుల్

231. తే॥ గీ॥ ఇష్ట మృష్టాన్న భుక్తి సంతుష్టు లైన
యెల్లబంధుగులున్ విప్రు లెలమి మెఱయఁ
గమ్మకస్తురి తావులు గుమ్మనంగఁ
గప్పురఁపు విడెములిడె లింగన్నమంత్రి.

వ॥ అయ్యెడ బంధు, మిత్రాతిథి, బృందమ్ములు దాంబూల చర్వణ మొనర్చుచు నిష్టాలాపమ్ముల, వినోద కథా ప్రసంగమ్ములఁగొంత తడ వుండి భుక్తాయాసమ్ముఁదీర సుఖ శయితులై యుపరా ష్ణోవసానం బగుడు మేల్కనినయంత.

ఉ॥ అచ్చఁపుపుష్ప త్సరోవరము నందునఁబూచిన కూర్మితమ్ములఁ
బొచ్చెము లేని ప్రేమరసముం దలముక్కలుగా గ్రహించి తాఁ
దెచ్చి యొసఁగెనో యనఁగ దీయని చక్కెరపానకమ్ము ధీ
మచ్చయ మౌ ననంగనిడె మాన్యుఁడు లింగన వెండి గిండెలన్.

చ॥ వరుసఁగ మండువాకు నలువైపుల వైచిన యాసనమ్ములన్
మురిపె మెసంగ బంధుజనముల్, బరదేశులు, విప్రసత్తముల్
వరుసలు దీర్చి దిద్దినటు బారులు దీరిచి కూరు చుండ న
త్తరి మధుమాసలక్ష్మి యవతారములో యన నంగనా మణుల్

చ॥ వరుసఁగ నొక్క రొక్కరుగ వచ్చుచు నొక్కరి వీడ కుండ నె
వ్వరు మది మెచ్చుకో లిడఁగఁ బాయని వేడుక మోముదమ్ములన్
జిరునగుమల్లికల్ విరియఁజిత్తము దైవపరమ్ముగాఁగ నె
ల్లరికడ నుంచసాగిరి జలమ్ముల నిండిన వెండిచెంబులన్.

236. కం. విరిసిన కల్హారములకు
నెరి యీడును జోడు నయిన నిద్దఁపుమొగముల్
గురియన్ భక్తిరసమ్మును
హరువొప్పఁగ నిడిరి వెండియాకులు వరుసన్.

వరుసయు వావియున్ వెలయ బంధుగులం బరిహాస భావ భా
సుర మృదు, గౌర, వాదర, వచోమృత ధారలు జాలువార భూ
సురవర గౌర వాభిదలఁజొబ్బిల భక్తిను మానవమ్ము నం
దరియెడ దైవభావన నుదార కరాంబుజముల్ రహింపఁగన్

238. కం॥ వరుసఁగ నిడు తత్పాత్రిల
వరుసం దప్పకయ నేత్రి పర్వంబగుచున్
వరలన్ విహువిధ ఫలముల
నెరి నుంచఁగ నెంచి యంత నీరజ నయనల్.

239. ఆ॥వె॥ అమృతరసముఁజిందు నమృతపాణి కదళి
కా ఫలములు మాని కముల పోత్రివు
లనఁగఁదళుకు బెళుకులను జిమ్ముచునుఁ దేనె
వాక లీను మేలు పనస తొనలు.

నిజ సుమ నోనురాగమును నించిన పూర్ణ సువర్ణ కుంభముల్
గజిబిజి నొందకుండఁగ రకమ్ముగఁబెట్టిన దొంతులో యనన్
రజతపు పళ్లెరమ్ముల విరాజిలు తీయని మావిపండ్లు త
ద్విజులు సెబా సనంగ మది వేడుక నందఁగ బంధువర్గముల్

241. తే॥గీ॥ తళుకు వజ్రపు రాపొడి బెళుకు లీను
మిసిమి బదియారువన్నె మేల్పసిడి రేకు
లనఁగఁజక్కెర రజమున నలరి మధుర
రసముఁజిందు ననాసఫల శకలములు.

242. తే॥గీ॥ రకరకమ్ముల చూతఫలమ్ము, లనటి
పం, డ్లనాసలు, వడపప్పు, పానకములు
నెవరి కెయ్యని వలయునో యెఱిఁగి వారు
వద్దువద్దను మో మోటపలుకు లరసి.

243. కం॥ ఆ లింగని కృపచే మన
యీ లింగన యేర్పరించె నెలమినిఁగొన మీ
కేలా ? మొగ మోటమి యని
హేలగ వడ్డింపఁదొడఁగి రెల్లరు వనితల్.

244. కం॥ పరదేశులు బందుగు లను
తరతమ భావములు గొనని తరళేక్షణ లె
ల్లరియందుం బరమేశ్వరు
దరిసెడి యౌదార్య కల్పతరు లౌర! బళీ!

245. తే॥గీ॥ అనుచు నతిథులు, బరదేశు, లాత్మబంధు
వర్గములు, మిత్రములు, జూడవచ్చు నెల్ల
వార లా యూ సుఫలర సాస్వాదనమునఁ
దనిసి యానంద పాథోధి మునుగు నంత.

246 తే॥గీ॥ కుత్తుకబంటిగ విందుం
గుత్తంగొను బంధుజనులకును నతిథులకున్
మెత్తనిమదిఁదములమ్ములు,
నత్తరువులు నిడియె లింగ నాహ్వాయుఁడాస్థన్.

247. కం॥ చందన తాంబూ లాదుల
నందరిని బహూకరించు నా లింగన యా
నందమ్ముం గొన నందరు
విందుం గొనియాడి రెలమి వెలయఁగఁదుష్టిన్.

అక్కన మాదనల ఆగమన ప్రశంస

అయ్యెడ గోలకొండ సచివాగ్రణు లక్కన, మాదనాహ్వయుల్
248. నయ్యన వచ్చుచుండి రిఁక రాగల రిచ్చటి కొక్క జాములో
నొయ్యన నన్న వార్త నిడె నొక్కఁడు, లింగన కామమాంబ కా
తియ్యనిపల్కుఁ బల్కు నెరితీపి జనింపగఁ దెల్పెఁబూనితాన్.

మ॥ తనకుం జేరిన స్త్రాల కాగమన వార్తన్ బేరిమిన్ విన్చు లిం
గన వాక్యాసన మరందధార శ్రుతియుగ్మ స్వర్ణకుంభద్వయిం
గొను చానందసుధార సార్ణవమునందుం గ్రుంకు కామమ్మ దృ
గ్వనదమ్ముల్ గురిసెన్ నితాంత శుభసౌభాగ్యామృ తాసారముల్

ఉ॥ అంతఁబురోహితప్రవరుఁడాయమ మానసముం గ్రహించి సు
స్వాంతవు నీవు కామమ! భవ త్సహజన్ములు నట్టివార లిం
తం తనరాని భాగ్యవిభ వేందిర మాదన ముద్దుపట్టి ధీ
మంతుఁడు నీదు ముద్దుల కుమారుఁడు గోపన చెట్టబట్టెడిన్.

251. కం॥ అని యాశీఃపూర్వకముగ
వినుచు పురోహితుని జ్ఞానవృద్ధున్
గని కామమ భక్త్యున్నతి
ననె నిటు లౌదల ఘటించి యంజలిపుటమున్.

252. తే॥గీ॥ పలుకుపలుకునఁ దేనెలు జిలుక నెలమిఁ
బలుకు మీపల్కు లెల్లఁబ్రాబలుకులె గద!
యుల్లమొడలను మాసేమమే తలంచు
గురుల యాశీస్సు శుభపరంపరల నిడదె?

253. వ॥ అని యంతఁబతింగని

254. కం॥ మురియుచుఁజిరునగు మల్లెలు
విరియన్ వర నాంబుజమున వేడుక మదిఁగ్రే
ళ్లురికన్ గామమ మృదువా
క్సరణిని ననురాగమధువు జాల్వార ననెన్.

మ॥ భవదీయప్రతిమాన బంధుజన దివ్యప్రీతిచేఁగాదె? మ
ద్వ్యవసాయమ్ము ఫలింప బందుగులు, విద్వన్మిత్రబృందమ్ములవ్య
వధాన మ్మగు మూర్త మైన మది రవ్వంతే మరొండెంచకే
నవునం చెల్లరు మెచ్చ వచ్చి రిటు లాహ్లాదమ్ము రే కెత్తఁగన్.

256. కం॥ నా యన్నలు నా వదినలు
నా యెడదకు ముదము గదుర నా యింటికిఁదా
రీ యెడ రా నున్నా రనఁ
బాయని మీ కూర్మి పేర్మి ఫల మనఁదగదే ?

257. కం॥ పతి ప్రాత్రీవ్రతము నందిన
సతి గౌరవ మింత యనఁగ శక్యమె ? భవదీ
య త యౌదార్యమె కాకుని
కతి ముదమున వత్తురొక్కొ? అన్నలు, వదినల్.

258. మం. అని ముదముం గొను కామము
మనముం గ్రహియించి పేర్మి మన్ననఁగనె లిం
గన దృఙ్మధుప వ్రాతము
లనుపమములు భావగీతు లాలాపింపన్.

259. క॥ అంతం బోక మృదూక్తిల
తాం తాసవ రుచుల వెలయు హస్తన్యాస
స్వాంతోదంచ ద్భావుకో
దంతుండై యొప్పె లింగ నార్యుం డంతన్.

సూర్యాస్తమయాదికము

ఉ॥ వచ్చుచు నున్నవారు సచివప్రవరుల్ సహజన్ములంచు లో
నచ్చఁగ నెంచుకామమ మహత్తర గాఢమ నోనురాగ సం
పచ్చయ మొక్కపెట్టున నభమ్మునకంటి చివిర్చెనాఁగఁ దా
ముచ్చటఁబద్మరాగ ఘృణి పుంజయునై చనెఁబశ్చిమాశయున్

నన్ను ను నాదు వంగడమునం జనియించెడు రాజచంద్రులన్
మన్ననఁగాంచు భూసురులు మాన్యుల వంశమునం జనించి; గ
ర్వోన్నతు లౌ తురుష్కుల మహోన్నతిఁగోరెడి మంత్రులైరి వీ
రన్న! కనుగొనం దగునె? యన్నటు భాస్కరుఁడబ్ధిఁజొచ్చెఁదాన్

262. సీ॥ కర్మసాక్షియు, జగచ్చక్షువునున్, లోక
బాంధవుం డగు పద్మబాంధవుండు
సురిగె రాత్రించరుం డరుదెంచు లేరాజు
కలుముల రే డని కలిమి దక్కి
పద్మినీ కామినీ వదన పంకజముల
ముకుళిత భావముల్ మొలక లెత్త
దిన మెల్ల నిం దున్న తీపిచే నిఁక నున్న
బ్రదుకు బందిగముల పాలుగాదె ?

తే॥ గీ॥ యనుచు నొ త్కుమ్మడిగ రేగి యంబరమ్ము
నంటి నాలుగు చెఱగుల నలమికొనిన
గండుతుమ్మెద పిండ్లను కరణి మూగెఁ
దమము లీ విశ్వనంద నోద్యాన మెల్ల.

అక్కన, మాదనల శుభాగమనము

చ॥ అతులిత దానధర్మరతు లక్కన మాదన లన్నదమ్ము లా
యతమతి చాతురీ విభవు లౌదలఁదాలుచు మంత్రివర్యు లు
న్నత గుణగణ్యు లుత్తమ జనస్తుతిపాత్రు లటన్న సద్యశో
వితతులు నింగి ముట్టెనన వెల్గఁగఁజొచ్చెనుఁదార కావళుల్.

తొగకన్నెల్ నగుమోము పళ్లెరము లందుం బల్కుకప్రంపు ప
ల్కుగమిం దీపము లుంచి కెంజిగురు టాకుంగేల నీవాళు లి
యఁగఁదారల్ జయగీతికల్ వలుక రాత్ర్యబ్జాక్షి కెంగేలు బ
ట్టఁగ దివ్యల్ సుమవర్షముల్ గురియమింటన్ వెల్గె శీతాంశుఁడున్

265. మ॥ అయ్యోడ నేలకొండపల్లెం గల ప్రజలెల్లరు గుమిగూడి

266. తే॥గీ॥ మనలఁబరిపాలనముఁజేయు మంత్రివరులు
మనపురీవాసు లియ్యోడ మనలఁజూడ
వచ్చుచున్నారు గోపన వడు గొకండు
కారణమ్ముగ రెండునుఁ గలిసిరాఁగ

267. వ॥ అని యనుకొనుచు వికసిత వదనారవిందులై యెదు
రేఁగం దగు సమయ మాసన్న మయినటు గన్పట్టుచున్న
దని యను కొనుచు డోలు, సౌనాయిలు, తాషా, మురు
బ్బులు, రామడోలు మేళమ్ములు, కొమ్ముబూరాలు,
మున్నగు వాద్యవిశేషమ్ములతోఁగతిపయపరివారులగు చుఁ
గామమాలింగనామాత్యులును, గ్రామోద్యోగులు మున్నగు
నధికారవర్గమ్ములు బలిసిరా వంది మాగధ బృందమ్ములు
యశోగీతమ్ములు గానమ్ముసేయ, భటరాజులు భల్ల
పాణులై కైవారమ్ము లొనర్ప నలు కెలంకుల గాలి
దివ్వెటులును, గాగడాలును వెలుంగ, మతాబులు, జిచ్చు
బుడ్లునుఁ, బొట్టుపాగ లొనర్ప మధ్యమధ్య శతఘ్నిధ్వాన

మ్ముల దిగ్భిత్తులు బీటువార, విడుచుపేతడవుగ రిష్వన నంబరమ్మునంటు తారజువ్వలం దొరలు కాంతిపుంజమ్ము లాకసమ్మున నుండి గనుఁగొను దివ్వె లలరి వర్షించు చంద్రకాంత పద్మరాగాది మణిప్రభల నభిషేకం బొనర్ప నారోహణావరోహణక్రమమ్ముల గ్రమముం దప్పని సాంగాధ్యయన సంపన్నులు స్వస్తివాచనమ్ములు సేయఁ బుష్పమాలాలంకృతమ్ములగు నవరత్నాంచిత సువర్ణోద కుంభములు గొని పుణ్యదంపతులును, గప్పురంపుటారతులం గొని సంచర ద్వికసిత నవకల్పకమ్ములో యన నలరారు నవయౌవన భూషణ భూషితాంగులును, దరహసిత వదనారవింద లగు కన్యకామణులును, నాదబ్రహ్మోపాసనా నిరతులగు గాయక గాయనీ మణులును నర్తనవిద్యాచాతురీ ధురీణ లగు వార విలాసినీ సమాజమ్ములును నొండొరులు క్రమముం దప్పక కన్నుల పండువు సేయు మందమంద గమనమ్ముల నడచుచు సపరివారు లయి గ్రామసీమమ్ము దరి కరుదెంచు మహామాత్యు లక్కన, మాదన సోదర పుణ్యదంపతుల కెదురేఁగి రాజమర్యాదల నడుగులకు మడుగు లొత్తుచు మహావైభవమ్ముల మహోత్సాహ దీపితులం జేసి రావించుచు గ్రామమ్మున రాజపథమ్ముఁజొచ్చుతరి.

28. సీ॥ పసుపు కుంకుమములఁ బచ్చని తోరణ
మ్ములగృహమ్ముల నొప్పు కలిమిపొలుపు
రకరకమ్ముల ముగ్గులను బహుభంగుల
లలిమించు వీధి చిత్రముల హొయలు
బహువిధ పుష్పసువాస నాకలితశీ
తల గంధవాహ పోతముల చెలిమి
వివిధమ్ము లగు నత్తరువుల సౌరభ్యముల్
దనరు కస్తూరి గంధముల సురభి
తే॥ గీ॥ నలరు నప్పురిఁబ్రతిగృహ మందు వనిత
లక్షతలు, లాజలునుఁజల్లి హారతు లిడి
భక్తిఫల పుష్పము లొసంగి ప్రణుతిఁజేయు
విధము నేత్రోత్సవంబయి వెలసె నందు.

### సభాసమావేశము — పండితకవి సన్మానము

266. వ॥ అంత లింగ నామాత్యు గృహసమీపమ్మున కరుదెంచుతరి నేల యీనిన చందమ్మునఁగ్రిక్కిరిసి వచ్చు జనసందోహమ్ము నందందం గూరుచుండ నియమించి హిత, పురోహిత, విద్వ, దుద్యోగి, బంధుజన పరీవృతు లగు నయ్యమాత్య సోదర కుటుంబమ్ముల బంధుప్రీతి, రాజమర్యాదలం దనిపి వీధియందు వైచిన పచ్చని పందిట నేర్పఱచిన సభాస్థానమ్ము నందు.

270. సీ॥ విరిసిన కల్హార సరసిజమ్ముల నొప్పు
సరసున రాయంచ జంట లఱుల
నిరుపమ పండి తా నీకాన నాంబుజ
ముల నొప్పెడు సభాస్థలము నందు
నగ్రపీఠమ్ముల నయ్యమాత్యకుటుంబ
ముల కల్మిబల్మియు వెలయ నిలిచి
యెలమిమైఁబురవాసు లెల్లరుఁదొలితొల్త
స్వాగ తోదార మర్యాద నొసఁగఁ

తే॥ గీ॥ బండితులు మెచ్చుకో లిడ దండికవులు
సరస కవితావినోద విస్తరులఁ జేయ
ముదము నందుచు నమ్మంత్రిముఖ్యు లంత
భక్తిఁ బ్రణమిల్లి సత్కవి పండితులకు

271. తే॥ గీ॥ పట్టుదోవతులును మేలుపచ్చడములు
గప్పురఁపువీడ్యములు, రత్నకంకణములు
మున్నుగాఁగల కానుక లెన్నియొ యిడి
యాదరించియు నాశీస్సు లందికొనిరి.

272 వ॥ అయ్యెడఁగామాంబ లో నిట్లనుకొను.

273 కం॥ కన్నెత్తి చూడ వెఱగగు
నన్నుల భాగ్యోదయమ్ము లనుపుగ నాకుం
గన్నుల పండుపు సేసిన
యన్నుల వదెనలను నెన్నరా ? యెవ్వరున్.

274. కం॥ అన్నలకును వదెనలకును
నన్నుం గను పేర్మి నెన్న నా కగునో కో?
యెన్నంగన్నులు నాల్కలు
బన్నుగ నలవడక యెంతవారికి నగునే?

275. కం॥ నా నిసువు వడుగు కతమున
నే నీనాఁడిట్టు లెంత యేనియు ముదముం
గానం జాలితి నియ్యది
నా నోముఫలమ్ముగాదె? నామది నరయన్.

276. కం॥ పతియేనాఁడు గృపామతి
సతిఁగను నానాఁడె వలచు సకలార్థమ్ముల్
సతి నను వాగర్థమ్ములు
ధృతిఁగన సత్యములుగావె? యెల్ల రెఱుంగన్.

277. కం. నాపతి భాగ్యోదయమును
నాపతి ప్రేమోదయమ్ము నా పతి విద్యా
వ్యాపక సుజ్ఞానోదయ
మే పండితముఖ్యు లెన్న నెఱుఁగరె? యేరున్.

తే॥ గీ॥ ఇచ్చు వేళల జేతికి నెమ్ము లేదు
పెట్టునెడఁ బక్షపాతమ్ము గిట్టఁబోదు
యోగి యనవలెనో! మహా భోగి యనఁగఁ
దగునొ మత్పతి నాయెదఁదట్ట కుండె

కం॥ అని యన్నల పేరిమికిన్
మన సిచ్చియు మాట యిచ్చి మమతం గను శ్రీ
ఖనియును జిష్ణుని యగు పతి
యనురాగౌదార్యములకు నలరుచు మరియున్.

కం॥ తన యన్నల ప్రాభవమునుఁ
దనపతి యౌదార్యగరిమఁదద్దయు మదిలోఁ
గనుఁగొంచు లోటొకింతయునుఁ
దనకున్ లేదనెడి తుష్టిఁదనరెడు నంతన్.

వ. పురోహితుని వలన సభముగియు సంగతి నెఱింగి.

చ॥ వదెనలఁ, బిడ్డలన్, సపరి వారలుగాఁదన యింటిలోనికిన్
ముదమునఁదోడితేర మునుముందుగఁ బేరిమి నాడుబిడ్డలన్
సుదతులఁదోడివారలను సుందరులన్ సఖురాండ్రఁగూడి తా
నెదురుగ నేఁగెఁజూచిన యహీన చరత్సురభూజ
మోయనన్.

మ॥ తలుకొత్తన్ సిరి పేర్మి పెంపునను జేతఃప్రీతిఁగావించు చి
త్కవితం గామమఁగాంచి తత్సుతులు జిత్తం
బందుసం బొంగి రా
కలుముల్ భోగములున్ సమస్తమును నొక్కం
డెన్న మా యాడుప
డ్చుల ప్రేమం గొను భాగ్య మొక్కఁడని
యంచుం దెల్పఁగాఁజెల్లెడిన్.

మ. అని యామోదముతోడఁ దెల్పుచును నా
యా బంధు సత్కారముల్
గొనుచున్ బందుగు లందు నెవ్వరెద సంకోచింపఁగాఁబోని రీ
తిని వర్తించుచు మాట లాడుచునుఁ బ్రీతిం
గొల్పుచున్ వచ్చు న
క్కన, మాదన్నల ధర్మపత్నుల గుణోత్కర్షన్
మదిన్ మెచ్చుచున్.

కం॥ ఇంత నిరాడమ్బర మే
యింతుల యందేనిఁ గలదె? యీ యింతుల కే
యింతులు దులయగుదురె? సిరి
నింతకునున్ నిండుకుండ లెటుఁదొణకునొకో.

వ. అని యయ్యమాత్య సతీమణుల నెల్లరు లలనామణులు
మెచ్చు కొనున త్తరి.

తే॥ గీ। బాల్యమిత్త్రులు, బందుగుల్, బావమరదు,
లాప్తు లెల్లరు నంటిరా నక్కనయును
మాదనయు లోని కేతెంచి రాదరమున
నెల్లవారలు బందుగు లుల్లసిల్ల. 287

మ॥ మమురావించి యమాత్య బంధుతలు
సంభావించి ప్రేమించిత
త్క్రమమున్ బాగుగ నెంచి మించి
సహజౌదార్యమ్ము రే కెత్త మా
ప్రమదల్ మేము ముదబ్ధిఁ గ్రుంకు లిడ సల్పం
జాలు మా బావ భా
గ్యము ధీభాగ్యము నెన్న శక్య మొకొ ? యం
చక్కన్న మాదన్నలున్.

కం॥ మనమున లింగన యొనరుచు
ననుపమ గౌరవము నెంచి యక్కజపడుచున్
మన సిడి పలికెడు మిత్త్రిల
ననుఁగుల బంధుగుల గూడి యలరుచు నంతన్.

మం॥ కనుగొన్నంత భుజించు కోర్కె వొడమంగో
వాచవుల్ రేపి యం
తన నెప్పుడు భుజింపఁబూను టను తంద్రం
జిత్తము జొన్పు వ్యం
జన భక్ష్యాదుల షడ్రసోదనములన్
సంతుష్టులై రెల్ల ర
క్కన. మాదన్నలు, బంధు, మిత్రులును లింగన్నన్
బ్రశంసించుచున్.

వ॥ అంత లింగన్న యయ్యక్కన, మాదన, సోద రామాత్యు లకుఁదక్కిన బంధు, మిత్రాతిథి బృందమ్ములకును యథ స్థానమ్ములిడి కప్పురఁపు తాంబూలంబు లొసంగి యిష్టాలాపమ్ముల నుండు నయ్యవసరమ్మున.

చ॥ వదినలు, నాఁడుబిడ్డలును, బందుగు,
ఎల్లరు నీరజేక్షణల్
మది నొకరూపుగాఁగనుచు మానిత
గౌరవ సంప్రదాయ సం
పద వెలుఁగొంద నాదరము, బంధుత,
సఖ్యతయున్ రహింప
సుదతులు మెచ్చుకో లిడెడు చొప్పునఁగాముమ
మోదమేర్పడన్

తే॥ గీ॥ వడ్డనముఁ జేయ నెల్లరు వారిజాత
నయన లానందమున భోజనమును జేసి
వహ్వారె! కామమం బోలు వారి జూక్తిఁ
గాంతుమే ? యని ముదమునఁ గ్రాలుతరిని.

తే॥ గీ॥ పాద నీరజములఁ చాయ పసపుఁబూసి
గ్రీవముల చందనముఁ వ్రాసి భావ మలర
నుదుటఁగుంకుమబొట్టుంచి రెదను మెచ్చ
నైదవుల కెల్లవారల కబ్జముఖులు.

తే॥ గీ॥ సరస పరిహాస మధుర వాక్సరణి నుస్మి
తాననాంబుజయై కామమాంబ నెమ్మి
వావివరుసలు మెఱయఁగ బ్రంపుతముల
ముల నొసంగెను నల్లరు ముదమునంద.

ఉ॥ అంతఁబురోహితుండు ముది తాత్ముఁడు
కామమఁగాంచి నీవు సు
స్వాంతవు నీదు సోదరులు, జాయలు,
బందుగు లెల్లవారలున్
మంతున కెక్కు భాగ్య గుణమాన్యు
లుదారుఁడు వీదు భర్తయిం
తిం తనరాని భాగ్యవిభ వేందిర వెన్నఁగ నౌనె?
నీ సుతున్.

కం॥ అన్నలు నైజా మేలెడు
మన్ననున కాప్త సచివమాన్యులు విద్వ
త్సన్నుతమతి పతి నీసిరిఁ
గన్నెత్తియుఁగనఁగలారె? కామమ యన్యుల్.

కం॥ నీ సుతుఁ డాయుష్మంతుఁడు
భాసుర భూమీసు రేంద్ర భవుక జ్ఞా నో
పాసిత రామ పదాంబుజ
వాస మనోభ్రమర భాగ్య వైభవుఁడమ్మా!

కం॥ అని యను చానంద సుధాం
బునిధిం గుఖ్బం కిడుచు నశ్రువులు జెక్కిళు లం
దున వరదల్ వారఁగ గో
పన వంకం గనుచు మరియుఁ బలుకం బూనెన్.

కం॥ మీ కోలము వారు మీరలు
గా కేనుఁదరించు భాగ్యగరమముఁ గలిగెన్
మీ కడుపు పంట గోపన
కీకరణిని వడుగు మూర్త మేర్పడు కతనన్.

కం॥ మీ యన్నలు మీ వదెనలు
మీ యనుఁగులు బంధుజనులు మేదుర విభవుల్
హాయిగ నిదురింపం దగు
నా యతనము నింకఁజేయ నగుఁగామాంబా!

చ॥ అని యను నంత బ్రాహ్మణుని యానతి
నౌదలఁదాల్చి యంతనే
జనసుత కామమాంబ సుఖశయ్యల నెల్లరి
కేర్పరించి న
జ్జననుతుఁడౌ పురోహితుని సన్నిధికిం
జనుదెంచి భక్తియు
క్తిని గురు దేవు పంపుననుఁ దెల్లముగా
సకలమ్మొటింగియున్.

కం॥ తన పెనిమిటి యౌదర్య
మ్మునకున్ మన మందుఁబొంగి పొరలెడు మోదాం
బునిధిన్ మునుకలు వైచుచుఁ
దన భాగ్యము నెంచుకొనుచుఁదద్దయు మదిలోన్. 303

కం॥ మురియుచు గురుఁడెఱిగించిన
యెఱుకను ధవునకును దెలుప నెంచియు బంధూ
త్కరములు, మిత్త్రులు, ద్విజు, లె
ల్లరు నిద్దురగొనుచు నుంట లక్షించియుఁదాన్. 304

క॥ మెలమెల్లనఁజని పతి మది
యలరన్ సర్వమ్ముఁదెలిపి యాగతమును జి
త్కలితుండౌ పతియునుఁదా
నెలమిని నరుదెంచి గురున కెఱగియు భక్తిన్. 305

కం॥ గురువర ! భవదీ యాశీ
స్స్ రుచిర నిగమ ప్రసూన సూనృత సుధలన్
వరలెడుఁగాదే ? మత్కుల
సురభూజ ముదారపుత్త్ర సుఫల వ్యాప్తిన్. 3(

చ॥ అని చరణాంబుజ ద్వితయ మందున
వాలిన భక్తి వ్రాలి పా
వనమతిమై ముదశ్రుపులఁబాద్య మొసంగియు
నాన నాబ్జ, లో
చన నవ పుండరీక, కరపల్లవ సంచయ
పూజసేయు న
య్యనఘులు మంత్రిదంపతుల యచ్చఁపుబత్తికి
మెచ్చి విప్రుఁడున్.

తే॥ గీ॥ పెరిమి నాశీర్వదించి సంబరము మెఱయఁ
బలుకు పలుకున తేనియల్ జిలుక భావి
భవుక కార్యకలాప సంపద్విశేష
మెలమిఁ దద్దంపతులకును దెలియఁ జేసె. 308

ఉ॥ అంతఁబురోహితప్రవరు నచ్చటనే శయ నింప వేడి త
త్స్వాంతము మెచ్చు వెట్టు మృదుశయ్య సమర్చి
బహూకరించి వి
శ్రాంతినిఁ జెందఁ దెల్పి నిదురం గొనుటం గని
భక్తియుక్తిఁ దద
త్స్వాంతము నంద లింగనయుఁ, దత్సతియున్
శయనింప నెంచియున్.

కం॥ మన పూర్వ పుణ్యవశమున
మన కుల గురుఁడయ్యె విబుధమాన్యుఁడుదారుం
డనఘుం డీయన నెన్నన్
మన కగునె? యనుచు గురుని మదిఁగనుఁగొనుచున్.

తే॥గీ॥ అంత నించుక విశ్రాంతి నందఁదగు న
టున్న పతిమన మెఱిగి కామమ్మ గురుని
పాదతలముసఁబతికినిఁ బతిపదాంబు
జాతసన్నిధిఁదనకును శయ్యల నిడి. 311

కం॥ అలసిన పతి చరణాంబుజ
ముల నొత్తుచు నెలమి నిదురఁబుచ్చియు నిదురం
గలయని యెఱుగక ముద్దుల
పలుకుల రఘురామచరిత పలికెడు సుతునిన్. 312

కం॥ కని ముద ముందుఁగౌఁగిటఁ
గొని ముద్దాడుచును బెరిమి కొమరుని గోప
న్నను మేలుకొలిపి తనచెం
తన పండుకొనంగఁజేసి తానిదురించెన్, 313

వ. అంత గొంతవడి నెల్లరు సుఖనిద్రాసక్తులై మఱచి
యున్నతరి.

## ప్రత్యేకాదికము

ఉ॥ కాల మెఱింగి సక్రమముగాఁ బొనరించెడు కార్యజాతముల్
మేలిడు ధాత్రి కంచుఁ బెరిమిన్ విధి వేకువ లేవ నెల్లరున్
గాలమెఱుంగనిడ్డ ఘటికా ఘనయంత్రనినాదమో యనం
గోలతనమ్ము వీడి వడిఁగొక్కురు కోయని కోడి
కూసెఁదాన్. 315

ఉ॥ ఒక్కఁడె దేవుఁడున్ గురుఁడు నొక్కఁడె
యొక్కఁడె సాధ్వికిన్ ధవుం
డొక్కఁడె వేడు దేశమున కొక్కఁటె మాట
గుణాఢ్యు నోటి కెం
దొక్కటె పత్ని యుత్తమున కో జనులార
యటంచుఁ దెల్పనాఁ
జుక్క యొకండు దాఁబొడిచె నూటిగఁ దూర్పున
నెల్ల రారయన్.

ఉ॥ అంతఃపురోహితుండు, సుగుణాఢ్యులు గామమ
లింగ నాహ్వాయుల్
స్వాంతములందుమాపతిపదాబ్జ సపర్యల నుండుచోఁ బికి
కాంతలు మంగళాభ్యుదయ గాన రసాంబుధి
ముంచె నంతనే
యొంతయు వేడ్క సేసె విన నింపగు డోలు
సొనాయి మేళముల్.

చ॥ కలకల రావముల్ దెసలఁ గ్రమ్మఁ జిగీషను శారికా శుక
మ్ములు సుముహూర్తముం దెలుపు
పుష్కర వాదములుం బొనర్పఁ జు
క్కలు, దొగకన్నెలున్ జెలిమి కానికినై
తప మాచరింపఁ బ్రా
జ్జ్వలన ముఖాంబుజాత మనురాగ ధునిన్
వెలయించె నయ్యెడన్. 318

తే॥ గీ॥ కలిఘటమ్ములు, జిట్టు తట్టలును రెండు
వైపులను వ్రేల దోహన పాత్ర లొప్పు
కావడులు మూపులం దాల్చి పోపఁ జొచ్చి
రెలమిఁ బొలములకును రైతు లెల్లవారు. 319

కం॥ పురవన కేళీ సరసులఁ
బరిపరి రీతులఁ జెలంగి పవ నాంకురముల్
అరవిరిసిన నవసరసిజ
పరిమళముల మాని యెలమిఁ బైకొనఁ జొచ్చెన్. 320

తే॥ గీ॥ వేదవిధులనుఁ ద్యజియించు వెఱ్ఱి మొఱ్ఱి
భక్తి వేదాంతములు ముక్తి పథము లనుచుఁ
బలుకు కుటిలుల పలుకులు బటుతరములు
గాపు, కావంచు వేనోళ్ళఁ గాకులఱచె. 321

తే॥ గీ॥ అంత సుస్నాతు లగుచు ధౌ తాంబరములు
దాల్చి భస్మ త్రిపుండ్రముల్ ధరణిసురులు
దాత్త గతినిడు నర్ఘ్యప్రదాన మహిమ
మఖిల జగమును స్వర్ణమయమ్ముఁజేసె. 322

కం॥ నిగమస్వరూపు నుదయము
నిగమమ్ముల వెలయఁజేయు నిగమత్రయమున్
జగతీ త్రయమును మనిచెడు
నిగమమ్ముల మనుచు ధర్మనిష్ఠులు విప్రుల్. 323

అని విజ్ఞుల్ దమ మానసమ్మునఁ దపస్స్వాధ్యాయ సంపన్నులన్
ఘనులన్ వైదిక ధర్మకర్మ రతులన్ మన్నించుచున్ భూసురేం
ద్ర నికాయమ్ములుగారె లోకవితతిన్ రక్షించు దైవమ్ము లం
చనికొండాడుచు స్వస్వధర్మపరులైయానందముం బొందుచున్.

కం॥ మన లింగన కొమరుఁడు గో
పన కుపనయనంపు టుత్సవ మ్మిపుడింకన్
మన మేఁగ కుంటఁ దగదని
యనుకొనుచున్ వేగ మేఁగి రప్పురివారల్. 325

సీ॥ సముదిత బాలభాస్కరబింబ సదృశాన
నోజ్వల కాంతి మహోదయమ్ము
ప్రత్న నూత్నవసంత లక్ష్మీవిహా రోద
యస్థానమై జగ మలమి కొనఁగ
సుప్రసన్నత్వ సద్వి ప్రత్వ బ్రహ్మత్వ
వైభ వారామసంపత్తి వెలయఁ
దత త్రయీమూర్త్యవతార భేదమ్ములో
విధివదన ప్రతి బింబ తతులొ

తే॥ గీ॥ అనుచుఁజూపరు లాశ్చర్య మంది చూడ
నక్కనయు మాదనయు మది నక్కజపడ
లింగనామాత్య వరుఁడంతరంగ మందు
ముద్వనధిఁగుంకఁబొలిచిరి భూమిసురులు. 326

తే॥ గీ॥ రాజనీతిజ్ఞులై మహారాజులలరఁ
బ్రజలు జై వెట్ట సామంతరాజు లెలమి
నంద ధనధాన్యసంపదలందగింప
మహితగతి నేలుబడి నెంచు మంత్రివరులు. 327

వ. వెలయు నానభాస్థలి పాలవెల్లువం బురుడింప నయ్యెడఁ
బచ్చని తోరణమ్ముల నలంకృతంబై రంగవల్యాదులఁగను
పండువుసేయు నుపనయన వేదికయందుం బ్రవేశింపఫల
కుసుమ దక్షిణాన్వితమ్ములగు తామ్బూలమ్ముల నంజ

ులం గొని పురోహిత పురస్సరులై ఆమ్నాయ సూక్త ములనగ్ని ప్రార్థనాది దైవప్రార్థనల నరుదెంచు ఆచార్య వటు మాత లానందంబంద బంధు మిత్ర పరివారమ్ము లుల్లసిల్ల నాశీరక్షతలం గొని భూమిసుర బృందమ్ము లుచ్చైస్స్వరమ్మున నేకకంఠమ్ముగ నుదాత్తానుదాత్త స్వరిత ప్రత్యయాదిస్వరభేదమ్ముల శ్రుతిపేయమ్ములగు నాగమానువాకమ్ముల స్వస్తివాచనం బొనర్ప ఫలప్రదానమ్ము లొసంగి భూసురాశీర్వాదము లంది. 328

చ॥ అలకమలాసనప్రతిముఁడైన పురోహితుడుండఁగా శుభం
బలరఁగ బ్రహ్మపీఠి నుద యాననుఁడౌచును దక్షిణమ్మునన్
వెలయఁగఁదత్సమీపమునఁ బిల్లఁడు లింగనమంత్రి కామమా
లలనయుఁబశ్చిమంబున విరాజిలఁజొచ్చిరి ప్రాఙ్ముఖమ్ముగన్

వ. అంతఁబురోహితప్రవరుఁడు,సభానుమతింగొని యాచార్య పత్నీ వటువుల నాచమింపం జేసి యథాక్రమమ్ముగ గణపతిపూజా పుణ్యాహవాచ నాదు లొనరింపఁ జేయుచుండ. 330

అక్కన మాదనాహ్వాయ మహాసచివుల్ దమ ముద్దు లల్లునిన్
మక్కువఁగాంచుచున్ సుజన మానితవర్తను బావ లింగనన్
నెక్కొను గౌరవమ్మున గణించుచు సోదరిఁగామమాంబఁ బెం
పెక్కిన పేర్మిఁగన్గొనుచుఁ బెద్దలనెన్నుచు మెచ్చ చెల్లరిన్.

సీ॥ తమ పరివారముల్ దగురీతి సేవింప
రాజమర్యాదలు రాణ సెలఁగ
ముద్దుసోదరి మది ముదమంద బావయు
భావమ్మునందు సేబాసనంగ
నయిన బంధుగులెల్ల రౌదల లూపంగ
వహ్వారే! యని సుధీవరులు మెచ్చ
నెల్లవారలు బళి యిటులుండవలె గాదె?
యని బంధుతను మది నాడికొనగ

తే॥ గీ॥ రాయసమ్ము నమాత్యత, రాచఠీవి,
పరిమి, మర్యాద, వినయ, వివేక, భక్తి
సాదరౌదార్య భావము లాకృతులను
దాల్చె నోయన నొప్పు సోదర్యు లెలమి. 332

ఉ॥ బావకు నందుపాటుగ శుభమ్ము సమస్తము నిర్వహించు సఁ
భావనఁదత్పురోహితుని పజ్జ సుఖాసన మందు నుండి భా
గ్యావహులై నయక్కనయు నాతనితమ్ముడుమాదనాహ్వయుం
డేవసుధామరుల్ బుధులునెన్నఁగ బంధుగులాత్మ మిత్త్రిలున్

వ. అయ్యెడ.

కం॥ లింగన యనుజులు స్యాలకు
లుం గడు ముద మొదవ యెల్లరున్ మెచ్చుకొనన్
బంగారు పళ్ళెరమ్ముల
రంగుగ నిడి పండ్లు కప్పురంపు విడియమ్ముల్. 335

కం॥ ఘుమఘుమలఁ జల్లదనముల
బ్రమదంబిడు నత్తరువులు పన్నీ రామో
దమునన్ రాయుచుఁ జల్లుచుఁ
బ్రముదిత పరిహాస గౌరవములు రహింపన్. 336

ఉ॥ వైదిక లౌకికాన్వయులు బాప లుదార గుణాఢ్యు లెందరో
మోదమునన్ సభన్ వెలయ భూరి యశోర్థులు బంధుముఖ్యు లా
మోదముఁజేయ నాందిముఖముం బొనరింపఁగ జేసి రెంతయే
నాదట మేనయల్లునకు సక్కన మాదన మంత్రిపుంగవుల్. 337

వ॥ అంత.

సీ॥ బరమహర్షమ్మునఁ బంచశిఖల్ పెట్టి
లలిత గాయత్రీ విలాసుఁజేసెఁ
బేరిమి యజ్ఞోపవీతమ్ము ధరియింప
జేసి ద్విజత్వ సంసిద్ధి గొనఁగె
మొలచుట్టితా వస్త్రమును మేఖలయు జ్ఞాన
సంసిద్ధి కజినంపు జన్నిద మిడె
నొందంగఁజేసెబ్రహ్మోపదేశముదుష్ట
దర్పాపహపలాశ దండమిచ్చె

తే॥ గీ॥ మహిత సిద్ధి ప్రదను వేదమాతనిడియు
హవ్యముల దేవతానుగ్రహమ్ముఁ బడయఁ
జేసె నర్చించిహుతవహు భాసురమతి
నాత్మజునకు గోపనకు లింగన్న మంత్రి. 339

కం॥ చందన మిడి తామ్బూలము
లందున్ రంభా పలాదు లమరించి యిడి యే
రెందున్ మెచ్చగఁ జేసిరి
యందలి క్రమముం గ్రహించి యౌనన నార్యుల్.

వ॥ అయ్యెడ బురోహితోక్త ప్రకారమ్ము హుతవహోపాసనా
హోమవిశేషాదుల మంగళవాద్య ఘోషమ్ముల జంత్రగాన
నినాదమ్ముల, భూసు రాశీర్వాద వేదనాదమ్మున సానం
దమ్ము రేకెత్త దైవజ్ఞ నిశ్చిత లగ్న సుముహూర్తము
నకుఁదమ ముద్దుల పట్టి గోపనకు నుపనయన సుము
హూర్త బొనరింపంజాలితి మనికామాంబా లింగనమంత్రు
లమందానంద కందళితహృదయారవిందులైపురోహితుల
కంజలించి, వటువుచే నాది త్యోపస్థానమ్మును సమిధా
ధానమ్ము నొనరింపఁజేసిన యంత. 341

క॥ గురుఁడెఱిఁగించిన తెఱవున
వరగోత్ర ప్రవర లెలమిఁ బలికియు జననీ
చరణమ్ములు నుదురంటఁగఁ
గర మర్ధిని మ్రొక్కి భక్తి గదురఁగ వటువున్. 342

క॥ ముద్దు మోము నఁదు ముసి ముసి నగవులు
పఱువు లిడగఁ దొలుతఁబసపు చాయ
పటఁపు టొడిని బట్టి భవతి! భిక్షాం దేహి!
యనుచు మాతృభిక్ష నర్థి వేడె. 343

తే॥ గీ॥ జనని పేరిమి మేలిమి స్వర్ణపాత్ర
భిక్షదోయిట ముమ్మారు బియ్యమిడియె.
బర్వమునఁ జందురుంగన్న పాలకడలి
చెన్ను నిద్దపు మోమునఁ జెంగలింప. 24

తే॥ గీ॥ పెరిమి నవరత్నములు పొదివిన పదారు
వన్నె మేలిమి బంగరు బటువు వటువు
చివురు కెంగేల బెట్టి యాశీశ్శుభాక్ష
తలనుఁదల నిడెఁగామమ్మ యెలమినంత. 34

క॥ హైందవ ధర్మం బుట్టిప
డం దండ్రికి మ్రొక్కి వటు వడంకువఁబితకున్
డెందంబలర భవతీభి
క్షాం దేహి! యటంచు నర్థిఁ గైకొనె భిక్షన్. 34

కం॥ జనని యటుల్ జనకుండును
నెనసినఁ బేరిమిని భిక్ష బియ్యం బిడియున్
గన కాంగుళ్యము నిడి శిర
మున నాశీరక్షతలను మురియుచు నుంచెన్. 347

తే॥ గీ॥ రంగుబంగరు పంచపాత్రిలును నుద్ధ
రణులు హరివేణెములు మేలు రత్నమయఁపు
బటువు లిచ్చిరి దీవించి వటువు మురియ
నక్కనయు మాదనయు వారి యనుగు సతులు 348

కం॥ కామాంబా లింగన లటు
హేమంబులు నూరులారు లిచ్చి రమాత్యుల్
ధీమన్నుతుఁడు పురోహితుఁ
డోమన్ నిగమాశివముల నుత్సుకుఁడగుచున్. 349

తే॥ గీ॥ మేనయత్తలు పతులును మేల్మి యుంగ
రములు బంగరు పాత్రిలు ప్రమద మెసఁగ
మేనయల్లున కిచ్చిరి మేదురంపు
టాశి షోక్తుల నక్షత లౌదల నిడి. 350

కం॥ తక్కిన బంధుగు లెల్లరు
నొక్కొక్కరు గాగ వార లోపిన యటు బల్
మక్కువ దీవన లిడి పెం
పెక్కన్ మురియంగ వటునకిచ్చిరి భిక్షల్. 35

వ. **అంత** మహదాశీర్వచన విద్వత్సభా సమ్మానములకు సమ
యంబగుడు. 352

తే॥గీ॥ చుట్టుబంగరు జలతారు పట్టుచీర
లును పసిడి పూల రైకలు మనసు పడెడు
రత్న భూషలు మంగళ ద్రవ్యములును
వదెన లిడి రాడు పడుచు సంబరము నంద. 353

తే॥గీ॥ బావ ఔదార్య గరిమకు బంధుగౌర
వమున కబ్బుర పడుచును భవ్య నవ్య
కనక చేలమ్ము లిడివటువునకు దీవ
నమ్ము లిడి రక్కనయు మాదనయునుఁబేర్మి. 354

తే॥ గీ॥ వటుశిరమ్మున ఆశీస్సుభాక్షతలిడి
దోయిటుం గాన్క లుంచి బుధుడు బురోహి
తునకు సత్కృతిజేసి సంతోష మొదవ
నెల్లవారలు సభ దీర్ప నుల్లమలర. 355

వ. అంత కామాంబా లింగన మంత్రులు నూత్నాంబర
భూషణ భూషి తాంగులై ఆచమించి సభాభిముఖులై
నిలువం బడి శిరమ్ములఁ గేల్దోయి ఘటించి నమస్కరించి
యథాతథ సుఖాసీనులై. అయ్యెడ విద్వన్ముఖ్యు లగ్గింప
బంధుమిత్రులెల్లరు మెచ్చు కోలిడ సహజౌదార్య సంపత్తి
వెలయ నాగమ ధర్మం బొదలందాల్చి. 356

తే॥ గీ॥ రత్నకంకణములు కుండలములు పట్టు
వస్త్రములు సేలువలును సువర్ణములును
దనరు కప్రంపు విడెమిడి తత్పురోహి
తునకు నంజలి జేసె లింగన మనీషి. 357

వ. అంత పురోహితానుమతిం గొని స్వర్ణ పుష్పాంచిత రజత పీఠమ్మును విద్వ దాసనమ్ముగ నేర్పటించి విద్వ దాహితాగ్నులను విద్వన్ముఖ్యులను క్రమంబుగ రావించుచు వారివారి యర్హతలం బురస్కరించుకొని యందరు సంతసించి మెచ్చుకోలిడుచు నాచార్యవటువుల కాయుర్వర్చోయశో బలాభివృద్ధులు పెంపొంద ఆశీర్వదించు చందం బెల్లరకు ముదావహం బగునటు చందన ఫల సువర్ణ తాంబూలమ్ములునంబరమ్ములు రాంకవమ్ములుసత్కరించి బావమరదులు అక్కన మాదనామాత్యులగ్గింప కించిత్స్మితాననుండై పరిహాసోక్తి ప్రసవంబుల ముదావహులం బొనర్చి పురోహిత ప్రవరు నవలోకించి యాశీర్వాదం బందుకొన పురోహితులు హరిద్రాక్షతలుంచినపైపుట్టంబు బాహు యుగ్మమ్మునఁ బట్టి వటువు దక్షిణ భాగమ్మున వెలయఁ గామాంబ వామభాగ మలంకరింప నానందాంబుధి నోల లాడుచు భూసు రోత్తము లొసంగు వేదాశీర్నాదమ్మున స్వస్తి మంత్రార్థమ్ము లందుకొని ఆడు పడుచు లొసంగు మంగళహారతి గొని తోబుట్టువు లానం

దింప నిమ్నాకారుల తాంబూలమ్ము లొసంగి, పత్నీ
పుత్ర సమేతుండై సభాభిముఖుండగుచు నిలువంబడి నమ
స్కరించి పురోహిత ప్రముఖులగు వృద్ధ దంపతులకు
అక్కన మాదనామాత్య సోదర భావుకులకు భవుకార్థియై
నమస్కరించి మాధ్యాహ్నిక భోజన సమయంబగుడు
బంధుమిత్రాతిథి బృందమ్ముల దేవతార్చనమ్మునకు వేగి
రమ్మునరా దెలిపి యంతన కొంతవడికి. 358

శా॥ బారుల్ దీరిచి పంక్తులన్ వెలయు విప్రశ్రేణులున్ బంధుసం
వారమ్ముల్ హిత మిత్రవర్గము దలంపం భోజనోత్సాహులై
వ్వారుంగన్నుల పండువన్నె అపుమద్భాగ్యంబు నెన్నంగనెం
దేరేనేర్తురె ? యంచునెమ్మదిని నెంతేనెంచుచు పొంగుచున్

ఉ॥ అందరి దైవభావమున నాత్మఁదలంచుచు మధ్యమధ్య గో
విందుని నామకీర్తనము వీనుల విందుగఁజేయఁగోరుచున్
డెందము నిండి పైబడు కడింది ముదశ్రువు లాజ్యధారలై
సందుగ్రహించి పాయసఁపు జాలులునై ప్రవహింపనయ్యెడన్

కం॥ కించి త్తెఱిఁగియు నెఱుఁగని
యంచిత మతి వడ్డనమ్ము నరయుచు బ్రేరే
పించుచు భుజియింపఁగ వ
డ్డించఁగ నవ్వారి నరసి డెందంబలరన్. 361

కం॥ పప్పును నేయియుఁబచ్చ
ళ్ళొప్పుగఁజీనామిరాయియుం బులిహోరన్
దప్పళము నేయి పాయస
మప్పడములు చూతఫలములనటి ఫలమ్ముల్. 362

తే॥గీ॥ పానకమ్మును మధు వుట్టిపడెడు వనస
తొనలు ఖాద్యమ్ము లెవ్వారు మనము నందు
ముదము నందుచు భుజియింపఁగోరుదువ జేయ
కెలమి వడ్డింపఁజేయుచు నెల్లరకును. 363

కం॥ మొగమోటమిఁగొను వారల
మొగములు పలుకులును చైదములు గని తా చి
ర్నగవుల దరికింజని వా
రగునన వడ్డించు కుడువ నానందించున్. 364

వ॥ అత్తరి. 365

కం॥ మనకన్న బావ పిన్నయె
యనుకొన్నను మేనయల్లుఁడన నెంచినచోఁ
దనయునకు దీటుగాడే ?
మన మియ్యెడ ముందుఁగుడువ మర్యాదయొకో ? 366

తే॥గీ॥ కార్యభారం బదెంతయోగల దటంచు
నాందిముఖ గౌరవమ్ము మనమ్ము నందుఁ
దలఁచి యక్కన్న మాదన్న లెలమిఁదెలియ
పఱచి సతులకుఁదోబుట్టు వెఱుఁగకుండ. 36

కం॥ తమతమ బాధ్యత లెవియో
ప్రమదమ్మున నెఱప నెంచి భావమ్మున యం
దమితములగు నా యాపను
లమితానందమునఁజేయ నగునను మదితోన్. 368

తే॥గీ॥ బంధు మిత్త్రుల పేరిమిఁబడయ నిదియ
సమయ మని యెంచి తాము సతులు నెలమి
నలరఁజేదోడు వాదోడు లగుచు; ముద్దు
చెల్లె లలరదె? బావయు నుల్లసిలఁడె? 369

వ॥ అని అంతకు మున్నె కృతనిశ్చయులై యున్న అక్కన
మాదన దంపతు లుత్సాహమ్ము రేకెత్త నాయా కార్య
పరంపరల నెంచుచు. 370

తే॥ గీ॥ బావతోపాటు భుజియింప వలయు నెమ్మి
వడ్డనముఁ జేయవలె బంధువర్గమునకు
విప్రవరులకు హితులకు వేయునేల?
ఎల్లరకు నంచు నెంతయే నెలమి మెఱయ. 371

ఆయాపంక్తులయందు వడ్డనముఁ జేయంబూని మోదమ్మునన్
నేయింగూరల పిండివంటులను పానీయమ్ములన్ బండ్లనున్
వేయం బూనిరి యారితేరిన జనానీకమ్మునుం బోలె వ
హ్వాయంచున్ మదిమెచ్చ నెల్లజనుల య్యక్కన్న మాదన్నయున్.

కం॥ మీరలు వర్ధనఁజేయం
గా రా నౌనొక్కొ ? లోటు గలుగక యుండం
గా రహిఁగనుఁగొనఁదగుఁగా
కారసి మీరే? వచింపు డాదర మొప్పన్. 373

కం॥ అని యిరువురి కరములు గొని
నను మన్ననఁగనుడు వినుడు నామాటలు పే
ర్మిని యను లింగనమంత్రిని
మనమలరం గౌగిలించి మంత్రివరేణ్యుల్. 374

కం॥ బావా ! మమ్మెవ్వరిగా
భావించెదు ! కార్యభారవహనము నందున్
మావంతు మేము గైకొనఁ
గావలయునుఁగాదె ? యిట్లు గాదనఁ దగునే ? 375

తే॥గీ॥ అదియునుం గాక నీకన్న నరయఁబెద్ద
వారమేకద ? కార్యమ్ము పట్ల కుడిచి
కూరుచుండంగఁదగునె ? పై వారి యటుల
మనము చూచుకొనందగు పనులు లేవె ? 376

తే॥ గీ॥ కలరు మీవారు మావారు కలిగియున్న
మనకు మనమయి యెన్నియో కనుగొనఁదగు
పనులు మిగులుచు నుండు నెప్పట్టు నందు
వినుము ! మామాట నన్యథా కనక మదిని. 377

కం॥ పదిమందితోడి పనియిది
ముదమున భుజియించి బంధుముఖ్యులు పెద్దల్
ముద మిడ నతిథులు నెల్లరు
ముదమున మన యొక్కపంక్తి భుజియింపఁదగున్ 378

కం॥ అని యొప్పజెప్పి వినయ
మ్మును భక్తియు వెలయు బావ మొగముం గని య
క్కన మాదన సోదర్యులు
మనమున సంతోష మంది మందస్మితులై. 379

తే॥గీ॥ తమ యమాత్యత్వ వైభ వోదాత్తతకును
తమ నిరాడంబరతకు నౌదార్యకార్య
భార వహనమ్మునకుఁగూర్మి బంధు మిత్రు
లలర నౌదల లూప బుధాళి మెచ్చి. 380

తే॥ గీ॥ అక్కనయు మాదనయు ముదమార నెల్ల
వారిఁగన్గొన నిష్పక్షపాతముగను
అలరి రాకంఠముగను దధ్యంతముగను
నిష్ట మృష్టాన్నములను సంతుష్టులగుచు

తే॥ గీ॥ ఆడుబిడ్డలు వదెనలు తోడుగాగ
నాడువారల కెల్లర కాదరమున
కుడుపు లిడియునుఁ తమలమ్ము లిడియుఁ గామ
మాంబ ముదమందె లింగన సంబరపడ. 382

మ॥ అమలాత్ముండగు తద్గురూత్తముఁడు
సంధ్యావందనం బగ్ని కా
ర్యము భిక్షాదికమున్ సకాలమునఁ జేయం
జేయుచో భక్తి మై
క్రమముం దప్పకజేయు నూత్నవటువౌరా!
యంచు మెచ్చున్ గురూ
త్తము నాజ్ఞన్ దలఁదాల్చి గోపనయుఁజేతః
ప్రీతివర్తిల్లెడున్.

తే॥గీ॥ బ్రహ్మచర్య ప్రభావమ్ము వర్ణ నియతి
కర్మమార్గమ్ము గార్హస్థ్య గౌరవమ్ము
మున్నుగా గల ధర్మముల్ మూడునాళ్ళు
తెలిపి రెల్లరువిన పండితులు సభలను. 384

కం॥ అనుదినము ధర్మచింతన
మున మధ్యాహ్నమ్ము సచివముఖ్యులు విద్వ
జ్జన వాక్సుమ మాధ్వీరస
మును గ్రోలి యధార్థ తత్త్వముం గని భక్తిన్. 385

వ॥ ఆయా పండితులఁజందన తామ్బూల సువర్ణనూతనాంబర సత్కృతులం జేయుచు వందనం బొనరింప వచ్చిన మేన యల్లుని గోపన్నం గని యానందమ్మున నాశీర్వచించుచు ముదంబుండిరి. 386

చ॥ గురుఁడు నమాత్య భావుకులు కోవిదులున్,
గురుతుల్యులైన కొం
దరు సరివారు స్యాలకు, లుదారులు తజ్ఞులు
బంధు మిత్రులున్
వరలఁగఁబంక్తి బంసరువు పాత్రల
నంగనలుంచఁ బోనముల్
మురిపెముతోడ లింగనయ భుక్తిఁగొనెన్
గురుముఖ్యులౌననన్. 386

కం॥ పాలాశహోమ మగువర
కీలిలన్ నాల్గునాళు లెల్లరు మెచ్చం
గా లలి కొంగ్రొత్తల బో
నాలిడె లింగన్న పురిజనమ్ములు మెచ్చన్. 388

తే॥గీ॥ బందుగులు మెచ్చఁబురివారు వహ్వారె ! యన
బాపలెల్లరు మెచ్చి సేబా సనంగ
దాస దాసీ జనమ్ము లెదం దలంచి
యెన్న లింగన్న చేసె గోపన్నవడుగు. 339

వ॥ అంత కామమాంబా లింగన లమందానంద పాథోధి
నోలలాడుచు అక్కన మాద నామాత్య సోదర దంపతు
లకు నమస్కరించి సమయోచిత మృదు పరిహాసోక్తులం
బ్రసన్నలఁగావించి వినయ విధేయతలు మెరయ సహజా

బార్యసంపత్తి రేకెత్తపది యార్వన్నె సరిగంచుల దుకూ లాంబరమ్ముల పల కుసుమ చందన తాంబూలముల హరిద్రా కుంకుమాది మంగళద్రవ్యమ్ముల యథార్హమ్ము లుగ సత్కరించి యాశీర్వాదమ్ములంది, అంతందనియక ఇయ్యది మాముద్దుల కోడలు కమలకు నని పన స్రామ కదళీ ఫలమ్ములు నిచిన కండోలమ్ముల నొసంగుచు మరియు మురియుచు దగ్గరకు వచ్చిన కమలాంబను చంకనిడుకొని తీయమావి పండు తినుమని చేతికిచ్చి రత్నాంబరమ్ముఁదొడిగి ముద్దిడి మరియు నంత నమ్మా! రమ్మని జనని పిలువ రా నని తల్ద్రిప్ప నత్తయ్య దగ్గరే యుండెదవా? యని పల్కు జననికి కమల ఊ యని సమాధాన మిచ్చుతరి నవ్వుచు తథాస్తను పురోహిత వచనమ్మున కెల్లరు నానందించుచు రాజమర్యాదల గోల్కొండకు ప్రయాణమ్ము జేసిరి. యంతఁ దక్కిన బంధువులు నూత నాంబరాది సమ్మానమ్ములంది వారి వారి గృహములకరిగిరి అంతపార్వతీపరమేశ్వరులంబోని పురోహిత దంపతుల బూజించి వారి మనసున కెక్కు నూతనాంబరముల ధరింపంజేసి ఫల పుష్ప మాల్యాదుల పట్టుపుట్టమ్ముల నూరారుల బహూకరించి నమస్కరించి గురువరేణ్యుల ఆశీః ప్రభావమ్మున మహావైభవమ్మున నుపనయనమహోత్సవమ్ము నొనరింపం జాలితిమని వారి

యాశీస్సులంది ముదంబందుచు ఆడుపడుచులు బావమర దులు పరివేష్టింప నిష్టాలాపమ్ము లొనర్చుకొనుచు కామాంబాలింగన మంత్రులు సుఖంబుండిరి. మేనయల్లుని వటువును జేరజీరి మేనయత్తలు మేనమామలు లాలించి బహూకరింప అంతఁ గోపన్న గురూపదిష్ట నియమ లోలుపుండయి కాలాతిక్రమముం బొనర్చ కత్రికాల సంధ్యావందనమును ప్రాత స్సాయంతనముల నగ్ని కార్యవృద్ధాభివాదనము లొనర్చుచుఁ దల్లి దండ్రు లకు ముదం బొనరించు చుండె నయ్యెడఁ బదియారవ రోజున గురు బంధు మిత్త్రుల బహువిధ పక్వాన్నమ్ముల నిష్టమృష్టాన్న సంతుష్టులంజేసి పయనింపమన్న బావ మరదుల భావమ్ము లెఱింగి లింగన్నమంత్రి అక్కన మాద నామాత్య శేఖరుల స్యాలకుల గౌరవించిన చందం బున తాంబూల దుకూలాంబరాది సత్కారమ్ముల భావు కుల సమ్మానించి యాశీర్వచించి ప్రియభాషణమ్ముల నలరింప నయ్యెడ గామమాంబ తన వదెనలకు, వారి బిడ్డలకు బెట్టిన యంబరమ్ములంబోని యంబరమ్ములు ద్విగుణీకృతమ్ములుగఁ బసపు కుంకుమంబులఁ జందన తాంబూలాదుల, నూతనాంబరమ్ముల నాడుపడుచులను బిడ్డలనుబహూకరించి యిన్నారారుల తాంబూలమ్ముల సత్కరించి మృదు మధుర సంభాషణల నలరించి ఆడు బిడ్డల నమస్కృతు లందికొని దీవించి యింకను

కొన్ని నాళ్ళుండి వెడలఁదెలిపి కామాంబా లింగనమంత్రు
లున్న వటువుచే గురునకు చందన తాంబూలనూత్నాం
బర సువర్ణమ్ముల సమ్మానింపఁజేసి గురువరు నాశీర్వా
దమ్మునంది ఆనందమ్మునసుండిరి. అంత గోపన్న 390

చ॥ క్రమమును వీడఁబోక గురులన్ గడుబత్తినిఁ గొల్వఁజాలి యాం
ధ్రమునను సంస్కృతమ్మునను దక్షులలో నుతి కెక్కఁజాలు జ్ఞా
నముఁగొని రెండు భాషల మనంబలరం గవితావినోదియై
రమణ నిరంతరమ్ము రఘురామ పదాబ్జ మనో ద్విరేఫుడై

మ॥ వరలం జాలెడు గోపనార్యకుని లేప్రాయంబు, విజ్ఞానఁ పుం
గరిమమ్మున్ రసవత్కవిత్వమునుఁ జక్కంగాంచి యాయీసుధీ
వరు లెవ్వారలు మెచ్చుటల్ సుతుఁడు దెల్పన్ దల్లియున్ దండ్రియున్
గర ముప్పొంగుచు నెమ్మనమ్మునను నానందాంబుధిన్ గ్రుంకుచున్.

చ॥ తమకడ నెవ్వరేనిఁ బ్రమదమ్మునఁ గుఱ్ఱని మెచ్చి
పలు
బ్రముదిత చిత్తులయ్యుఁ బసిపాప డెఱుంగ
డొకండు మీఁ
మమె యిటు లాడుచున్నదని మన్ననఁ
బల్కుచునుం
మమయును లింగనాహ్వయుఁడు మాటకు నేఁటి
యెఱుంగనట్

ఉ॥ పిన్నలఁగూడి యాడుచును పెద్దల దర్శనముం
బొం
క్త్యున్నతి రామనామ మహిమోన్నతినిం
గ్రహియించు చో
గ్యోన్నతి నెంచి రామభజనోత్సుకుఁడౌచును తోఁడ
మన్ననఁ గాంచుచున్ సుజన మాన్యులు మెచ్చఁ
జరింప నేర

కం॥ సీతారాముల యట్టుల
చేతమ్మున నెల్లయెడలఁ జింతించుచు వి
ఖ్యాతుల జననీ జనకుల
నాతత భక్తిప్రపత్తి నంజలు లిడుచున్.

తే॥ గీ॥ ఆంధ్రగీర్వాణభాషల నారితేరి
నట్టి పండితు లలర రామాయణమ్ము
నాది కావ్యమ్ము వినుచుచు నా మహాత్ము
తెలమి నూత్నాంశములు దెల్ప నెఱిఁగి కొనుచు. 396

చ॥ జనకుఁడు భక్తుఁడయ్యును బ్రశంసకు నెక్కిన లౌకికుండు నై
దనరుటఁబైతృకంబగు నుదాత్తత లౌకిక మం దెఱుంగుచున్
జనకునిచెంతఁ దల్లి మది సంతస మందఁగ రాజయోగియై
మనియెడు చందముందెలుపుమాతులభాగ్యములుగ్గడించుచున్

వ॥ ఉండునయ్యెడఁ బట్టరాని ముదమ్మునఁ గామమాంబ
యిట్లను.

కం॥ తలపోయ నీదుజనకుని
తలపిట్టిద నీవు నీదు తండ్రిని నెందున్
దలపింపుమనుచు మురియుచు
పులికడుపున మేకపిల్ల పుట్టునె? యనుచోన్. 399

కం॥ జననీజనకుల భావ
మ్మును గని యవ్వారి వాక్యముల తాత్పర్య
మ్మును బాగుగఁదలఁచుచు గో
పన వరలం జొచ్చె బంధువర్గము మెచ్చన్. 400

తే॥గీ॥ పండితులు మెచ్చు సాహిత్య పటిమ సుకవి
వరులు గొనియాడదగు కవిత్వంపు తీరు
సాజములు గాక విద్వత్సమాజము లెటు
పదియు రెండేండ్ల బాలుని ప్రస్తుతింత్రు. 401

మ॥ అని గ్రామస్థులు బంధుసంతతులునాయా మిత్రులౌవారు గో
పన భాగ్యోదయమెన్న నేరికగు? సీప్రియమ్మువా రెందరేఁ
గనరారే? యొకరేని నీడగుదురే? పల్కంగ వావిచ్చి? లిం.
గన కామాంబల సత్తపః ఫలము నిక్కం బీతఁడం చాడెడిన్

తే॥ గీ॥ అక్క డక్కడ పుట్టెద రప్పు డప్పు
డిట్టి ప్రజ్ఞాధురంధరు లిట్టి నియమ
పాలకులు వీని నన్యుల పోలిచి పలు
కాడఁగా నౌనె? యనుచు బుధాళు లంద్రు. 403

మ॥ పదురెండేడుల యీడు బాలుఁడగు
గీర్వాణాంధ్రసాహిత్య సం
పద లీకుజ్జని సొమ్ములంటు, కవితల్ పాలేరులై పారునం
ట దరస్మేరముఖాబ్జవీధి పలుచందాలన్
గుణాఢ్యుండు భా
గ్యదశాస్థానము నంటు వీని నెఱఁగంగా నౌనె?
యెవ్వారికిన్. 404

అ॥వె॥ నోము లెన్నియేని నోచి జనించిన
కన్యగాక యితనికరముఁ గొనఁగ
నగునె ? యనుచు మనము నందు నాప్తులు కొంద
రెలమిఁదలఁపుఁ దెలుపఁదలఁగు వారు. 406

తమ మేనల్లుని ముద్దులల్లునిగఁ జిత్తంబందునూహించియే
తమమంత్రిత్వ మహావిభూతియును బాంధవ్యా నురాగమ్ములో
కము గుర్తింపగఁ గామమాంబయును లింగన్నార్యుఁడున్‌మెచ్చఁగా
బ్రమదంబొప్పఁగ వచ్చి రిర్వురు సిరుల్ రాణింపఁగా వద్దకున్

తే॥గీ॥ అనుచు లోలోన ననుకొను చాత్మ బంధు
వర్గ మెవరికి వార లవ్వారి భావ
మన్యులెఱుఁగక యుండఁగ నరయు చుండి
రంతరంగమ్ము గోపన్నయందు నిడియు. 407

వ॥ అత్తరిఁ గామమాసతి పతితో నిట్లను. 408

కం॥ మీమనసును నా మనసును
నేమాత్రము వేరుకా దహీన గుణాఢ్యుల్
నామనసు మీర లెరుఁగుదు
రేమి యొనర్పంగ వలెనొ? యెంచుడి ! మీరల్. 409

కం॥ అని యను నంతన లింగన
మనమలరఁగ నిట్టులను నమాత్యులు నీయం
దున మక్కువ గల వారలు
ననుమానం బేల ? నీకు నన్నల యందున్. 410

కం: తలఁపునుఁ దెలుపందగదే?
చెలియలి కని యనెదవేమొ? చెప్పిన నెడసే
వలదన్న మాట యెఱుఁగవె?
చెలియా! పెద్దలు శుభస్య శీఘ్రంబనరే? 411

కం కమలాంబయె నీ కోడలు
ప్రేమదమ్మున నేడొ రేపొ వత్తురు దెలుపన్
మము నీవెట్లుల్ఁగాంచిన
కమల మముంగాంచుఁ బేర్మి గదురఁగ భక్తిన్. 412

కం: అని యుల్లస మాడెడు పతి
మన మెఱిఁగిన కామమాంబ మఱచితి నయ్యో!
యని ఫలహారముఁ గొనుఁడని
వినయము భక్తియును మెఱయ వేడుకఁబెట్టెన్. 413

కం: ఫలహారమ్ములు మధుర
మ్ములు గోపన గూడికొనుచు మోదమ్మున బెం
డిలితలఁపులు దెలుపుచు సుతుఁ
డలరన్ లింగన్నయును స్మితాననుఁడగుచున్. 414

కం: ఓమన్నుత్యుఁడు లింగన
కామమసతి మురియసుతుఁడు కౌతుక మొందం
గా మరియును నెవియెవియో
ఆమోదముతోడఁబల్కు నయ్యెడ యందున్. 415

ఆ॥ వె॥ గోలుకొండనుండి కోవిదముఖ్యులు
నలువు రరుగుదెంచి తెలిపి రిటుల
కమల కెలమిఁబెండ్లి కొమరుని వరియింప
వచ్చి యుంటి మనుచు నచ్చుపడఁగ. 416

ఉ॥ వచ్చిన బ్రాహ్మణోత్తముల భావము
రంజిల వంద నాదులన్
మెచ్చొనరించి మించిన యమేయఁపుభక్తి
సమాదరింప భా
గ్యోచ్చ, యుదారతాగరిమ, యుత్సుకతల్
వెలయింపవెచ్చ నౌ
యచ్చఁపు టావునేతి ఫలహారములం గొని యా
ద్విజోత్తముల్.

చ॥ మధుర పదార్థముల్ గొనిన మాహృదయమ్ములు,
మాదు జిహ్వలున్
మధురములై మధూక్తి సుమమాలల
మిమ్మలరింపఁ జొచ్చె మీ
మధుర మనోంబుజాత నవమాధ్వియు
మీమధురేక్షవృష్టి మీ
మధుమయ వాగ్విలాసములు మమ్ముముదావహులం
బొనర్చుతన్. 418

కం॥ అనివిప్రులు కామము లిం
గనలం గొనియాడి పేర్మి గదురగ గోప
న్ననుఁజేరఁజీరియును లిం
గనకును నక్కన్న లేఖఁగన నిడి రంతన్. 419

కం॥ మతిమన్ముఖ్యుఁడు లింగన
స్మితవదనుం డగుచు లేఖఁజేఁగొని చదువన్
నుతమతి యక్కన భావో
దిత శుభ భాగ్యోదయమ్ము దేల్చె ముదబ్ధిన్. 420

కం॥ కనుగొంటే? మీయన్నయ
మనమలరన్ వ్రాయు లేఖ మన కమలాంబన్
మనగోపన కిడి పెండిలి
యొనరుపఁదాబూని మూర్త ముంచియుఁబంపెన్. 421

కం॥ తన మాటయందుఁదమ్మున
కును నాకును నీకు బెండ్లికొమరుఁడు మేన
ల్లునకును గౌరవ మున్నది
యని మూర్తంబుంచి పంపినాడటు వింటే? 422

వ॥ గురునకు బంధువర్గమునకున్ గల మిత్ర హిత ప్రజాళికె
ల్లరకునుఁదెల్పి శోభన పరంపరకుం గుదురైన జ్ఞాతి సో
దర కులవృద్ధు లెల్లరు ముదంపడి రా మన యింటి కిప్డ స
త్వరగతినేఁగి వెంటఁగొని వచ్చెద నిక్కడ నున్నయట్లొగిన్.

కం॥ అని గురువర్యుని చెంతకు
జనె లింగనయను లెఱింగి జ్ఞాతులు హిత మి
త్ర నికాయమ్ములు రా లిం
గన గురువృద్ధులను దెచ్చె గౌరవ మొప్పన్. 424

వ॥ చందనాగరు కస్తూరికర్పూర తామ్బూల ఫలకుసుమాది మంగళ సుగంధ ద్రవ్యమ్ములు నూతనాంబరమ్ములు పళ్ళెరమ్ముల యందుసంచి సభనేర్పఱచి యాశీరక్ష తలంగొని బ్రాహ్మణ ప్రవరులు స్వస్తివాచన సూక్తమ్ములు పఠింపుచుండ, ఫలతామ్బూల దక్షిణాన్వితాంజలిపుటుండై పురోహిత పురస్సరుండగుచు వరుఁడు సభాస్థానమ్మున ప్రాఙ్ముఖాసనాసీనుండయి ఫలప్రదానమ్ము పురోహితున కొసంగి నిగమాశీస్సులందిన అంత అక్కనామాత్య శేఖరుఁడంపిన నూతనాంబరములు హరిద్ర కుంకుమ తామ్బూలాది మంగళ ద్రవ్యంబులును,వరునకు జననీజనకులకు పురోహిత పురస్సర బ్రాహ్మణోత్తములకు నొసంగి, మాదనామాత్య పుత్రికంగమలాంబను గోపన్న కొసంగి పెండిలిసేయ విప్రముఖ్యుల వలన శుభలేఖార్థ విషయమ్ములఁ దెలయించఱచి వేదాశీర్వాద ఫలప్రదాన విప్ర సమ్మానమ్ము లొనరించిరి. అంత సాయంతనంబగుడు శుభ పత్రానీత బ్రాహ్మణ ప్రవరులలరగురు వృద్ధ బంధు మిత్రులం గూడి వరుఁడు గురుసన్నిధిం బొంద

లింగనమంత్రి మధురాహారమ్ముల నిష్ట మృష్టాన్న
సంతుష్టిం బొనరించె నంత

ఉ॥ అక్కన మాద నాహ్వయ మహాసచివుల్ దమ లేఖ నంది పె
న్మక్కువ లింగనాహ్వయుఁడొనర్చినగౌరవసంప్రదాయమున్
దక్కకతన్మహా_ర్తమునుఁదాఁదలఁదాల్చినరీతిఁబ్రాహ్మణుల్
చక్కగఁదెల్పఁ బేర్మివిని సంతసమందుచు నెమ్మనమ్మునన్.

చ॥ పరిణయముం బొనర్చుతరి బావ మనమ్మున కెక్కునట్లు లే
వరలఁగ జెల్లు నెందు గుణవంతుఁడుదారుఁడు గౌరవమ్మునే
పరమ ధనమ్ముగాఁదలచు వాఁడెద నన్యము వేయియిచ్చినన్
సరకుఁగొనండు మజ్జనువు సార్థకతం గొనె వీని బంధుతన్.

కం॥ మా ముద్దుల మేనల్లుఁడు
ధీమన్ను త్యాశుకవియు దివ్య త్మాహి
త్యామృత నిధి గుణఖని యని
యేమాత్రము నెఱుఁగువార లెన్నరె? సభలన్. 428

తే॥గీ॥ అనుగు సోదరి కామమ్మ కాత్మనరయ
పతియ దైవమ్ము నతిథిసేవనమె ధనము
నందుచు ధన్యాత్మ ఆపె మాయనుజ యనిన
నస్మదీ యాన్వయమ్ము ధన్యమ్ము గాదె? 429

కం॥ విల్లమ్ములు శూలమ్ములు
భల్లమ్ములు పట్టిసములు బాణా కట్టిల్
మెల్లమ్ముగఁగొని నడువఁగ
నుల్లాసము గదురఁ రక్షణోద్యోగి తతుల్. 434

తే॥గీ॥ పులులు భల్లూకములు సివంగులు వృకమ్ము
లడవి పందులు నెను బోతు లాదిగఁగల
ఘాతుక మృగాళి బాధలు గలుగ కుండ
వేఁటకాండ్రు ననేకులు వెంట నడువ. 435

కం॥ వెలికొండలు సితకుధర
మ్ములు జేపురు పర్వతములు మునువెనుకల బా
రులుగా జనెనన వృషభ
మ్ములబూన్చిన బండ్లపయనముల్ జేయుచునున్. 436

కం॥ మును వెనుకల నిరుగడలన్
వనరుహ బాంధవుని మేలు వాహములమె
చ్చని బలు గుఱ్ఱపు రౌతులు
మొనసియు రక్షణ మొసంగ ముందడు గిడుచున్. 437

కం॥ బహువిధ వాదిత్రమ్ముల
బహువిధ నాదములఁదెసలు ప్రతినాదమిడన్
రహిబాలురు స్త్రీ పురుషులు.
బహుబంధు గణమ్ము లెలమిపయనము సేసెన్. 438

చ॥ గురుఁడును వేదనాదముల కోవిదముఖ్యులు వృద్ధులంగనల్
వరలు శుభోక్తులన్ వరుశిరమ్మున నక్షత లుంచి రంత నం
బరమున నారతిచ్చిరి సెబాసన కన్నెలు కోకిలధ్వనుల్
వరలెడు కంఠనాదములఁబాటలు పాడుచు నబ్బురమ్ముగన్.

కం॥ యువ కవిరాజగు గోపన
నవగృహ రాజ్యాభిషేక నవ్యోత్సుకుఁడై
యువరాజయి బయలిడె నన
నవుగాదే? యనుచు మిత్రు లాప్తులు మెచ్చన్. 440

ఉ॥ పచ్చని తోరణమ్ముల శుభప్రసవమ్ములు గుత్తిగుత్తులై
ముచ్చటసేయు పందిటను ముగ్గులు వెట్టిన ద్వార సీమయం
దచ్చఁపు మేల్మి బంగరువు టందల మందుననుండి చూపరుల్
మెచ్చి నుతింపఁ గోపన యమేయ శుభోదయుఁడై రహించెడిన్.

కం॥ కన్నెరికఁపు వెలకన్నెలు
కన్నిడి మైపులకరింప కనువేదురునన్
మిన్నంటు మోహభరమున
నెన్నుచు వరు నృత్యగతుల నేగఁగ ముందున్. 442

తే.గీ॥ పలుకుపూవులు తీయని పంచదార
పానకమ్మును దిగద్రాపు తేనె లీన
తేనియలు ద్రావి వాల్చూపు తేటిగములు
తరుల పైకెక్కి భావగీతములుపాడ. 443

కం॥ అడుగడుగున నడసొంపులు
దుడుకుతనమ్ములును నెడల తొలఁగెడు వలువల్
కుడియెడమల విదలింపులు
వెడనవ్వులు నావులింత వింతలు పొడమన్. 444

తే॥ గీ॥ పూర్ణకుంభమ్ములం గొని పూవుబోణు
లెలమి నిర్వురు ఫలపుష్పములను గొనుచు
కన్నియలు నైదువులు; ద్విజుల్ గరిక లక్ష
తలను గొని రా శుభమ్ములు వెలయ నెలమి 445

ఆ॥ వె॥ వివిధ వాద్యభేద విస్తృత ధ్వనిభేద
నినద మంబరమ్ము ననుఁ జెలంగ
శ్రుతిపుటములఁజొచ్చి సొన్నాయినాదమ్ము
హాయిఁగూర్చి చిత్త మలరఁజేయ. 446

ఆ॥ వె॥ భల్లపాణు లగుచు భటరాజ వర్గముల్
జయ పరాకు లిడుచు జయము సేయ
మెఱపు మెఱసి నట్లు మిన్నంటి మన్నంటి
సాయుధముల మగలు సాముఁజేయ. 477

కం॥ కరుదలి వేగముఁగాదను
తురగమ్ముల నెక్కి మెఱయు దోర్వీర్యముతో
నిరుగడలన్ మును వెన్కల
పరిరక్షణసేయ ఖడ్గపాణులు వీరుల్. 448

తే॥గీ॥ పగటి దీపాలు రెండుపార్శ్వముల వెలుగ
రమణు లిరువంకలను చామరములు వేయ
హారములచెన్ను రతనాలహారతు లిడ
మకుట మణికాంతి రాజత్వ మహిమదెలుప. 449

ఉ॥ రాజకుమారు నట్టుల విరాజిలు గోపన రాజయోగ వి
భ్రాజితమూర్తియై తనర బ్రాహ్మణ బృందము వెంబడింపఁగా
రాజితకీర్తి స్మేరసుధలన్ విరజిమ్ముచు నందలమ్మునన్
రాజెదల్లితండ్రుల మనఃప్రమదాబ్ధితరంగలింపఁగన్.

కం॥ కనుమొగు లానందాస
మ్మును గురియఁగఁబిన్న తాత మునిమన్మల బా
యుని కూర్మిగలారలఁగో
పన కనుయాయులుగ వెంటఁబంపియుఁతాతన్. 451

చ॥ తనసతి కామమాంబ ముగుదల్ సరివారలు బంధువర్గముల్
మొనసిన పేర్మిమై పయనముం బొనరింపఁగఁజేసి యశ్వవా
హనులగు తోడవారలు ముదావహు లాప్తులు వెంటరా ముద
మ్మున సకిలింపగుఱ్ఱముశుభోదయుఁడైపయనించెఁబానునున్.

మొరసె ఫిరంగి భూమి నభమున్ దెసలున్ బ్రిదులంగ నంత నం
బరమును ముట్టె రిష్వమని బారులు కట్టుచుఁ దారజువ్వల
బ్బురపడి ఖేచరాంగనలు ముత్తియముల్ పవడాలు వజ్రముల్
గుఱిసి రనఁగఁజూపరులకుం గనువిందుగ రంగురంగులన్. 453

పురమున రాజవీధి పుఖుబోసుల స్మేరసుధాంశు మాలికల్
సురుచిర చంద్రహారముల సొంపు ఘటించెను కన్నెమిన్న ల
బ్బురముగఁజూచు చూపుగమి పోడిమి వాడిమి నల్లకల్వపూ
సరముల నందగించె మధుసారముఁజిల్కెఁబ్రియోక్తిసూనముల్

కం. కనుపండువాయె మనలిం
గనమంత్రి కుమారు మోముఁగనుగొని నంతన్
మనసేఁగె మాటయేఁగెను
కనుసన్నల నొరునిఁజూడఁగలనే? యింకన్. 455

కం॥ అని యనుకొను నొక కన్నెయు
కనులున్నందులకు ఫలము కంటిని నేడం
చనుకొను నొక్కతె యొక్కరు
తనుకొను నిటు వీని వీడ నసు లుండు నొకో? 456

కం॥ కనుఁగొను నేజవ్వనియును
మనసిడి విడనాడలేని మమతను మరియున్
గనుచూపు మేరవరకును
గనుచుండఁగ బెండ్లివారు గడచిరి పురమున్. 457

వ॥ అంతఁ గ్రామ క్రమమ్ముగఁబల్లెలం దాటి పురమ్ములం
జొచ్చుచు నియమిత విశ్రాంతిభవనమ్ముల మజ్జన,భోజన
శయనాదులం బడయుచు బడలికలు వాయుచు నందం
దుంగల చిట్టడవులఁదాటుచు సెలయేరులం దరియిం

చుచుఁ బల్లియలలస్ వీడుచు నందలి యనాగరిక జనమ్ము లంగని యాశ్చర్యపడుచు. నిమ్నోన్నతమ్ములనిందిరానీల కాంతిపుంజమ్ములవిరజిమ్ము చిట్టడవుల బారుల్ దీరిన పర్వతపంక్తుల నంతదూరమ్మున నవలోకించిభద్రేభయూథమ్ములను శంకం దరిగొననించుక యనుమానించుచు జనపదమ్ము లతిక్రమించుచు కారడవుల నల్లిబిల్లికొను కంటక లతాగుల్మమ్ములఁ దొలగించుకొనుచు నాదరాతిశయమ్మున నతిథిసత్కృతిం బొనర్చు నుత్తమ సంపన్న గృహస్థులం బోలి ఫల పుష్ప భారవినయవినమితాంగ శాఖాబహుళంబులై కనువిం దొనర్చుపనసామ్ర రసాల నారంగాది పాదపమ్ముల నించుక విశ్రాంతిం గొని ముదమ్మున ఫలరసాదు లాస్వాదించుచు నందలి బహువిధ సురభిళ పుష్పసౌరభమ్ము నాఘ్రాణించి యామోదం బుధిం గ్రుంకుచు గ్రామంబులఁజొచ్చి విశ్రాంతిఁగొనుచు కతిపయ దివసమ్ములకు ముదం బెసలార గోల్కొండపురీ ప్రాంతోపవనమ్మున విడియ నెంచి. 458

శా॥ తారాజువ్వలు మిన్నుముట్ట వివిధధ్వానమ్ము లంభోధివే
లా రమ్యామృతవాహినీ విభవ గోత్రాదేవి మేల్కొల్పఁబ్ర
జ్ఞారమ్యుండగులింగనాహ్వయుఁడు భాగ్యారామసీముం డనం
గా రంగారెడు తోటలో విడిసె రంగద్వైభవోపేతుఁడై.

తే॥గీ॥ అంత నక్కన మాదనాహ్వాయ మహాస
చివులు సపరీవృతులునయి సేమ మరయ
నెదురుగను వచ్చి వలసిన వేర్పరించి
యెదురుసన్నాహ సంపత్తి నెలమిఁదెలిపి. 46[illegible]

మ॥ తగుమర్యాదల రాచఠీవిని శుభోదర్కమ్ముగా నిందుఁగాఁ
దగు కార్యమ్ము సమస్తమున్నెఱపి విద్వద్బంధుమిత్రమ్ముగాఁ
దగురీతిన్ బొనరింప స్నాతక మటం దజ్జల్ప్రశంసింత్రు నా
దగు యత్నమ్ము ఫలించు మీకును నెడందం బేర్మి రేకెత్తెడిన్.

అని యక్కన్న వచించు నంతనె తథాస్తంచుం గురుం డాడలిం
గనయున్ బావకు మ్రొక్కి మీరలు నెఱుంగం బోనిమర్యాదల
క్కనికే నిందు నెఱుంగఁజెల్లెడినె? సత్కారార్హుఁడౌ మద్గురుం
డుమ మీరున్ నడుపంగ నొప్పుమనకెందుంజూడ వేరున్నదే?

అని యనునంత నక్కనయు నాత్మ ముదంపడి స్నాతకం బిక౦
బొనరుప రండు మీరనుచు ముద్దుల సోదరి కామమాంబికన్
గని మిముఁబిల్వ మీవదెన కాదగు నెల్లరు మేళతాళముల్
గొని యిపుడేఁగుదెంతు రని గోపనఁదట్టియుఁ బేర్మిఁబిచ్చిలన్.

కం॥ మా ముద్దుల మేనల్లుఁడు
మా మాటను దాటబోఁడు మా కమలాంబన్.
మా ముద్దుసహోదరి మా
కామమయును కన్న కడుపుకరణిం గనెడిన్. 464

స్నా త క వ్ర త ము

ఉ॥ అక్కన మాదనాహ్వయులు నంగనలున్ బరివారయుక్తులై
మక్కువమై శుభోదయ సముంచిత మంగళ వాద్య, నాద స
మ్యక్కృతి బంధుగౌరవ సమాదృతి నెల్లరఁబేర్మిఁబిల్వఁబెం
పెక్కిన కూర్మి రాచసిరి యేర్తెరఁబెండ్లికి మారుఁడర్మిలిన్.

ఉ॥ బంగరుటందలమ్మున విరాజిల రాసిరి పెంపుసొంపు లు
ప్పొంగుచు నింగిపాల్కడలి పొంగుకు నీడును జోడు కాఁగ ది
వ్యాంగన లట్లు చంచలత నందని చూపుల నూరిలోనివా
రంగన లట్టె చూడఁబుర మబ్బురపాటునఁజూచి ప్రమాన్పడన్.

కం॥ వాదిత్ర నాదభేదము
లూది దెసల్ జుట్టి నభము నొత్తియు నైజా
మాదెస నీదెసఁజూడఁగ
నీ దెసనాదెసయుఁదానయే యయి మ్రోయన్. 467

కం॥ కలువలరేడో ! యీతఁడు !
తలఁపఁగ నా యింద్రసుతుఁడొ ! తరుణీ ! కాడే
లలవల నలయించెడి యా
వలరాజే యితఁడు నిజము వనజదళాక్షీ ! 46.

కం॥ అనుకొనుచుఁ గొందరంగన
లెనసిన మోహమున మునిగి యెఱుఁగక నెదిరిన్
కను లున్న ఫలము గంటిమి
మనసును నొడలేటి కింక మా కనుకొనెడిన్. 469

మా కమలాంబ భాగ్యగరిమన్ దలపోయఁగ నౌనె? భాగ్యముల్
మాకును లేవె? తాసిరులు మమ్ము వరింపవె? చూచునంతనే
యే కమలాక్షి మానసమునేని హరించెడు రూపువాఁడు సు
శ్లోకుఁడు మాకునల్లుఁడగు చొప్పునకన్నను భాగ్యమున్నదే?

అని మేనత్తలు నల్లువాని నగుమోముఁదమ్ముగ స్త్రీరు చ
క్కనియంగాకృతిమైబెడంగుమదిలోఁ గన్గొంచు వాక్రుక్కుచుం గొం
చును నిండారఁగఁగన్నుదోయిఁగనుఁగొంచున్ మెచ్చుకోల్
వెట్టు కొం
చు నెదన్ వియ్యము నెయ్యముందలఁచుకొంచున్ మోదముం
గాంచుచున్.

తే॥ గీ॥ అదుగో అల్లదె వచ్చుచున్నారు పెండ్లి
వారు విడెదకు స్నాతకవ్రతము చేసి
కొనఁగ నెయ్యవి వలయునో కని రయమున
వారు గనకుండ సంసిద్ధ పఱచవలయు. 472

వ॥ అని పురోహిత పురస్సరులుగఁ దగువారల నేర్పరించిరాజ
మర్యాదల నలరార యథాక్రమమ్ముగ సమావర్తనం
బొనరింప గురూపదిష్ట నియమపాలకులై దుకూలాంబర
ధారులగుచు మైపూతల చంద, నాగరు, సౌరభ్యమ్ములు
వెదజల్లుచు కుంకుమతిల కాలంకృతమ్ములగు ఫాలపట్టి
కలఁజూపరు గనువిందుం బొనరించుచు ఫలతామ్బూల

హిరణ్యాంచి తాంజలిపుటంబుల నొప్పుచు పురోహిత ప్రవరప్రముఖ విద్వద్వరోదిత వేదనినాదమ్ములు శుభోదయమ్ములై దైవార పెండ్లికొమరుడును జననీజనకులును నూతన వస్త్రచ్ఛన్న భద్రపీఠమ్ములం బ్రాఙ్ముఖాసనాసీనులై యాశీర్వాదమ్ము లందుచు ఫలప్రదానమ్ములొసంగి సభానుమతింగొని సమావర్తన కార్యక్రమమ్మున కుపక్రమింపుడు నంత గణపతిపూజా పుణ్యాహవాచనమ్ము లొనర్చి పరిషత్ప్రార్థ నాగ్న్యుపాసనాదులు యథాక్రమమ్ముగ బురోహితు లొనర్పం జేయునంత. 473

## కాశీయాత్ర

ఉ॥ కన్నులఁగజ్జలమ్మును మొగమ్మునఁదిల్కము మౌళిగొడ్గుమేల్
వన్నెయ రత్నమాలిక గళమ్మునఁ గ్రొమ్ముడిఁబూలదండ పే
రెన్నికఁజంకమూటయుమెయిన్ సితచందనమున్ గరమ్మునన్
పన్నుగ రత్నదండ జలపాత్రలు; పాదుకలున్ పదమ్ములన్.

కం॥ వెలయం బుణ్యక్షేత్ర
మ్ములు గనితాగురుని యాజ్ఞముందుగఁగాశీ
కెలమినిఁ జన పయనించియుఁ
దలఁగక మార్గమ్మున నేఁగుతరిగోల్కొండన్. 475

కం॥ శుభమస్తు నీకు జయమగు
శుభము జయంబగునటన్న సూక్తిధ్వనింపన్
శుభవాద్యము మిన్నెగసెన్
శుభశాపోదయము దెలప చొప్పడిచుట్టెన్ 476

కం॥ మక్కు వఁదర్నా దముతో
నక్కన మాదన్న ౛లమి నరుదెంచియు నీ
వెక్కడికేఁగెదు ? ఇత్సుత
నిక్కన్నియ నీకు నిడెదమిందున నిలుమీ ! 477

కం. మాముద్దుల మేనల్లుఁడ
ఓమెయిఁబర్యటనమింక నేమొల్లముమ
త్కామితము న్నెరవేర్పుము
మామాటన్ వినిసుఖాన మనుమా ! చిరమున్. 478

కం॥ అని దీవించుచుగడ్డ
మ్మునగుడ ఖండమ్ము నునిచి ముదమున గంధం
బునుబూసి యిచ్చి వీడ్య
మ్మును పీతాంబరము గ్రీవమునఁ గప్పియునున్. 479

వ॥ అత్తరిఁ బురోహితుండు మహదాశీర్వచనము మహదాశీ
ర్వాదంబ తరువాయి యను సంత సమ్మహామాత్య దంప
తులు ముదంబార నిచ్చు ననర్ఘ్యమ్ములగు దుకూలాంబర
మ్ములు హరిద్రాకుంకుమ, గుడ, తాంబూల, సుగంధ,

ద్రవ్యములం గొని కామమా లింగనమంత్రి దంపతులు పురోహిత ప్రవరు నూత్న దుకూలాంబర, తామ్బూలమ్ము లఁ బహూకరించి అంజలించి యాశీస్సులం బడ, నూత నాంబరమ్ముల ధరించి ఆచమించి సభకు నమస్కరించి పెండ్లికుమారుని కుడివైపున నిడికొని తత్సభాస్థిత విద్వ ద్వృద్ధ బ్రాహ్మణబంధు, మిత్రాప్త, వృద్ధ, వృద్ధాంగనా, జనమ్ము లానందమ్ము నొసంగినవైదిక లౌకి కాశీరక్షతలం దలందాల్చి స్వస్తిమంత్రార్థమున బడసి వైదిక లౌకిక తామ్బూలమ్ము లొసంగి గురు, వృద్ధ, బంధుంమిత్రో భయవర్గ మహిళాకన్యకాగణమ్ము లుల్లసిల్ల విద్వన్ము ఖ్యుల బ్రాహ్మణ ప్రవరుల సత్కృతులఁ బొనర్చి యెల్ల విప్రుల సంభావించి ఆడుపడుచులొసంగు కప్పురఁపు టారతిం గొని మున్నూరారుల సమ్మానించి పత్ని, పుత్ర, సహితమ్ముగ సభాసదులకు నంజలింప స్నాతక సమా రాధనము నత్తరి నక్కన మాదనదంపతులు భోజన మ్ములుసిద్ధమ్ములుశీఘ్రమ్ముగరాదగుననివిద్వన్ముఖ్యులగు బ్రాహ్మణులకు బంధుగులకు వేర్వేర దెలియపఱచి యెల్లరులాఁదెలిపి తామ్బూలమ్ములుగొని యేగునంత మాధ్యాహ్నిక క్రియలొనర్చికొని పాకనియమమ్ముంగల అహితాగ్నులును, విద్వన్ముఖ్యులునగు, బ్రాహ్మణ ప్రవ లును మడివలువలందాల్చి జలపాత్రమ్ములుగొని ముం

దుగదు కూలాంబరధారులై రెండవపిలుపు వచ్చునందనుక డోలు, సొనాయి, మేళమ్ముల మంగళవాద్య వినోదముల నొప్పుచు నాహ్వానితులై శుభవాద్య వినోదమ్ముల మంద మందగమనమ్ముల స్మితభాషణమ్ములవినోదాలాపమ్ముల, పెండ్లికొమరుం డొక్కరుఁడు దక్క తక్కిన స్త్రీ పురుష, బాల బాలికా నివహమ్ము లొక్క మొగిఁగదలి వెడలు నాచందమ్ము నవకిసలయ కుసుమగుచ్ఛ ఫలవిసరవిలసిత మయి మలయాని లేషద్విచలిత శాఖానీకమ్మగు నందనో ద్యానవనమ్ము కరణిఁ గనువిందుం బొనరించుచు క్రమ క్రమమ్ముగఁ బెండ్లివారి భవనమ్ముంజొచ్చి ఇంద్రనీలో పల సంకాశమ్మగు రాకట్టునేల నమర్చిన సువర్ణ పుష్పాం చిత రజతపీఠమ్ములఁ బారులుదీర్చి భుజింపఁగూరుచుండు నత్తరి.

చ॥ విరిసిన తమ్మిపూగమి నవీన సితాసిత కాంతిపూర భా
స్వర మహి తోత్పలప్రతతి భాసిలు నూత్నసరస్సునాఁగ వి
స్ఫురిత ముఖారవిందముల స్ఫూర్జ దనూన సితాసి తోత్పల
స్ఫురిత దృగంతలోసతులఁబొల్చెడు భోజనశాల యొప్పెడిన్.

మ॥ సరసాన్నమ్ములు సూపశాకములు పచ్చళ్లూరుగాయల్ మనో
హర పక్వాన్నములాజ్యధారలునుఖాద్యాల్ దప్పళంబప్పడాల్
పరమాన్నమ్మును తీయమావిఫలముల్ బాగైనభక్ష్యమ్ము లె
వ్వరునున్ మెచ్చిరి పేర్మిగడ్డపెరుగున్ భక్షించి సంతుష్టులై

వ॥ భోజనమ్ములగున త్తరిగురు,వృద్ధవిద్వన్ముఖ్యభావుకోపేత లింగనమంత్రియు లింగనమంత్రి సహోదరీసహిత కామ మాంబయుసన్నిహితవృద్ధాంగనలును దక్కతక్కినపెండ్లి వారందరు తాంబూల పళ్లెరమ్ములం గొనివచ్చు బంధు సముద్రోపేతులై యథాతథమ్ముగవిడిదెకుంజనిరి. అంతకు మున్న సౌధోపరిభాగమ్మున నమటిచియున్న రత్నకంబ ళాసనాసీనులంజేసి తమలమ్ములొసంగి మరియుఁ దాం బూలఁపు పళ్ళెరమ్ముల నవ్వారల మధ్యనునిచి బంధు ముఖ్యులంగూడి తాంబూల చర్వణమ్మొనర్చుచు మృదు మధుర, సరస, పరిహాసోక్తుల నిష్టగోష్ఠి నుండి, యెదురు సన్నాహము మున్నగు పరిణయ విషయమ్ములఁ దెలియఁ బఱచి కొంతవడి కక్కనామాత్యుఁడిట్లను.

తే॥ గీ॥ పెండిలికివచ్చు నెవ్వరు వీరు వారు
నాక యీవేళ యావేళనకయ యెవరి
కెపుడు వలసిన యప్పుడ యేఁగుదెంచి
వలయు భోజనమునుఁ జేయవచ్చుఁబెరిమి. 484

తే॥ గీ॥ నియమపరులకు నవ్వారి నియమములకు
వలయురీతిని నేర్పఱుపంగ సిద్ధ
ముగనె యున్నార మందుల కిద్ధమతులు
తెలుప సందియ మందంగ వలదొకింత. 485

తే॥గీ॥ పెండ్లివారికి నేది యభీష్ట మద్ది
యంతలో సిద్ధపఱతుము స్వాంత మలర
నెఱ్ఱిఁగి మా బావచిత్తమ్ము నెఱుకపఱచు
భార మెన్న పురోహితవరులదెకద? 486

కం॥ అని స్మితవదనుం డగుచును
మనమలరం బలికి బావమన సెరిగిన య
క్కనసచివాగ్రణి యంతన
యనె నిట్టుల బావతోడ సాదరమొప్పన్. 487

కం॥ మన బంధుత యీనాటిదె?
ఇనశశు లున్నంతకాల మిట్లు లెసఁగవలెన్
అనవలసి యంటి కానీ
యనుమానింపంగ నీకు నగునే? బావా! 488

కం॥ అని యుల్లస మాడుచు వల
సిన కార్యము లెఱ్ఱిఁగి వృద్ధ, శిష్టుల వలనన్;
మనమలరం దాప్యాలము
ల నొసఁగిన నెల్లవారు రంజితమతులై. 489

వ॥ విడెదకుం జన నెంచుటయు నంతకుమున్న అక్కన
మాదనామాత్య సహధర్మచారిణులగు శ్రీలక్ష్మి,వరలక్ష్మి
లిర్వురును తమకు నాడుపడుచును, వియ్యపురాలును;
నగు కామాంబకు నాపెయాఁడుబిడ్డలకునుదక్కిన వృద్ధాం

గనలకును పాదమ్ములకు స్వయముగఁబసపురాచి చందన తాంబూలమ్ము లొసంగుచు నమందానంద కందళిత హృదయారవిందలై నెమ్మొగమ్ముల చిరునవ్వులు మొలక లెత్త సరస పరిహాసోక్తి ప్రసవమ్ముల మధుర భావ మాధ్వీరసమ్ము జిందువంద కామమాంబికా కపోల ముకు రమ్ముల కమ్మకస్తూరి గందమ్ము లిరువురు నిరుగడల నొక్క పరియలంది తములఁపు పళ్ళెరమ్ము లందుబాటుగ నందరినడుమ నుంచతామ్బూల చర్వణమ్మొనర్చుచు నిష్టా లాపమ్ముల వృద్ధాంగనలవలన వివాహమహోత్సవ సం బంధమ్ములగు సనాతనసంప్రదాయఁపు టందచందమ్ము లెఱింగికొనుచు వినోదమ్ముగనుండునత్తరి విడెదకు వెడల వలయు నను వార్తంగని వెడల నుద్యుక్తలగు కామమాసతి మున్నగు నంగనామణులకు నుదుటఁకుంకుమ తిలకమ్ము లుంచి తామ్బూలమ్ములిడి శ్రీలక్ష్మీ నైవరలక్ష్మ్ముల తోడి కోడండ్రు సాగనంపు నంత మంగళధ్వానమ్ముల యథా తథమ్ముగ విడెదకు జని విశ్రమించునంత కొంతవడికి.

సూర్యాస్తమయాదికము

మ॥ తనశిష్యాన్వయు లాత్మజన్ములకు నత్యంత ప్రమోదమ్ముతో
డన పెండ్లింబొనరించ్రు నేడనుచు డెందఁ బందునం బొంగు న
య్యనురాగంబలయంబరంబలమునయ్యాడత్యు డస్తాద్రి శృం
గ నిషణ్ణుండయినట్లు తోచెడిని నాకాశమ్ము నాదిత్యుడున్.

ఉ॥ అక్కనమాదనాహ్వయ మహాసచివాగ్రణు లంత వారితో
దక్కెను వియ్య మందఁగల దర్పము లింగనమంత్రికంచు లో
స్రుక్కెడివారి మానపుఁ జూపుల పోలిక నాల్గుదిక్కులన్
జిక్కఁగ నాక్రమించు కొనఁజేరఁగఁ జొచ్చెను చిమ్మచీకటుల్.

ఉ॥ అక్కనమాదనల్ సచివులైనను దాతలెయైన నెంతయేఁ
దక్కువగాఁరె? నైజపుటుదారత లింగనమంత్రికంచు న
ల్దిక్కుల జాలువారెడి సుధీవరవాక్సుధ లాకసమ్మునన్
చుక్కలుగాఁబ్రిపిద్ధిఁగొనఁజొప్పడె నన్నటు దోచె రిక్కలున్.

మ॥ తనుబత్తిం దలఁదాల్చు రేని కెపు డుద్యద్వైభవంబెంచు న
క్కనమాదన్నలు ముద్దుబిడ్డ కెలమిం గళ్యాణముం జేయ నా
రని మాణిక్యఁపు దివ్వెనై శుభములన్ రంజిల్లఁగాఁజేతు ను
ర్విని నన్నట్టులఁదోచె నాకసమునన్ రేవెల్గు వేవెల్గులన్.

ఎ దు రు స న్నా హ ము

చ॥ కెలకుల నేల యీనినటు క్రిక్కిరియన్ జను లాత్మబంధువుల్
దలఁపులు నెమ్మిగమ్మల విరాజిల లేనగుమల్లెదొంతులై
వలపులు గుమ్మరించు వెల వారిజనేత్రలు జావళీల్, పదాల్,
వలుకుచునృత్యభంగిమములన్మురిపింపఁగముందువెన్కలన్

కం॥ నానావిధముల సాముల
నానారీతులను వెలయునైపుణిఁ దెలుపం
గా నౌనని పల్రిజలాడఁగ
నానావిధ సాధనముల నడచెడువారల్. 496

తే॥గీ॥ రామడోళ్ళును, తాషా, మురబ్బి, వీర
ణములు, నౌబతు, భేరికా, నాదములును
పటహ, ఢాంకృతు, లాదిగా బ్రబలి దెసలు
బీటవారఁగ జెలరేగి మిన్నుముట్టె. 497

శ్రుతిపేయమ్మగు వాద్యభేదములతో సొంపారు సొన్నాయి సం
గతులన్ మించు స్వరప్రసార రస మానందమ్ము చేకూర్ప సం
గతిపైసంగతి క్రొత్తక్రొత్తలగు మేఘధ్వాన సోపానఁపుం
గతి కల్పించి ముదంబుతాళిని మురుంగంజేయు డోల్వాద్యముల్

తే॥ గీ॥ కాగడాలు, నిలాయిలు, కాలుదివ్వె
టీలు, పదులును, వందలు, వేలుగాఁగఁ
వెలిగి వేవెల్గుమూకల వెలుగు సేసెఁ
బట్టపవలను భ్రాంతి యెవ్వరికిఁబొడమ. 498

ఉ॥ అందలమందునున్న యతఁడానలకూబరుఁడో; జయంతుఁడో!
యిందుడొయంచుఁజూచిమరుఁడేనునుపెండ్లికుమారుఁడౌచునే
డిందుల కేఁగుదెంచెననె నిందునిభాస్యయొకర్తువేరొకర్తు భా
గ్యేందిరకాదె? మాకమల యెన్నఁగ నంచనె తోడివారితోన్.

శా॥ తారాజువ్వలు రివ్వుమంచెగిరి తత్తారాపథం బంట నె
వ్వారీ కాన్కలు పంపువారనుచు సంభావించి తారాంగనల్
వీరా? మంత్రులు రాజతుల్యులనుచున్ వేవేగ ముక్తాతతుల్
గారామొప్పఁగ పద్మరాగములు కాన్కల్ వెట్టినా వెల్గెడిన్.

కం॥ తలపోయ నాపురమ్మునఁ
గల మేడలయెత్తు నెవరుఁ గనుగొన నగునే?
తలపాగలు తలనుండగ
తలఁపులు నభమరయుఁగనులఁదగులక యున్నన్. 501

కం॥ ఆ సౌధ జాలకమ్ముల
భాసుర దృక్సూనవితతి వదనాబ్జములన్
వీసరవోవక పట్టియు
వాసిగ నీవాళు లీయఁబంకజ నయనల్. 502

కం॥ తడయక ప్రతి గుమ్మముకడ
నడుగడుగునఁ జిచ్చుబుడ్ల నలరెడు తేజుల్
నుడువక నుడివెడునన న
ల్గడలన్ ప్రెగ్గడల కీర్తులన్ విరజిమ్మెన్. 502

కం॥ ఈరీతిని నప్పురమున
నూరేగుచు పెండ్లివారొహో యనఁజనుచో
నూరేగింపిటువచ్చెడు
రారే! మనవారుఁజూడ రహి నెదురేఁగన్. 504

వ॥ అనుచును మంత్రిపుంగవులయంగనలున్ సరివారుబందుగుల్
మనమలరన్ గనుంగొనఁగ మంత్రులు బందుగు లెల్లవారలున్
గొనకొనివచ్చి పెండ్లిఁగనుగొంచునువచ్చిరె! బావయెంతయున్
మనకు ముదంబొసంగె పురిమాన్యులు మెచ్చఁగఁజేసెబాపురే!

మ॥ అను చానందమయాత్ములై సచివు లాహా!రాజరాజాత్మజుం
డనఁగా నొప్పెడు నందలమ్మునను మాయల్లుండు మేనల్లుఁడిం
కనెదుర్కోలిడ రండు రండనుచు నాకారింప బంధూత్కర
మ్మునకుందెల్పఁగ దెల్పఁగాఁదగు జనమ్మున్బంపి యల్లంతనే.

తే॥ గీ॥ ఎదురుసన్నాహమునకునై నేర్పరించి
స్థలమునకు వచ్చినటులఁ దెలియఁబడెడు
నని యమాత్యఁపు రాజమర్యాద లలర
నరుగనెంచిరి సోదరామాత్యవరులు. 507

తే॥ గీ॥ అంగరక్షకు లిరుగడలందు ఖడ్గ
పాణులై నిల్వ సైనికుల్ వారివారి
తరగతుల రక్షణక్రియ నెఱపవలయు
నాయుధమ్ములుగొని వందనాదులిడఁగ. 508

గురులు పురోహితుల్ హితులు కోవిదముఖ్యులు బంధువర్గముల్
వరుసలు దీర్చి విక్రయ విలాసములన్నడువన్భటరాజవర్ణముల్
పరిపరి చేతులెత్తి కయివారములం బొనరింప మాగధుల్
మరియును జైపరాకులిడ మంగళవాద్యములున్ రహింపఁగన్.

తే॥ గీ॥ అడపములు నత్తరుపుతాను లాది రాజ
లాంఛనమ్ములు బహువిధ ఫల సుమాది
మంగళద్రవ్యములను కురంగటునె జను
చెన్నుమీరెడు దాసదాసీజనములు. 510

కం॥ సాలంకృతలై స్మిత నవ
లీలా దృగ్వచన, రచన, లీలామృదు భా
వాలంకృతలై వృద్ధలు,
బాలిక, లెలనాగ లెలమి వరలన్ తరుణుల్. 511

చ॥ తరలిరి మంత్రి సత్తము లుదారవదాన్య, యశో, విభాసితుల్
పరమ ముదావహుల్ సుజన భావిత వర్తను లన్నదమ్ములా
దరమునఁబెండ్లివారిని నుదారుని, లింగనమంత్రిబావ సో
దరి, సుగుణాఢ్యకామమముదమ్మునఁబెండ్లికుమారుఁగూడగన్.

వ॥ సైనికవందన, గాఢాలింగన, కరగ్రహణ, స్మితభాషణ, చారుదృగీక్షణాది యథార్హగౌరవమ్ముల సంభావించి సుఖాసీనులగుడు నన్యోన్యశుభాకాంక్షిత హరిద్రాక్షత విక్షేపమ్ముల ముదమందుచు వియ్యంపు నెయ్యమ్ము తియ్యనైదనర మృదుమధుర వాక్ప్రసవప్రసారమ్మును, మార్గశ్రమాపనోదమును నగు తీయని పానకము సమృద్ధ పానీయ పాత్రముల నందరికీ నొసంగఁదగువారి నేర్పరచి బావ, లింగనమంత్రికి వియ్యంకుఁడు; మాదన మంత్రియు, ముద్దులమేనల్లుడు, పెండ్లికొమరుఁడు గోప న్నకుఁ దానును నొసంగిరి. అంత వృద్ధ, విప్ర, కోవిద ప్రముఖానుసణమ్ముగ నందరకు చందన తామ్బూలమ్ము లొసంగఁదెలిపి యథాతథమ్ముగ తామ్బూలమ్ములొసంగి పెండ్లికొమరునకు దుకూలాంబరభూషణమ్ములు మాదన

మంత్రియొసంగె. నయ్యెడ నమాత్య పురోహితులు శుభ లగ్న పత్రికంజదివి లింగనమంత్రి కొసంగి లింగన మంత్రిచే నూతనాంబర, సువర్ణ తాంబూలమ్ముల సత్క రింపబడునంత, మృదుమధుర సరస పరిహాసోక్తుల నన్యోన్యసంభాషణమ్ముల నలరి పెండ్లికొమరు నాశీర్వ చించి సోదరి కామమాంబ మున్నగు ప్రమదాసంతతి సమ్మానింపంబడు టెరింగి సుముహూర్తమ్ము వేకువనగు గాన నిఁక భోజనమ్ము లొనర్పం దగునని తెలిపి యమా త్యవరులు యథాతథ మర్యాదల గృహంబుం జొచ్చిరి. పెండ్లివారు శుభవాద్య విశేషమ్ముల విడిదెకుంజనిరి. అంత కొంతతడవునకు నిష్టన్నృష్టాన్న సంతుష్టులై విశ్రమింప.

## వే కు వ వ ర్ణ న ము

చ॥ కలవు శుభాకరమ్ములగు కార్యము లెన్నియొ కార్యజాతముల్
కలిగినవార లేరు నతిగా నిదురింపఁగ నౌనె ? యందు గే
స్తుల కసలొప్ప దీయదని తొందరసేసెడు నన్నయట్లు ది
క్కులు ప్రిదిలంద్రిభంగికను కొక్కొరొకోయనికోళ్లుకూసెడిన్

కం॥ మొరసెన్ శుభవాద్యమ్ములు
విరిసెన్ బ్రెగ్గడలయింట విస్తృత తరుణీ
పురుషానన నీరేజము
లరుణోదయరాగ మలమె నల తూర్పుదెసన్. 515

## వి వా హ ము

వ॥ అయ్యెడ సర్వాలంకార శోభితమ్మును యావద్విప్రబంధు, మిత్ర పరివార వేష్టితమ్మును సర్వాభ్యుదయ నిలయమ్మును, నగు కళ్యాణ మండపమ్మునయందు మంగళస్నాతుఁడై కుంకు మోర్ధ్వ పుండ్రాలంకృత ఫాలతలుండును భాపికలత్సోదంచిత ముఖార విందుండును, దుకూలాంబరదారియునై యున్న పెండ్లికొమరుఁడు గోపన్న అంజలిపుటంబున ఫల, పుష్ప, సువర్ణ, తామ్బూలమునిచి అగ్ని ప్రార్థనాదిక, మంగళ సూక్తకమ్ములు పఠించుచు నూతన వస్త్రచ్ఛన్నోన్నత మణిపీఠమ్మున పెండ్లికొమరుని ప్రాఙ్ముఖునిగఁగూర్చుండబెట్టి యుదఙ్ముఖుండై తానుబ్రహ్మపీఠమధిష్ఠించి విప్రాశీఃపురస్సరమ్ముగ ఫలప్రదానము గ్రహించి అచరింపంజేసి సభానుమతిం బాణిగ్రహణ సంకల్పమును, గణపతిపూజా పుణ్యాహవాచనము లొనరించి పాణిగ్రహణ సంకల్పము జేయించి, యజ్ఞోపవీతధారణ మొనర్చి, కన్యావరణము, లొనర్చునంత మాదనామాత్య దంపతులు తండులాన్విత కండోలస్థితయు సర్వాభరణ భూషితాంగియునగు నూత్నవధువు తమ ముద్దుపట్టి కమలాంబచే పురోహితోక్త గౌరీపూజ నొనరింపించి, వధూవర గోత్రప్రవరలు పురోహితులు దెల్ప ముదంబంది వధువుచే వరవరణమ్ము లొసంగించి

మాతులానీత వధూరత్నమ్మును జననీజనకులును కళ్యాణ మండపమున బ్రవేశించి ప్రాఙ్ముఖాసీనులై వరుఁడు ప్రత్యఙ్ముఖాసీనుండుగా వధూవరుల మధ్య తెరపటుంబుంచి సంకల్పించి పురోహితులు మహాసంకల్పముఁజెప్పి జేయింప శ్రీ లక్ష్మీనారాయణ స్వరూపుఁడగు గోపన్నకు లక్ష్మీస్వరూపురాలగు కమలాంబ నొసంగి కన్యాదానముంజేసె నయ్యెడ వరునకు ఆసనపాద్యార్ఘ్య మధుపర్కమ్ము లొసంగి పాదోదకమ్ముఁ దలఁదాల్చి. 516

మ॥ తనతో నిర్వదియొక్కఁడైన తరముల్ ధన్యమ్ములై బ్రహ్మలో
క నివాసార్హములై తరింపఁదగు సంకల్పమ్మునుం జేసి యా
ర్యనుతుం డక్కన మంత్రి పేర్మిఁగనకన్యాదానముం జేసె మా
దన మంత్ర్యగ్రణి మేనయల్లునకువిద్వద్బంధునుత్యమ్ముగాన్.

తే॥ గీ॥ కన్నె సాలంకృతను సాధ్వి సన్నుత గుణ
శీల వర్తన బుద్ధులఁ జెలఁగుదు వని
యిచ్చుచున్నాఁడ నెలమి గ్రహింపు మీవు
నమరు నిద్ధాన ధర్మకామార్థ సిద్ధి. 518

తే॥ గీ॥ నీవు ధర్మప్రజావృద్ధి నెగడుమయ్య!
ధర్మకర్మరతుండవై తనరుమయ్య!
యిచ్చెదం గొమ్ము! తెల్పి గ్రహింపు మీపె
ధర్మ కామార్థముల వీడఁదగదు సుమ్ము! 519

తే॥గీ॥ ధర్మకర్మరతుండవై తనరు నీకు
నలరు సహధర్మచారిణియగుచు నీపె
అస్మదాత్మజ యీ సుగుణాలవాల
నెలమి నీ గృహలక్ష్మిగ నేలుకొనుము ! 520

కం॥ వరునకు కనకాసన మిడి
వరుచరణమ్ములను పసిడిపళ్లెరమున బం
గరుకలశను జలముం
దరుణి యిడం గడిగి మంత్రి తన్నీరమ్మున్. 521

కం॥ శిరమున దాలిచి తరుణీ
శిరమునను౦చియును వరుని శిష్టులు మెచ్చన్
పరిమళ గంధాదుల నే
మరకయ పూజించి యొసఁగె మధుపర్కమ్మున్. 522

కం॥ స్వర్ణాంగుళీయకమ్మును,
స్వర్ణదుకూలాంబరములు స్వర్ణసుమమ్ముల్,
స్వర్ణోపవీతముల నిడి
స్వర్ణమయుం జేసె వరుని స్వాంతంబలరన్. 523

కం॥ రత్నాంబరముల నిడె కవి
రత్నము వరుఁడలర సచివరత్నము కన్యా
రత్నము గుణరత్నము నా
రత్నాకరు నటుల వివిధ రత్నచయమ్మున్, 524

తే॥ గీ॥ అంత సుముహూర్తసమయ లగ్నాష్టకములు
రమణ చూర్ణిక లుచ్చైస్స్వరమ్ములతో ప
ఠించిరి పురోహితులును గడింది ముదము
నంద సభనున్న యెల్లరు డెందములను. 525

తే॥ గీ॥ రమణఁజేఁగొని శోభన ద్రవ్యవితతి
హస్తమస్తక యోగమహత్తరశుభ
సన్నివేశ మహోద యోత్సాహ భరితు
లగుచు నూతన దంపతు లలర నెలమి. 526

తే॥ గీ॥ వేదధర్మమ్ము దలఁదాల్చు పెండ్లివిభవ
మఖిల ధర్మోదయమ్మున కాశ్రయంబు
ధృవము మీ దంపతీత్వ వైభవము ధృవ మ
టంచు నిగమోక్తులను పల్కి రవనిసురులు. 527

కం॥ మృదుమధు రోచ్చైస్స్వరముల
ముద మిడు వేదోక్తమంత్రములు భూసురవా
గుది తాశీర్వచనమ్ములు
ముద మొప్పన్ వెలయఁబెండ్లిమూర్తం బయ్యెన్. 528

తే॥ గీ॥ వేదవిప్రులు లౌకిక విప్రవరులు
నఖిల బంధువు లైదువుల్ హర్ష మొదవఁ
బెరిమి నూత్న వధూవర శిరములందు
పచ్చనక్షతలుంచిరి ప్రమదమందః 529

వ॥ ఆయ్యెడ సభాస్తారులగు విద్వద్బంధుమిత్రాదులకు ఫల, తాంబూలము లొసంగువారును అత్తరువులు రాయు వారును గంధము లిచ్చువారును పన్నీరుచల్లువారును వ్యజనాదు లిడియెడువారునునై యుభయ వర్గమ్ముల యాప్తబంధువులును సభ్యుల నానందింపఁ జేయువా లయిరి. అంత. 530

కం॥ వరుఁడొసగిన మధుపర్కము
పెరిమిన్ ధరియింపఁజేసి పెండ్లికుమారిన్
సురుచిర దీపావళి ప
ళ్లెరమొలతో తరుణులెలమిలీలన్ దేరన్. 531

కం॥ తలఁబ్రాల్ బియ్యఁపు పళ్లెర
ముల మాంగళ్యముల నునిచి పూజించివధూ
తిలక గ్రైవీయములుగ
నలరంగా మూడుముడుల నమరిచె వరుఁడున్. 532

కం॥ అభినవమగు మజ్జెజవన
విభవమునకు హేతువగుచు వెలసెడు మతి నీ
శుభసూత్రము మెడఁగట్టితి
సుభగే! నూరేండ్లు మనుమ! శుభసంపదలన్. 533

తే॥ గీ॥ అంతనూతన దంపతు లలర మౌళు
లందు స్వర్ణాక్షతల సువర్ణాభిషేక
ములనుఁజేసిరి వేదవిప్రులును బంధు
జనులు దీవించి గేహరాజ్యమ్ము నేల. 534

మ॥ ఎలమిం గొబ్బరికొల్చి దోయిళులయం దేపార దీవించి యి
చ్చలు రేకెత్తఁ బరస్పరమ్ము తలలం జాల్వారఁ గాఁజేయ వి
ప్రుల్కు నాపై విజిగిష దంపతుల చూపుల్ ద్రోపు దోయిళ్లు నౌ
తల(బ్రాలార్ద్రములై మనోహరశుభోదర్కమ్ములై యొప్పెడిన్

కం॥ ఫలమూలమ్ములు క్రముక
ములు దక్షిణ లక్షతలును ముడివెట్టిన మేల్
వలిపఁపు బ్రహ్మగ్రంథుల్
వెలయించిరి దంపతీత్వ విభవగ్రంథిన్. 536

కం॥ పాణిగ్రహ ణాభ్యుదయము
రాణింపఁగ దంపతుల కరమ్ముల రక్షల్
నాణెమ్ముగఁగట్టిరి యిఁ
దాఁణిం దలపించి వధువు రాజిల నెలమిన్. 537

కం॥ ఆనందమ్మున మాదన
భూనుతవిప్రులకు వేదముల ప్రోవులకున్
బూనికను శోడశమహా
దానములం జేసె భక్తిఁదజ్ఞులు మెచ్చన్. 538

ఫలములు చందనమ్ములు సువర్ణము లంబరముల్ దుకూలముల్
వెలగల రాంకవమ్ములు కవిప్రవరుల్ వినుతింప విద్యముల్
వెలయఁగఁగాన్క వెట్టి తొలి విజ్ఞుల కగ్రతలం గ్రహించి మేల్
వలువలు శాలువల్ ఫలసువర్ణములుం గడు సత్కరించియున్.

కం॥ కలవిప్రులెల్ల రలరఁగ
వలువలు సంభావనములు ఫలములు మెఱయన్
గలుముల మునిగిన వారలె
తలలూపగ నిచ్చె తన యుదారత వెలయన్. 540

వ॥ అంతఁ బురోహితులు మహదాశీర్వచనంబ తరువాయి
యన మాదన శ్వశురదత్త నూతన దుకూలాంబరధారులై
మాదనదంపతు లాచమించి సభ కంజలించి గురు, వృద్ధ,
విప్ర, బంధువర్గమ్ము లిడు వేదాశీర్వాద శుభోదయ హరి
ద్రాక్షతలు తలఁదాల్చి ఫలప్రదానమ్ము లిడి ఆడుపడుచు
లిడు కప్పురఁపు టారతులంగొని వేనూరారుల తాంబూలా
మిడి దంపతీయుక్తముగ మాదన సభకునంజలిఁజేసెనంత.

సిరులంజిల్కెడుముద్దునెమ్మొగములం జెన్నొందుక్రొమ్మొర్వుచూ
పరకానందముఁగొల్పు నూతనఁపు దాంపత్యమ్ము వర్ధిల్ల రా
సిరులం బేరిమి వేదమంత్రముల నాశీర్వాదముల్ జేసి వై
చిరి విప్రోత్తము లక్షతల్ శిరమునన్ జెన్నారఁ గీర్తిద్యుతుల్.

వ॥ అంతఁ బురోహితులు స్వస్తిమంత్రార్థమ్ముల వధూవరుల
శిరమ్ముల యాశీరక్షత లుంచి ఫలప్రదాన సమయం
బెఱింగింప లింగన్నమంత్రి వధూవరులచే విద్వన్ముఖ్యు
లకు యథార్హమ్ములుగ ఫల,తాంబూల దక్షిణల సమ్మా
నింపఁజేసె. 543

తే॥ గీ॥ పసిడిడళ్లెరములయందు పడతు లెలమి
ముత్యములు, రత్నములు, పుష్పములును, బోసి
కప్పురపు దీపముల నుంచి కనులవిందు
గా నొసంగిరి యారతుల్ గలిమి మెఱయ. 544

వ॥ అంతన యైదుపులకు నూరారుల తామ్బూలమ్ములొసంగి వధూవరులు సభ కంజలించిరి అంతఁజతూరాత్రి దీక్ష యథాక్రమమ్ముగ వివాహంపుమహోత్సవం బగుటయు, అందున విద్వత్సమ్మాన బంధుగౌరవములతో నాందోలికా గజారోహణాదుల నూరేగింపు టుత్సవమ్ములతో సంగీత, సాహిత్య,కవిత్వ,సభలతో, సమ్మానములతో ఇష్ట మృష్టాన్న భుక్తుల నానందమ్మొందుచు వివాహమ్మగుడు నూతన వధూగృహప్రవేశ దేవతా పూజన బ్రాహ్మణ సమారాధన బంధుగౌరవాదుల నలరారి కామమాలింగన మన్త్రిదంపతులు తముముద్దుల కొమరుండు గృహస్థయి నందులకు సంతసించుచు నందునను తమ ముద్దుల మేన కోడలు కోడలయినందులకు పరమానంద భరితులగుచు కాలమ్మునుఁపుచ్చు చుండ. 545

చ॥ వలపులు గ్రుమ్మరించు నెలపాంప్రియము పూవిలుకాని వాడిపూ
ములుకు లపాంగ శాత శరపుంఖములై, ఋజుమార్గగాములై
తలపులు ధర్మకర్మ సుముదామములై కడుపార కన్నవా
రల కనుపండువైసిరుల రాజిలెడిన్ గమలాంబ గోపనల్.

కం॥ దైవస్వరూపు లనియెడు
భావనఁదలిదండ్రు లెలమిఁబడయఁగ భక్తిన్
సేవించుచు నవ్వారిడు
దీవన గోపన్న మను సుధీవరు లెన్నన్. 547

కం॥ కలుములు తలమున్కలుగా
నలరుమహామంత్రి పుత్రియయ్యును కమలా
జలజాక్షి, అత్తమామల
నెలమింగను భర్తఁగూడియెఱఁగి భజించున్. 548

కమలాంబాసతి గోపనాహ్వయుని ద్వక్కంజాతయై గేహ కార్యములం దీర్చుచు నత్తమామలకు నాహ్లాదమ్ము రేకెత్త నిత్యము గోపన్నకుఁ బ్రాణతుల్య మగు సీతారామ సేవావిధిన్ ప్రమదం జొప్పఁగఁదీర్చుచుం బతిసప ర్యామోద సంపన్నయై.

చ॥ కడుపునఁగన్న బిడ్డయటు కామమలింగన లెల్ల వేళలన్
గడు పెరిమిం గనుగొనఁగఁగంటికి రెప్పటు; మోహవల్లికల్
ముడివడి ప్రేమపుష్పములు పూయఁగ గోపన మానసాబ్జ మం
దడర ద్విరేఫ మౌచుఁ గమలాంబకుఁగాపుర మొప్పెరాసిరిన్.

వ॥ కలుములు గంపలంగొలుచు కాపురమయ్యును మంత్రిబిడ్డయై
యలరుచునున్నఁబేర్మి ధవుఁడౌదలఁదాలుచు మోహవల్లికల్
మెలిగొనమోహనాంగుఁడును, మేటికవీంద్రుడు, నైనగర్వఁ పుం
బలుకును బల్కనేరని శుభావహయైకమలాంబ యొప్పెడిన్.

తే॥ గీ॥ అతిథిపూజయు, పతిభక్తి, అత్తమామ
లన్న పితృభక్తి రాము పదారవింద
సేవనాసక్తి దాస దాసీజనాను
రక్తి కమలాంబ కనుది నాసక్త వృత్తి. 552

కం॥ గోపన్న మనసె తనమన
సేపనిఁజేసినను నవ్య మేదియుఁగనరా
దాపూర్ణచంద్ర వదనకు
మాపర్యాయకును కమలమాసతి కెన్నన్. 553

ఉ॥ గోపన యెల్లవేళల నకుంఠిత రామపదాబ్జ సేవనా
ప్రాపక చిత్తవృత్తి నెడబాయని రామకథాప్రసక్తి ప్ర
జ్ఞాపరిణాముఁడై జగము సర్వము రామమయంబటన్న వి
ద్యాపరిపూర్ణుఁడౌచుఁ బ్రమదమ్మునఁజేయును రామనామమున్.

చ॥ జనకుని వంపునన్ జనులు సమ్మదమందఁగ రాజకార్యముల్
బనిఁగొనిసేయు నేపనులు పైబడి యున్నను రామనామమున్
మనమునఁజేయు రామభజనమ్మును నల్వుఁరిగూడి చేయు నే
పని నొనరింపఁబూనిన సెబా సనిపించు నదెట్టి శక్తియో. 555

చ॥ మనమున రామనామ మహిమమ్మును చింతనచేయు టొక్కఁడే
పనిగఁదలంచి యీభవముఁబాయనుపాయముగాఁగ; నెన్నియో
పనులను మున్గితేలునటు పైజనముల్ గ్రహియింప నిచ్చలున్
జననుతుఁడైన గోపన ప్రజావళిఁగూడి చరించు చుండెడిన్. 556

ఆ॥ వె॥ పంటకాపు రైన బ్రహ్మజిజ్ఞాసువు
రైన రామనామ మనవరతముఁ
జేయఁబ్రోత్సహించు చేయించు శ్రీరామ
భజన మనుదినమ్ము భక్తి యుక్తి. 557

ఆ॥ వె॥ నేలకొండపల్లె నివసించు నగ్రజుం
డయిన నంత్యజుండె యయిన ననుది
నమ్ము రామభజన నానంద మేపార
నిదురఁజెందు రాత్రి నియతి మెఱయ. 558

కం॥ ఏకాద శ్యుపవాసము
లేకాహము లాదిగాఁగ నెన్నియొ దీక్షల్
నాకం బందెడు భజనల
నేకగ్రివముగఁబురిని నెల్లరుఁజేయన్. 559

తే॥ గీ॥ ద్వాదశీబ్రహ్మణుల సమారాధనములు
పేదలకు నన్నదానముల్ పెరిమి నతిథి
పూజ లింటింట వెలయ నప్పురని మార్గ
దర్శకుఁడౌచు గోపన్న తనరఁజొచ్చె. 560

క్షా మా ర్త జ న ర క్ష ణ ము

వ॥ అత్తరి. 561

కం॥ కామము లింగన మంత్రులు
రామాయణ పఠన నియమ రాజిత మతి శ్రీ
రామ పదాంభోజ యుగం
బేమరకయు నాకపురికి నేఁగిరి యంతన్. 562

తే॥ గీ॥ వేద విధులను పైతృత విధు లొనర్చి
దాన ధర్మమ్ములను నన్నదానములను
విప్రముఖ్యులఁదనియించి విజ్ఞులౌన
నంగఁ బితృభక్తి పుత్రుఁ డనంగఁదనరె. 563

ఉ॥ అంతటినుండి గోపన మహాకవి రామపదారవింద స
క్రాంతర దృష్టి వృష్టి కురియన్ సమకట్టె దయారసార్ద్రభం
గ్యంతర వృష్టులౌచుఁ బరమాయువు రాసిరి కబ్బ నర్థి సు
స్వాంతులు మెచ్చఁబేదజన మౌనని మెచ్చినుతించిమ్రొక్కఁడన్

చం॥ కర వొక కారణమ్ముగ నకాలము కాలము నాక వచ్చి యెం
దరొ జను లాక లన్నమిడితద్దయుఁబ్రాణము నిల్పుఁడన్నయా
మొరవిని సైపలేమి జనముల్ ముదమంద భుజింపఁజేయ వా
సరములువారముల్ నెలలు జారఁగఁజొచ్చెను నన్నరాసులన్

ఉ॥ ఏఁగెను మూడు వత్సరము లేదినమున్ శతముల్ సహస్రముల్
గాఁగ జనాళిభుక్తిఁగొనగా నొకనాఁడుమ లోటురాని యా
చాగము నెన్నఁగామగవి చాగము చాలునొ కల్పభూజంపుం
జాగము చాలునో తెలుపశక్యమె? గోపన నెన్న శక్యమే ?

చ॥ తరిగెను భూమిఖండములు దగ్గర నున్న సమస్తవిత్తముల్
దరిగెను రత్నపలచయ ముదాత్త సువర్ణ విభూషణావళుల్
దరిగెను వెండి బంగరువులన్ వెలయించినపాత్ర లన్నియున్
దరిగెను నారఘూత్తము పదద్వయ చింతనగాక సర్వమున్.

కం॥ సిరి సర్వమ్మును దరిగిన
నురుతరగతి వచ్చు నతిథి యొక్కరుఁడేనిం
దరుగడ తోరణ మట్టుల
వరలెడు భుజియించి తృప్తిపడి ముద మొప్పన్. 568

## అక్కనయనురాగము

చ॥ అరిగెను కొన్నినాళ్ళటుల అక్కన మాదన లంత దక్కరా
సిరి సకలమ్మునుం దొలఁగి సిగ్గరి నల్వురు సాటివార లె
బ్బరికపు చూపుచూడఁదలవంపున కాకర మైన యట్టి దు
ర్భరమగు జీవనమ్ము గడపం దగె నల్లుఁడటం చెరుఁగమిన్.

మ॥ అకటా! మాకమలాంబ కిట్టి దురవస్థా? మాదు మేనల్లుడా?
అకలంకాత్ముఁడు పండితుండు, కవిరాజవ్యాజకీర్తి ద్యుతి
ప్రకటీభూత దిగంబరుండును బుధాలంబుండు దీనార్థి యా
చక కల్పాఁడగునట్టి గోపనక? యాచ్ఞాదైన్య! దీనస్థితుల్.

కం॥ పతి భక్తి నతిడ సేవను
మతిమంతులు మెచ్చుకొంద్రు మా కమలాంబన్
నుతమతి నత్తకు దీటగు
నతి యన్నిటు ననుచు; నదియుఁజాలదె? మాకున్ 571

మ॥ తన సర్వస్వముఁగోలుపోయినను విద్వన్ముఖ్యు లగ్గించు త్యా
గ నిరూఢిన్ బ్రతిరోజు వేల జనులం గాపాడె మూడేండ్లు భో
జనముల్ బెట్టియుఁగర్వుకాలమున;నాచాగమ్ము సామాన్యమే?
మనమున్ మెచ్చిన ధన్యతంగొనమె? ధీమన్మత్యుమేనల్లునిన్

మనమేనల్లుఁడు నల్లువాడనిన సామాన్యుండె? యా లాటి త్యా
గిని యోగిన్ గననేర్తుమే?యొక నియోగిన్ యోగినిన్‌రాజయో
గిని త్యాగిన్ మనగోపనన్ గనినచోఁగేల్మోడ్పు లర్పించి యొ
య్యన నేభూపతి యగ్రహారముల నీయంజాలఁడే? పేరిమిన్.

మ॥ అతఁడేగన్‌వలెఁగానియేఁగునెడనీయన్ సందియంబందు భూ
పతి యొక్కండునుగానరాడమది సంభావించుచోవాని యో
గ్యత యేమంత్రికి నేనృపాలునకు నూహాతీతమైయొప్పు సం
తత భాగ్యోదయుఁడాతఁ డీసిరులజేతంబందు నూహించునే ?

తే॥ గీ॥ అతని లౌకిక రాజమర్యాద నలరఁ
జేసి మషమది సంతుష్టిఁజెంద వలయు
నంతియె గాని యాతని కాతఁడిటకు
వచ్చునని యెంచుటలు పొరపాటు గాదె?

కం॥ సిరితొలఁగిన సంగతి మన
మెఱిఁగెడి యీ నాటికపుడె యేఁగెను మూడేం
డ్లరరే! గోపన చరితము
పరికింపఁగఁజిత్రమాయె భావము నందున్. 576

ఆ॥వె॥ బ్రదికిఁజెడిన వాడు బరి మీరి వెడలునే?
అత్తవారి యింటి కనద యగుచు
పట్టె డన్నముఁదిని బ్రదుక వచ్చు నటంచు
నంతకన్న అధమ మరయఁగలదె? 577

కం॥ సిరులన్ మనియెడు నాడే
అరుదుగదా? మనగృహమ్ము నందదు గిడుటల్
అరయుదె? మేనల్లుని యటు
లరయంగా మనకు నాతఁడల్లుడు గాడే? 578

ఆ॥ వె॥ కన్న కడుపు గాదె? కమలాంబ మనమీద
కన్ను బెట్టుకొనక యున్నె? యున్న
కలిమి దక్కు నెట్టు లెలమిమై తనయంత
దాన వచ్చు మనలఁదరియఁజెపుమ? 579

కం॥ తన పేరిమిటి యందుం గల
నెనరున్ విడనాడి వచ్చునే? పుట్టింటన్
దన కెదియో లభియించెడు
నని యది సాధ్వీత్వమందురా? యద్దానిన్. 580

ఆ॥ వె॥ వేలవేల ప్రజల లీలఁగాపాడిన
దాత యాతఁడతని ధర్మపత్ని
కమల మనదు భాగ్య గరిమంబుఁదలపోసి
పట్టె డన్నమునకుఁబయట పడునె? 581

ఉ॥ ఆతని కేమిలోటు మరియాదకు భూపతికన్న మిన్న వి
ఖ్యాతికి గ్రంథరాజముల యందలి దాతలె సాటి దాత లే
కేతరుణమ్ము నందు నెన యీరని నొక్క వచింప నా మహా
దాత గుణాఢ్యుఁడల్లుఁడని యాడుకొనన్ మన భాగ్య మెట్టిదో

మెలపు జెప్పుచు నుండె సభ్యులు ముదమ్ము
గదుర గోపన్న పాండిత్య గరిమ మెఱయ. 588

తే॥ గీ॥ భక్తిరస ధారయో! రామ పాద నీర
జాస వాసూన ధారయో! అవిరళముగ
గోప నాక్షి పయోదముల్ గురియఁజొచ్చె
సభ్య హృత్క్షేత్ర భక్తిబీజము జిగుర్ప 589

తే॥ గీ॥ కెరలి గోవిందనామ సంకీర్తనమ్ముఁ
జేయువారలు హారతుల్ జేతఁబూని
యిచ్చు వారలు పదముల కెఱగు వార
లైరి సభ్యులు గోపన్న కంత భక్తి. 590

కం॥ కొబ్బరికాయలు గొట్టిరి
యబ్బురముగ ననటిపండ్ల నందిచ్చిరి యే
తబ్బిబ్బు లేని మది తో
నిబ్బరముగ గోపనార్యునిం దనియింపన్. 591

చ॥ మరియును రామరామమహిమమ్మునెఱుంగవచింపఁబూని యే
మరుటు లెఱుంగఁబోని బుధమాన్యుఁడు గోపన సభ్యు లెల్ల సం
బరమునుఁబొంద వాక్సుధ లపార గభీర కథాసవ్రవంతులై
వరలఁగఁదెల్పెవహ్వారె! సెబా! సని యౌదలలూపి మెచ్చఁగన్.

ఉ॥ ఆ సమయమ్మునందు సచివాగ్రణులంపిన యాన రాజముల్
భాసుర రాజవైభవ విభాసితముల్ వెలయంగ బందుగుల్

రాసిరు లుల్లసిల్ల కవిరాజ విరాజిత మైన గోపనా
వాసగృహమ్మునుంగిటుకువచ్చెదువారిగ్రహించియెల్లరున్.

తే॥ గీ॥ విస్మయానంద భరితులై వినుతిగన్న
భక్తరత్నము గోపన్నపత్ని కమల
మాంబయును మెచ్చుకోలడ సంబరమునఁ
దెలుప నంతన గోపన్న యెలమి మెఱయ. 594

కం॥ నీరాజనమ్ము నిడి ఫల
హారమ్ములు పంచియీయ నగునీకనిందే
వారికి సనుతే తడవుగ
వారక నిడఁజొచ్చి రెల్లవారికి వారల్. 595

ఆ॥వె॥ గోలుకొండ నుండి కొమరొప్ప వచ్చిన
బంధు జనము లెదను ప్రమద విస్మ
యముల నంద గోప నార్యుండు నెదురేఁగె
వేల ప్రజలు గొలుచు లీల మెఱయ. 596

తే॥గీ॥ రాజమర్యాదలను బంధురాజిలోన
నడుగు నిడ నాస నార్ఘ్య పాద్యాదు లొసఁగి
యెల్లవారల మనములు నుల్లసిల్ల
సేమ మారసె మాతుల క్షేమ మెంచి. 597

కం॥ వరలక్ష్మీ లక్ష్ములు కూ
తురు కమలం గౌగిలించఁ దొరలెడు నశ్రుల్

చిరువానలు గురియఁగ నవి
వరలెన్ గనకాభిషేక వైభవ మొప్పన్. 598

తే॥ గీ॥ అంత నందరికిని ఫలహారము లిడి
బడలికలు వాయఁజేసిమి నిడియె నావు
పాలు పాపియములుఁగ గోపన్న సకల
బంధు వర్గమ్మునకుఁ బరివారములకు. 599

తే॥ గీ॥ చింత చెడినను పులు పింత చెడునె? యన్న
యటుల గోపన్న భాగ్య భోగ్యముల నాడు
చేయు మర్యాదలే నేడు చేయుచుండ
బంధువర్గమ్ము లాశ్చర్య పడుచు మదిని. 600

కం॥ సిరి చెడిన మాట లాడడు
పర మాహ్లాదమ్మొ వదన పద్మము నందున్
వరలెడు నిటు నటు వెడలఁడు
అరనిముసములోన సిద్ధ మగు నన్నియునున్. 601

కం॥ మన పరివారము లెక్కం
గన నూటికి లోటులేదుగద? యిందరు నె
మ్మనమున తృప్తింగొన భో
జనములు పక్వాన్న వితతి సలుపం జేయున్. 602

తే॥ గీ॥ మనము వచ్చిన పని వేరు మనము నిచటఁ
జేయు పని వేరు నైదోచెఁజిత్త మలర

నెటులఁదెలుపంగ వలయునో ఇంత యేవి
దెలియబడకున్న యది యేమి సలుపఁదగెడు? 603

కం॥ అని బంధువర్గ మెల్లరు
మనమున ననుకొనుచు కలిసి మంతన మందున్
మనమిటకు వచ్చి యపుడే
దినములు రెండాయెఁబనియుఁదేలక పోయెన్. 604

ధీరుఁడు గోపనాహ్వయుఁడు తేలునె? యాతని నోట నేదియున్
జారునె? సేమమే తెలుపఁజాలెడు నాతని వాగ్విశేషముల్
సారపరీతముల్ విబుధ సన్నుతముల్ కమలాంబ యేనియున్
జేరునె? కష్టనష్టములు చెప్పునె? చాటునఁదల్లితోడనేన్. 605

సిరి సకలమ్ముఁ బోయినను చిత్తమునందునఁదొణ్కు బెణ్కులే
దరయఁగ నూరివారలు మహామహు లెల్లరు పాదసేవ నా
పరులయి యున్నవారు బుధవంద్యుఁడు గోపన వీని భాగ్య మె
వ్వరు వివరించి తెల్పఁగలవార లుదారుల కల్మిలిట్టివే? 606

కం॥ ఏమీ! మన గోపన వి
ద్యామహిమమ్ము వినమె? అపు డప్పెలమిన్
శ్రీమద్రామాయణమును,
నీ మ్మాద్రి మనోవికాస మెపుడందితిమే? 607

కం॥ ఈ మహనీయుని పాదము
లేమానవు లేని మౌళి నెలమినిఁదాల్పం

గా ముందడు గిడ కుందురె ?
ఈ మహితాత్ముని విశేష మెన్నఁగ వశమే ? 608

అనుచున్ బందుగు లెల్లవారలును నాహా. యేమి గోపన్న యీ
తని మహాత్మ్యము నెన్నఁగాదరమె? విద్వన్నుత్యుఁడీపుణ్య మూ
ర్తినిఁ జేబట్టిన ధన్య మా కమల సాకీరత్న విఖ్యాతిఁ గాం
చిన దీనాటికి నింతకన్నఁకల వే? చింతింప భాగ్యోన్నతుల్. 609

కం॥ కలిమి గల చోఁబుట్టియు
కలుములు గల వాసి కలిమి కై బట్టియు మేల్
కలుములఁ నూగియు కలిమికి
వెలియయ్యెను.కమల కలిమి వెలయం జొచ్చెన్. 610

కం॥ అని బందుగు లెల్లరు నె
మ్మనమున నుప్పొంగి కమలమా మాన్యత, గో
పన భక్త్యున్నతి, చాగము
మన కగునేయెన్న ననుచు మన్నసఁగనుచున్. 611

కం॥ వరలక్ష్మి లక్ష్మలకున్
మురిపెమ్మెనఁగూర్చు కమల ముద్దుకుమారిన్
బరికించి బంధుజనములు
వరలక్ష్మి లక్ష్మి లలరఁబలికిరి యిట్టుల్. 612

కం॥ నిను నీ పెనిమిటినిం గొని
జన మీ పెదనాన్న నాన్న సమ్మదమున మీ

జననిని పెద్దమ్మను మ
మ్మనుఁబంపిరి రేపు పయనముం జేయవలెన్. 613

కం॥ గోపనకుం దెలిపెద మీ
మాపున సీలోన సతని మనసున కెక్కన్
మాపనిఁదెలుపుము తల్లీ!
యే పగిదిని దెలుప నాతఁడెలమిం గొననో! 614

కం॥ తెచ్చిన వస్తువు లేవియు
ముచ్చట కేసియునుఁజేత ముట్టర యీ మా
తెచ్చిన ఫల మేమున్నది?
అచ్చుగ మీ యుభయు లెలమి నరయుఁడు! తల్లీ! 614

మీ నేమమ్ము లవెట్టు లుండినను౯జేర్మిం దెచ్చి మాయిచ్చు నీ
నానా రూపములై దనర్చు తనుబండారమ్ములం దొక్కఁడే
నానందమ్మున నేడు మీరు తినకున్నన్ మామనం బొప్పునే
యీ నాడేనియు మీర లిర్వురును మా యీ మాట మన్నింపరే?

తే॥ గీ॥ ఎన్ని విధముల నడిగిన యేనిఁగన్న
తల్లి కేనియు నిమది తెల్లముగను
దెలుపఁబూనవు చెంతను నిలువఁబోవు
తగునొకో? యిట్టు సేయుట తల్లి! నీకు. 61

కం॥ సిరిబాసి పుట్టినింటికిఁ
దరలంగాఁదగునె? యెట్టి తరుణికి సర్వం

బెరిఁగిన మత్ప్రతి యీ కృతి
సరకుం గొనుటెట్లు? తెల్పఁజాలుట యెట్టుల్? 618

తే॥గీ॥ వేలవేలకుఁబ్రజలకు వెలితిలేని
భోజనము లిడ్డ త్యాగి సత్పురుష వరుఁడు
కలిమి కోక యింత యీ నాడు వెలిగ నున్న
యంతి బయలిడునే? పట్టె డన్నమునకు. 619

తే॥ గీ॥ బ్రదికి యుంటిని యీనాటి వరకటున్న
ధైర్యమునఁజూడవచ్చెరి దయదలిర్ప
నిదియ పదివేలకుం జాలదే? మదీయ
భాగ్యముల పంటఁగా నెంచి ప్రమదమంద. 620

తే॥గీ॥ కలదు కమలాంబ యింకను కలదు నిన్ను
గనెడు కోరికతో నని వినుపు డమ్మ!
పెద్ద నాన్నకు మానాన్న వినఁడు గాని
వినిన నాదగు కైమోడ్పు వినుపు డమ్మ! 621

తే॥ గీ॥ అనదయా? నాదు భర్త మహాకవీశ్వ
రుండు పండితముఖ్యుఁడు నిండుకీర్తి
చంద్రమండలుఁడితండు చేజాచు నేని
అగ్రహారము లీయరే? అవనపతులు. 622

తే॥గీ॥ తల్లిదండ్రులఁగనియెడు తలఁపు లాడు
బిడ్డలకుఁగల్గకుండునే? వేయునేల?

పదియు రెండేండ్లుగడచె నిప్పటికి మిమ్ముఁ
గనెడు భాగ్యమ్ము లభియించెఁగాదె? తల్లి! 623

కం॥ పలికితి నెవియో నా దగు
పలుకుల లోపమ్ము లుండు బహుభంగుల మీ
యెలమిం గోరిన బిడ్డను
దలఁతురె? లాతిగను నన్ను దయ మనఁగనరే? 624

కం॥ ననుఁబెదనాన్నయె యెఱుఁగునుఁ
గన నేరడ నాదు తండ్రి కడుపార ననుం
గని పెంచి పెద్దఁజేసియు
నన నేమున్నది యమాత్యుఁ డరయఁడె? జగమున్. 625

కం॥ ననుఁగని పెంచి మహాకవి
యును త్యాగియు భాగ్యశాలియును భక్తా
గ్రణియగు మేనత్త కుమా
రుని వరు వరియింపఁజేసె లోకము మెచ్చన్. 626

తే॥ గీ॥ అత్త నను నెత్తి నిడుకొనె నంత కన్న
మామ వేయు మడుంగుల మన్ననఁగనె
మగడు నను ప్రేమ సుమముగ మౌళిఁదాల్చె
నాకు లోపం బొకింత యున్నదియె? తల్లి! 627

కం॥ వస్తువులును వాహనములు
"జాస్తి" గ లేకున్న మాదు సదనము నందున్

పస్తుండునె? యే యతిథియు
విస్తళ్ళను వేయు తీయు విధముం గనరే ? 628

కం॥ పదిమంది కిడుచుఁదినుటయె
ముద మగు మాదంపతులకు ముద మారఁగ మీ
సదనమునకు వచ్చిన మా
సదనమ్మునఁ జరిగినట్లు జరుగునె? తల్లి ! 629

కం॥ అమ్మా! మీదంపతులకు
నెమ్మనమున కెక్కునట్లు నే నడపెద లే
శమ్మున్ సందియ మందకు
మమ్మా! కమలాంబ! లెమ్మ! ఆనందమునన్. 630

తే॥ గీ॥ అమ్మ! మీ నాన్న పెదనాన్న అడుగు జాడ
లందు నడచును మీ యమ్మ అన్న దాత్మ
నిన్నుఁగాదను వార లందున్న వారె?
వెఱపు నీ కేటి కమ్మ ! ఓ వెఱ్ఱితల్లి ! 631

తే॥ గీ॥ మీ చరిత్రమ్ము పూర్తిగ మే మెఱింగి
నేటికి పదారవ దినమ్ము నిక్కువమ్ము
నమ్ము! మని తల్లి పెదతల్లి నమ్మకముగఁ
దెలుపఁగమలాంబ యొక కొంత యెలమిఁగొనియె. 532

కం॥ మనసార గోపనార్యుని
మనమున కెక్కెడు విధాన మరి దెల్పియు మా

పున పెదమేనత్త ముద
మ్మున పయనముఁజేయు నిష్టముం గొనఁజేయన్. 633

ఉ॥ ఇచ్చొటు నీ పురీజనము లేలికగాఁగను చున్నవార లే
ముచ్చటు లాడకే పయనముం బొనరింపఁగ ధర్మమౌనె? మీ
యిచ్ఛయు నాదుకోరికయు నేర్పడ రేపకడన్ ముదమ్ముతో
వచ్చెద నాదు మాట నొకపాటిగఁజూడక యాదరింపుడీ!

ఆడిన మాట తప్పు టొక యప్పుడు నా కలవాటు లేదు మా
రేడది యొప్పునే? నను భరించునె? యాతని కాలి బంటనై
యాడిగముం బొనర్చు పనియున్నది యెంతయునేని నాకు నీ
నా డెటులో సహించియును నా మది కెక్కఁగవిందుఁజేయరే?

చ॥ ఇంతటి నుండి యీ గృహికి నీగృహమందున నేరి కేరియున్
స్వాంతమురంజిలంగనొక పట్టెడు కూడిడు భాగ్యమున్నదే?
ఇంతటి తోడనే సరిగదే? విధి నేమని యాడఁజెల్లు? సు
స్వాంతలుమీరునానొడులసారమెఱింగి ముదంబుఁగూర్పరే?

ఉ॥ రామునియాజ్ఞ కాదె? రఘురాముని యంశల వారుగారె? మా
మామలు, వారిఁగా దనెడి మాట యొకప్పుడు నేనిఁబుట్టునే?
యే మగుగాక యీపయిన నీ దినమొక్కడె కోరుచుంటినన్
మీమది నన్యథాగనక మీకిటమూడవరోజు విందుగాన్. 637

చ॥ అనవుడు గోపనాహ్వయుఁడు నత్తలు తక్కిన బంధువర్గముల్
మనమునఁగల్మిలేము లొకమాదిరిగఁగాంచు మహానుభావు డీ

తని మదికిన్ ముదమ్మగువిధమ్ము శుభోదయ హేతువౌ గదే?
యని తలపోసి సంతసము నందుచు సమ్మతి సేసి రెల్లరున్.

ఆ॥ వె॥ గోలుకొండపురికి గోపన్న చన నుండె
నే డటన్న మాట నేలకొండ
పల్లెఁబొడమి సంత నెల్ల రా పుర జనుల్
విన< దలంపని నుడి వింటిమనుచు. 639

కం॥ మా నేలకొండపల్లెకు
మానము ప్రాణమ్ము నయిన మా గోపనయే
యీనాఁడు గోలుకొండకుఁ
బోనుండె నటన్న మాట పుట్టెనె? బ్రదుకన్. 640

కం॥ నిరతాన్నదాన దీక్షా
పరుఁడగు గోపన్న తాను బ్రదుకఁగ నెటకో
పరదేశ మేఁగ వలెనే?
అరరే! యీ యప్రతిష్ఠ కంతుంగలదే? 641

కం॥ ఈ యపకీర్తి పురమ్మున
కే యెడ మాయుటలు పుట్టునే? యౌరా! యీ
హేయఃపు బ్రతుకేటికి నని
ఆ యూరం గలుగు జనము లందరు నొకఁడై. 642

తే॥ గీ॥ నేల యీనిన చందాన నేలకొండ
పల్లెపురి జను లే గాక పరిసర పుర

వాను లెల్లరు గోపన్న పద సరసిజ
ములకు మ్రొక్కిడ వచ్చిరి యొక్క మొగిని. 643

కం॥ ఎఱగుచు గోపన మృదుపద
సరసిజముల కెల్లవారు స్వామీ! మీరి
ట్లురుగం దగునే? మము నె
ల్లరి వీడియు గోలుకొండ రాట్పురి కనుచున్. 644

ఉ॥ తాతల నాటినుండియు నుదార గుణాఢ్యులు మీర లందు వి
ఖ్యాతినిఁగాంచె మీజనకుఁడన్నిటఁదండ్రినిబోలియుండియున్
దాతృత నాశిబీంద్రరవినందనులన్ స్మృతి కెక్కఁజేయు ప్ర
ఖ్యాత వదాన్యమూర్తివి!మహాత్మ! నినున్నుతియింప నేర్తుమే?

కం॥ మము శ్రీరామ పదాంబుజ
యమలార్చన పరులఁజేసి ఆస్మ ద్భవ తా
పము నాయఁజేయు గురు నిను
నమలాత్ముని వీడు టెటులో అనఘా! చెపుమా! 646

కం॥ యావజ్జీవము నీపద
సేవనము నీదు నాజ్ఞ శిరమున గొనుటల్
మా విధి గురువర! యేటికిఁ
బోవలెనో గోలుకొండపురికిన్ జెపుమా! 647

తే॥ గీ॥ అతిథిపూజలు బంధుమర్యాద లఖిల
కార్యనిర్వహణాదిక గౌరవములు

నెఱప మా సకలార్థముల్ నీ కరమున
నిడఁగ నుంటిమి గోల్కొండ గొడవ దేల ? 648

కం॥ సిరి బాసిన యవ్వేళల
గరిమముమైఁగాంచు బంధు గణములు గలరే ?
పరికింపు మయ్య! గురువర!
తరియింపఁగఁజేయుమయ్య! దయతో మమ్మున్. 649

తే॥గీ॥ మేము మీ వలనన్గొన్న భూమిఖండ
ములను నీ నాడె మీకీయఁదలఁచి నాము
గోలుకొండకుఁబో నేల ? కొలదిదక్కి
యేలు కొనుమయ్య! యీ యూరినెలమి మెఱయ. 650

కం॥ మముఁబెనులోభుల మూర్ఖులఁ
గమ శిక్షితులం బొనర్చి రాజిత విద్యా
క్రమ మెఱుక పఱచి విజ్ఞా
నముఁగూర్చిన నిన్ను విడువనగునే? మాకున్. 651

తే॥గీ॥ దేహి బాసిన దేహమ్ము తీరు గాదె ?
జౌర! నీ వేఁగ నీ యూరు తీరు నెన్న
ననుచు నూరున సంపన్ను లయిన వార
లధిక తర భక్తి వందన మాచరించి. 652

తే॥గీ॥ నిలువ; గోపన్న కను లశ్రువులను గురియ
నెల్లవారల పరికించి యేడ నున్న

నన్ను మీ వానిగాఁగనుఁ డన్నలార !
విధిని దాటంగ నగునె? యవ్విధికి నేని. 653

కం॥ ఇది రామచంద్రు నాజ్ఞగ
మది నెంచుచు నన్ను మీరు మన్ననఁగనుఁడీ !
ఎద సీతారాముని మృదు
పదసేవయు మరువ కెట్టి పట్టున మనుడీ ! 654

కం॥ నా యందుఁ గలుగుపేరిమి
నా యీ గృహమందు రామనామము సతమున్
జేయింపు డన్న దానముఁ
జేయింపుఁడు నిత్య మతిథి సేవన మెలమిన్. 655

ఆ॥వె॥ అతిథి పూజనీయుఁ డభ్యాగతుఁడు విష్ణు
వండ్రు పెద్ద లరసి యధిక భక్తి
నతిధి సేవఁజేయుఁడారఘురామ ప
దార్చనమ్ము సేయుఁడన్నలార ! 656

ఆ॥వె॥ పయనమునకు సిద్ధపడి యుండి రీ బంధు
జనము లింక నిలువ మనకుఁజనదు
వెడలవలయుఁబేర్మి వెడలింపు డీ! మిత్ర
గణములార! భక్తగణములార ! 657

తే॥ గీ॥ దేహి దేహమ్ము వీడెడు తీరుగాదె ?
గేహి గేహమ్ము వీడుట దేహగేహ

ములు నిమిత్తమ్ములగు భోగములకు యోగ
ములకు నింతియు గా కొండు కలదె? తలఁప. 658

చ॥ అనుచు ననేక రీతులను అస్థమెయిఁదనుఁగాంచ వచ్చియుం
డిన జనులెల్లరున్ మదిఁగడింది ముదంపడి మ్రొక్కు వెట్టఁగో
పన పరమార్థతత్త్వమును బాగుగఁదెల్పుచు నేఁగఁజొచ్చెఁబా
వనమతి వారి వీడి తనవారల తోడుత గోలుకొండకున్. 659

ఉ॥ అక్కన మాదనల్ ముదమునందుచుఁ దామెదు రేఁగు నంతలో
గ్రక్కున నేఁగుదెంచి కమలాపతితోడుత గోపనాహ్వయుం
డెక్కుడు భక్తి మ్రొక్కులిడ నెంతయు వేడుకఁజేరఁజీరి తా
మక్కునఁజేర్చఁగాఁగురిసె నంత ముదక్షిశుభాబ్ద వర్షముల్.

వ॥ అంతఁగమలాంబా గోపనల యథార్హాసనులంజేసి యోగ
క్షేమమ్ము లారయుటయుఁగ్రమక్రమమ్ముగఁ గొంత కాల
మగుడు అక్కనమాదన లొక్కెడ నిట్లనుకొనిరి. 661

చ॥ కలిమియు లేమియున్‌సమముగాఁగనుచుంబతిమానసమ్మునన్
మెలకువమై మెలంగెడి యమేయగుణోదయ మత్కుమారి చి
త్కలితుఁడు భాగ్యశాలియు, నుదారుడునై సిరిసర్వమేఁగి నం
దొలఁగనిత్యాగభాగ్యుఁడును దుర్జనదూరుఁడు మాదునల్లుఁడున్.

కం॥ సిరితొలఁగెనన్న దైన్యం
బిరువురిలో నొకరియందు జేనియుఁగనరా
దరుదగు పేరల చైదముఁ
బరికింపఁగ వీరివాణ్యఫల మెట్టిదియో! 663

కం॥ పలికెడు పలుకుల చొప్పునఁ
గలిమికి లేమికిని నింత కాలిడ వీలుం
గలుగదు సరి కలయందేఁ
దలపడ వీల్పడునె ? పలుకుదరికిం జేరన్. 664

శా॥ ఔరా! వీరల పుణ్యమెట్టిదియొ రామా! రామ! శ్రీరామ రా
మా! రామా! యని రామనామ మెద నాహ్లాదమ్ము రేకెత్తఁగా
నోరారన్నుతియింతురెల్ల యెడలందుం గన్నులన్ బాష్పముల్
గారన్ భక్తిభజింతుర్రి సర్వజగమున్ రామస్వరూపమ్ముగాన్.

కం॥ ఎప్పుడు శయనించెదరో!
ఎప్పుడు భుజియింప వీర లేతెంచెదరో
ఎప్పుడు కనుగొన నుండిన
నప్పుడు స్మరియించుచుందు రా రఘురామున్. 666

చ॥ తలఁపఁగ నీ సతీపతుల తత్త్వమొకండ యథార్థపుంగతిం
దలఁచిన వీరలిర్వురు నుదారగుణాకరు లిందు నొక్కరుం
దలఁప రిహమ్ము రాముని పదమ్ము భవాంబుధి పోతమన్నయా
దలఁపు చివుర్చి వీరల యెదల్ బ్రిమదాంబుధి నోలలాడెడిన్.

తే॥గీ॥ పలుకరించిన ముత్యాల వాన కురియు
నెట్టి క్లిష్టసమస్యయు నింతలోఁనఁ
దీరు యోజించి తెలిపిన తెలియబడని
దున్న యటు తోచదొ కఁడు గోపన్నమతికి. 668

ఉ॥ ఈతఁడమాత్యుఁడైన ధరణీశ్వరు లెల్లరు మెచ్చికొ్కవెట్టు వి
ఖ్యాతి గడింపకుండునె? మహామతి లౌకికరంగమందు ప్ర
జ్ఞాతతకీర్తిసాంద్రుఁడు నుదారగుణాకరుఁడల్లువాని భా
గ్యాతిశయమ్ము మోదమిడదా? సుఖమీయద? మాకునెందునన్.

ఉ॥ మాకమలాంబ రాసిరి రమాసమయై వెలుగొందఁజేయు సు
శ్రీకుఁడు గాడొకో? సచివశేఖరుఁడై వెలుగొందెనేని ప్ర
జ్ఞాకుశలుండు గోపన జగన్నుతవర్తనుఁడెన్నియేని ధ
ర్మాకర సత్కృతుల్ నెఱపి యౌనని లోకము మెచ్చుకోఁడన్.

కం॥ బుద్ధిన్ గీష్పతితుల్యుఁడు
శుద్ధాంతఃకరణుఁడనుచు సూర్యగ్రణు లే
యిద్ధ చరిత్రులు నుడివెద
రిద్ధర గోపన్న కెవ్వ రెనయనఁ దగఁడిన్. 671

ఉ॥ అట్టి గుణోదయుండు మహితాత్ముఁడటన్న యశమ్ముగన్నతో
బుట్టువు ముద్దుపట్టి మముబోలిన భాగ్యపరుం బొనర్ప కే
యిట్టుల నిద్రవోవఁదగునే? యని యంచు నమాత్యసోదరుల్
గట్టిగ నెంచి మించి తగుకార్యము ప్రస్తుత మొక్కడెంచియున్

ఉ॥ అక్కనమంత్రి పేర్మిమెయి నల్లునిఁజెంతకుఁజేరఁజీరి పె
న్మక్కువతోడుతన్ గమలమాకొమెరిన్ దమయల్లువానికిన్
బ్రక్కన నిల్పి రాసిరుల రాజిల మీఁరలు మిమ్ముఁజూడ మా
కెక్కుడు కోర్కెకద్దు వినరే? శ్రుతిపేయములైన నానోడుల్.

కం॥ అని తానొనరుపఁబూనిన
పని పనిగొని తెలుప మధురభాషణముల
నక్కనవిని కమలమ సర్వ
మ్మనుగని కనె ధవునిభావముం గను వేడ్కన్. 674

కం॥ చిరునగులు మోముదమ్మిం
బరువిడుచును బాలవెల్లువల జేయఁగ నా
దరమునఁగను పతిఁగనుఁగొని
మురియుచుఁగమలాంబ తండ్రి మురియఁగఁబలికెన్. 675

కం॥ పెద్దలు మీరాడెడి యే
సుద్దులు భాగ్యోదయములు సూరినుతా! మీ
ముద్దుల యల్లుని భావము
నిద్దియ మీమాట మంత్రమేగద? మాకున్. 676

కం॥ అని పలికిన కమలాంబను
గని గోపన మోముఁగాంచి కౌతుకమున న
క్కన భూమీధవు భావ
మ్మను దనభావమునఁజొనుపు పూనిక నుండన్. 677

చ॥ ఒకతరిఁబూవుదోట నృపుఁడుత్సుకుఁడై గతకాలగాథలన్
బ్రకటితబుద్ధి వీనులలరన్ వినుచుండియు గోపనార్యు గా
థకుఁగడుమెచ్చి యింతటి వదాన్యుఁడు నాపరిపాలనమ్మునఁ
డొకఁడు కలాడటంచు వినియుంటిని రాపిటకాలఁడేమొకో?

కం॥ మామంత్రులిలకల్లుండటు
యేమియుఁదన కుంచుకొనక యిడెనట సర్వం
బేమీ! యా యౌదార్యము
మామదికిని నతనిఁగనెడు మక్కువ పొడమెన్. 679

ఉ॥ అక్కన మాదనాహ్వాయ మహాసచివుల్ దమయల్లు వానికిన్
దక్కిన కీర్తికిన్ మది ముదంపడియుందురు నానవాక్షమం
దెక్కుడుగా వచింప నెటులెంతురు? గోపనయేడ నుండెనో
తక్కకఁజూచి యాతని యుదారతకున్ బహుమాన మీవలెన్

ఉ॥ అక్కనమాదనాహ్వయుల కప్పటికప్పుడు పూవుతోటకున్
మక్కువతోడ రమ్మనెడి మానితఁపుంబిలుపొందుచేరె రే
డెక్కుఁడు పేర్మిఁదోట కిపుడే చనుదెండను వాజ్ఞవెట్టె నిం
దొక్కఁడెదో శుభోదయమునుండెడునంచు నమాత్యులంతటన్

తే॥గీ॥ అలసింపక రాజమర్యాద లలర
నెలమి నుద్యానవనమున వెలయురేని
దర్శనముఁజేసి పేరిమి ధరణినాథు
డిడెడు మన్ననలంగొని కడుముదమున. 682

తే॥ గీ॥ రెని పల్కులఁజాల్వారు తేనె లాని
సముచితాలాపులై ప్రభుసమ్మతిఁగొని
ముదము గదురఁగఁ దమగృహమునకుఁజేరి
సచివముఖ్యులు నెంతయో సంబరమున. 683

కం॥ కమలాంబాగోపన్నల
ప్రమదమ్మునఁజేరఁజేరి రాజిత కార్య
క్రమ మెఱిఁగించియు భూపతి
సముఖమ్మున మసలుకొనెడి సముచిత రీతిన్. 684

కం॥ తెలిపిన గోపన సర్వం
బెలమిని విని మేనమామ లెంతయు వేడ్కం
దలఁలూపి మెచ్చఁ దత్పద
జలజమ్ముల కెఱఁగి పలికె సమ్మద మొదవన్. 685

కం॥ జననీ జనకులు వోయిన
దినమాదిగ నెల్లయెడలఁ దేకువమెయి మ
జ్జననీ జనకుల యటు తొలి
ననుదినమును మిమ్ముఁగాంతు నస్మద్బుద్ధిన్. 686

కం॥ దానికిఁదగుఫల మందితి
నౌనన శ్రీరామచంద్రు ననవరతమ్మున్
బూని భజింపం దగియెడు
మానితమగు పదవి నిడరె? మామలు నాకున్. 687

కం॥ రాజాజ్ఞఁదాల్చి యౌదల
రాజన్యవరేణ్యుఁడయిన రాముని సేవన్
రాజశ్రీ బ్రహ్మశ్రీ
రాజిత విభవుండనగుచు రాజిలు దెలమిన్. 68౦

కం॥ మామలపేర్మికి గురియై
రాముని పదనీరజముల రంజిలు భక్తి
శ్రీమంతుఁడనై తానీ
షా మన్నన లందుకొనెద సముచిత రీతిన్. 689

చ॥ అని ముదమారఁబల్కు తమయల్లుని పల్కుల కంతరంగమం
దున నెనలేని పేర్మిఁబరితోషము నందుచు మంత్రిపుంగవుల్
మనకిఁక లోటులేదు బుధమానితవర్తనుఁడైన యీతఁడా
జనపతిమ్రోల నెక్కుడు ప్రశంసకుఁబాత్రుఁడునై చెలంగెడిన్

కం॥ అని యనుకొను నయ్యెడ లే
ఖినిఁగొని విజ్ఞప్తిఁవ్రాసి కేల్మోడ్పిడి భ
క్తిని తొలిఁదత్పత్రమ్మును
మనసారఁగ నిడిన మేనమామలు మంత్రుల్. 691

తే॥గీ॥ సచివధర్మమ్ము దళుకొత్త సర్వమెల్లమి
గాంచి యీతని రచన కక్కజము నంద
కున్నె? తానీష జనపతి? అన్న! యెంత
వాడు మాయల్లువాడని యాత్మఁబొంగి. 692

తే॥ గీ॥ అవనిపతి కొల్వుకూటమ్మునందు నున్న
సమయ మందున నీదగు సమయఁ మెఱ్ఱిఁగి
అరుగుదము రేపకడ నీకు ధరణివిభుఁడు
తగిన యుద్యోగ మిడును ముదంబెసంగ. 693

కం॥ అని తెలిపిన సూఫులకున్
వినయమ్మున మ్రొక్కవెట్టి పేర్మి మెలివుం
గొన సూఫుల హృదయమ్ములు
జనె గోపన కమలఁగూడి సంధ్యాకృతికిన్. 694

చ॥ తనకొలమందునం బొడమ్ము దాశరథిన్ మనసారఁగొల్చు పా
వనతరమూర్తి గోపన యభంగుర భక్తిని నర్ఘ్యమీయఁగాఁ
గని నిజరాగసంపద జగమ్మున నించె సహస్రకరుండు నాఁ
గనుపడె దా ప్రతీచినతి కన్నులవిందుగ రాగభోగియై. 696

మ॥ కలికాలంబిది లోభమోహముల కాగారమ్ములై యెందరో
జలజాతాసనవంశ్యులెల్లెడల నాశాపాశబద్ధాత్ములై
విలసద్వైదిక ధర్మదూరులగుటన్ వీక్షింపఁగా నొల్ల వీ
రల నన్నట్టుల భాస్కరుం డపరపారావారముం జొచ్చెఁదాన్.

చ॥ కలిమియు లేమియున్ సమముగాఁగను గోపనయంతవాని చి
త్కలితుని రాజసేవకునిగాఁ గొనె కాల మదెంత దుష్క్రియా
కలితమొ యెంతవారి కెఱఁగంబడునే? యను కొండపల్లె వా
రల స్వవిచార దుఃఖముల రాసులనన్ జెలరేఁగెఁ జీకటుల్.

మ॥ అనయమ్మున్ రఘురామ పాదజలజ ధ్యానంగియౌ గోపనన్
మనసారన్ శిరసావహించి బహుసమ్మానార్హునిం జేయఁగా
నెవరుం జూపెడు మ్లేచ్ఛభూమిపతి తానీషా యశోవల్లికల్
మినుపీథిం జెలరేగి పూచె నను కల్మిన్ వెల్గె దారావళుల్.

ఉ॥ భూతదయాపరుండు పరిపూతచరిత్రుఁడు భక్తమాత్రుఁడే ?
ఆతత దాతృతావిభవుఁడౌ మన గోపన యంతవాని ప్ర
ఖ్యాత సుధాప్రవంతులు దిశాంబరముల్ సుడిచుట్టిరా నెటో
శీతమయూఖుఁ డంబరముఁజేరెననన్ బొడకట్టెఁగందునన్.

ఉ॥ ఏలొకొ? నిద్రపోయెద రిఁకేయని లోకము నవ్వ సోమరుల్
గాలమువిల్వ నింతయినగానరు సంపద లొందు నొక్కొ?ని
ద్రాళులభద్రముల్గృహములన్దలలెత్తునె? కార్యజాతముల్
గూలవె?యంచుమువ్వురునఁగొక్కొరుకోయనికోళ్లుగూసెడిన్

ఉ॥ భూతదయార్ద్రబుద్ధిఁబొలముల్ధనముల్సకలమ్ము వీడియున్
దాతలనాటి లోగిళులు దద్దయు రాముని సేవఁజేయఁగా
నాతత భక్తి నిచ్చిన మహాత్ముఁడు దాతల నేడు గోపన
ఖ్యాతుఁడొకండె చూడు డనినట్టుల వేకువఁజుక్క చూపడెన్

ఉ॥ జారఁగఁజొచ్చెఁదారకలు చందురుడున్ వెలవెల్ల నాయె ది
గ్ద్వారములెల్ల మోమిడియె గైరవకాంతలు మోముముడ్చెఁబ్రా
జ్ఞారిముఖాంబుజమ్మున రకమ్ముగఁగుంకుమబొట్టుఁదాల్చెనె
న్వారును హాయిహాయియనఁ బైకొనెశీతలగంధవాహముల్

ఉ॥ కామముక్రోధలోభములుకాన్కలుగామద,మోహ,మత్స, రా
లామెతలై జెలంగగ దయా,మృదు,సత్య,వచ,శ్శుచి,త్వముల్
కామిత సేవానాప్రసవ కాండములై వెలయుంగ భక్తి శ్రీ
రాము ప్రభాతసేవ బళిరా! యన గోపన సేయఁజొచ్చెడిన్

చ॥ అనుగులు తోడిబందుగులు నత్తలు, మామలు, నెల్లవారలున్
మనమున రామనామ మహిమమ్ముఁదలంచుచు నోరు నొవ్వ గో
పనయెటు లాలపింప నటుపాడుచు పంక్తిరథాత్మజన్మునిన్
గనియెడు కోర్కె రామభజనమ్మునుఁజేయగజొచ్చి రయ్యెడన్.

చ॥ అరుగుచునుండి విప్రులుమహానదిస్నానముఁజేయసేద్యమున్
నెఱపెడు కాపులన్ బొలము నేలల కేఁగుచునున్నవారు భా
స్కరునుదయమ్ముఁగోరి జలజమ్ములు నించుక విచ్చుఁజొచ్చెఁజె
చ్చెర నభిసారికల్ సదనసీమలు జేరిరి చాటుమాటుగాన్. 705

ఉ॥ రాజులొసంగు మన్నన పరాకుననైనను విశ్వసింప రా
దోజనులార! తత్కృతి నెదోఒకయప్పు డెదోవిధమ్ముగా
నేజనుఁడైన బాధపడుఁటే నిజమంచును రాట్చరిత్రి వా
గ్రాజిని రాజిలున్ నృపులుకావివికావని కాకులార్చెడిన్. 706

చ॥ ప్రమద మెసంగ నాత్మపతి రాకకు నారతిపట్టి నిల్చెనా
కమలము ల్లుల్లసిల్ల బుధకాండము వందనముల్ బొనర్ప లో
కము వెలుగొందు భద్రిగిరికానన రాము మహోదయమ్మునా
విమల సువర్ణవర్ణకర విశ్వదృశోదయ మయ్యెఁదూర్పునన్. 707

ఉ॥ వైదికకర్మ నిష్ఠులగు బ్రాహ్మణముఖ్యులు వీతిహోత్రి సే
వాదులొనర్ప లౌకిక కులాగ్రిజులయ్యయి రాజకార్య మ
గ్నాదర బుద్ధులై వెలయ నన్నికొలమ్ములవారు వారికిం
గాదఁగు కార్యముల్ నెఱపఁగా సుమనోరథులై సెలంగఁగాన్.

చ॥ ప్రముదిత నీరజాంగనలు బారులుదీరిచి దోయిలింపఁగాఁ
దమకొలఁదిం గ్రహింపకయ తద్దయునుం దెగసాగు నీడల
క్రమపథగాముల ప్లైచటు రక్షణలేక పదాల్ప్రవాల న
ర్యముఁడు నభోంతరాళమున రాజిలఁజొచ్చెను దుర్నిరీక్ష్యుఁడై

మ॥ అతిథివ్రాతము బంధువర్గమును మిత్రానీకముం బంక్తులం
దతులోత్సాహముతో భుజింపఁదమ మేనల్లుండు సం
తతశ్రీరామపదారవింద భజనోత్సాహుండు గోపన్నతో
డుతఁదాముంభుజియించిరుత్సుకత యొద్దున్ మీరసోదర్యులన్

తే॥గీ॥ ఇష్టమృష్టాన్న సంతుష్టి నెసఁగు నతిథి
వరులు బంధుగులును హితుల్ ప్రమద మందఁ
గప్పురఁపు వీడెముల నిడి కడుముదమునఁ
దములముంజేసి రల్లుఁడు దాము నెలమి. 711

శా॥ భుక్త్యాయాసముఁదీర నెల్లరకు నామోదమ్ముతో శయ్యలా
సక్తిన్ గూర్పఁగ నేర్పరించి సచివుల్ సంతోష మేపార ధీ
శక్తిన్ దేవగురూపముం డినకులక్ష్మానాథ పాదార్చనా
సక్తుం డల్లుడు దాము సేసిరి శుభేష్టాలాప శయ్యాక్రియల్. 712

మ॥ అపరాహ్ణం బగునంత లేచి యుచితవ్యాపార నిర్మగ్న భా
వపరీతాత్ములు మంత్రిపుంగవులు గోపన్నన్ ముదన్వీత భూ
మిప సందర్శన లక్ష్యలక్షితునిఁ బేర్మిం గాంచి దీవించి, భా
గ్య పరుం డీమన యల్లువాఁడనెడి యాహ్లాదమ్ముతోఁగాంచుచున్.

క॥ వినిఁగనుగొను నంతనె
ఎఱుఁగొనను నుద్యోగమిడడె? యవనిపుఁ డంతే
సానందమ్మునుఁ బొందుచు
సీ నియమవ్రతునిఁగనిన నెఱుఁగరె? యెవరేన్. 714

క॥ తెలిపినచొప్పున నింతయు
నలసతగొన కఱుగుదెంచి యల్లునితనముం
దలఁప కమాత్యుల చెంగట
నిలబడు నొక నౌకరటుల నిలబడె నౌరా! 715

తే॥గీ॥ యెంతయుచితజ్ఞుఁడో యితఁ డెలమి భుక్తి
గొనియుఁదమలమ్ము సేయనందనుక నల్లు
వానియట్టుల మసలి యిప్పట్టునందు
నొప్పెఁగేల్మోడ్పున నితరోద్యోగి యటుల. 716

క॥ ఇతఁడు పరాకున నైనను
శ్రుతిహితమగు ధర్మపథము చొప్పఁడ నెడగాఁ
డతిలోక బుద్ధికుశలుఁడు
మతిమన్నుతుఁడితని మెచ్చు మఱచునె? విభుడున్. 717

క॥ అని మది ననుకొనుచును స
క్కనమాదన లెలమి నృపునిఁగనుఁగొన గో స
న్నను రాజసభకుఁదోడ్కొని
చన నెల్లరుఁగాంచి యక్కజంపడ సభ్యుల్. 718

కం॥ అంతం దానీషాభూ
కాంతుండలరంగ నిలచి కైసాచియు సు
స్వాంతుఁడు గోపనయునుఁదా
నంతనె "యుద్ధానఁగైత" లల్లుచు నెలమిన్. 719

తే॥గీ॥ ఆంధ్ర గీర్వాణభాషల నంతొ యింతొ
ప్రజ్ఞగల డాతుకవితఁ బ్రబంధసరణిఁ
బలుక నేరుతు శ్రీరామపాదసేవ
ఫలముగా రాజకార్యముల్ సలుపనేర్తు. 720

కం॥ అని విన్నవించు నంతనె
విని యెంతయు సంతసించి పృథ్వీపతి నీ
మనసెయ్యెది చెపు మద్దా
నిని నిడనున్నాడ ననిన నేరుపు మీరన్ 721

కం॥ కనియునుఁగనేనటు మామల
గని భూమిపు నెమ్మొగమ్ముఁగనుఁగొని విజ్ఞా
పనపత్రమిడిన గోపనఁ
గని ధరణీశ్వరుఁడు పేర్మిగని "దరఖాస్తు"న్. 722

కం॥ అక్కజపడి యక్కనఁగని
మక్కువఁ "దహసీలుదారు" మానితపదవిన్
గ్రొక్కన నీదగు నీతని
కక్కడ భద్రాద్రి కీయనగునా ? యనుచోన్. 723

తే॥ గీ॥ వినయ, గౌరవ,, సంపదల్ వెలయ నిలిచి
యనియె నక్కన భూమిపుఁ డవధరింప
నవనినాయక యిపుడు భద్రాచలమ్ము
కండె యీఁదగియున్నది కనుఁగొన నని. 724

కం॥ అక్కన తెలుపుటె తడవుగఁ
జక్కనఁ "హుకుమిడియెఁ" బేర్మి క్ష్మాపతి గోప
న్నెక్కుఁడు మక్కువఁగొని యే
రక్కజపడ నిలిచె భూమిపాగ్రణి ప్రోలన్. 725

ఉ॥ అంత నృపాలచంద్రుఁడు ముదావహుఁడైగని పేర్మిమీర సు
స్వాంతుఁడ వీవు గోపన! మహాజనులౌనని మెచ్చువెట్ట మ
త్స్వాంతము రంజిలన్ వెలయుమా! పరిపాలన నేడెయేఁగి నీ
వెంతయుఁదత్పదమ్ముగొనుమీ! యనఁగోపన కేలుమోడ్పుతోన్

చ॥ నరవరు నానతిం గొని మనమ్మున దాశరథిం దలంచి యా
దరమునఁగాంచుమామల నుదంచిత భక్తిని మ్రొక్కువెట్టి లో
మురియుచు భద్రభూమిధర మూర్ధమునంగల రామభద్రునిం
దరియఁగ నెంచు వేడ్కఁదలదాలు నయమ్మున వీడిరాట్సభన్

మ॥ తనవిద్యావిభవమ్ము పెంపు సుకవిత్వప్రౌఢిమం గాంచి హె
చ్చినపేర్మిన్నృపుఁడిచ్చు కానికలరాశిన్వాసియున్ వన్నెయున్
గొను నశ్వోత్తమ మెక్కి గోపన మహాకూపార కన్యామణిన్
కనుగొనేఁగెడు గోపునట్లు కమలాకాంతం గనం డాఁజనెన్.

చ॥ తనపతి వచ్చునన్న ప్రమదమ్మున సౌధతలాగ్రసీమ యం
దున నడయాడుచింకనుగనుంగవకదంకయుండెనేమొ? యం
చును గడు బొంచిపొంచి కనుచుం గనుపట్టెనకుంచు మేరుపుం
గనినటు పొంగి మేడడిగిఁగన్నులపండువుగాఁగ భర్తకున్.

చ॥ ఎదురుఁగ నేఁగి యారతిడి యెంతయు భక్తిని పాద్యమిచ్చి ప
య్యెదదవడియొత్తి హస్తములనించి సుగంధయుతార్ఘ్యవారియం
దెద చివురింప మెత్తని యహీనసుఖాసన మిచ్చి కమ్మనై
ముదమిడు క్షీరపాత్రమిడి ముద్దులనుద్దుల తేనెవాకలన్. 720

తే॥ గీ॥ తాలవృంతానిలకుమారు లోలినూత్న
సౌరభమ్ముల మెలమెల్ల జల్లన మెయి
నలమికొని హాయిగూర్పఁగ నెలమిఁబతి స
పర్య నలరారు కమలాంబ ప్రమదమంద. 73

కం॥ మృదుమధురసరణి భూపతి
ముదమునఁదనుఁగన్న చరితమున్ వినిపింపన్
మొదలిడు గోపన పేరిమి
కెదఁబొంగెడు కమలఁ దల్లు లెలమిం గనుచున్. 732

కం॥ ఎదురగు మేనత్తలఁగని
యెదురై గోపన్న మ్రొక్కులిడ దీవనలన్
ముదమారఁబలుకు నత్తల
యెదలు జివుర్పంగ సర్వమెఱిగించియుఁదాన్. 733

తే॥ ఎలమి భద్రాచలమ్మున నేఁగువిధముఁ
దెలుప నలరిన యత్తల తలఁపదేమొ
అంతలో నక్కునంగ్రుచ్చె నబలఁగమలఁ
గురిసెఁగన్నీటిజడివాన కొమిరె తలను. 734

కం॥ అత్తరి గోపన మదికడు
మెత్తినదై యత్తెఁచూడ మేదుర గుణభా
గ్యోత్తర లత్తలు గోపన
చిత్తమ్మున కెక్కఁదెలియఁజేసిరి యిట్టుల్. 735

ఆ॥ వె॥ భద్రశైల మెల్లభద్రమ్ములకు మన్కి
యందు రయినఁగమల నబలఁగన్న
కడుపుపీడి యెటుల కారడవుల తెర
వులను బంప మనసు పుట్టుతండ్రి ! 736

మ॥ "తహసీల్దారుఁడు"ముద్దుఁటల్లుడన మత్స్వాంతమ్ము రేకెత్తె నీ
కిహమన్నన్ ధృణమట్లు తోచెడిని కానీ పేర్మి పెం పెంతయే
రహిఁ బుట్టించెడు నీదుమానసము శ్రీరామార్పితంబౌట ని
స్పృహసౌజంబగు మత్కుమారి నెటులీవెక్కింతువో! తద్గిరిన్.

కం॥ అని తహతహలాడెడు మా
మన మెందరు వెంటనున్న మనమును ప్రాణ
మ్మును సర్వముఁబతి యనియెడు
వనితామణి కెందుఁబ్రాపు పతియెగాడే ? 738

ఆ॥వె॥ పే ప్రకేసి మెడను వేసితి మోతండ్రి!
యురువు రొక్కరూప యెటుల భద్ర
గటిని బదరిగిరిని గాలూఁదెదరొ యన్న
శంక వీడకుండె స్వాంతమందు. 739

తే॥ గీ॥ యనుచు గద్గదకంఠులై వనరు చశ్రు
పులను గురిసెడి మేనయత్తలనుఁ గాంచి
సకలమునుఁ బోవఁగా ధనుష్పాణి రామ
చంద్రుఁడుండఁగ నుండ విచార మేల? 740

ఉ॥ ఈ సకలప్రపంచమున కెవ్వఁడు రక్షకుఁ డారఘూద్వహుం
డేసమయమ్మునందునను నెవ్వరి నెట్టుల బ్రోవఁజెల్లునో
ఆసమయమ్మునందునను నాదట నందరి నట్లు బ్రోచు వి
శ్వాస మొకండె కావలయుభద్రుఁడుభద్రము లేయకుండునే?

కం॥ వినుఁడీ! నా నమ్మకమును
వినుపించెద నత్తలార! విశ్వము సర్వ
మ్మును గాఢసుషుప్తిం గొన
మనిచెడి యా రేడె యెపుడు మనలన్ బ్రోచున్. 742

ఆ॥వె॥ శివుని యాజ్ఞ లేక చీమయు కుట్టదం
చనరె? పెద్దలెప్పు డదియు వినమె?
పౌరుషేయమెంత ప్రబలమైనను దైవ
మందుఁ జేరక ఫలము నందఁగలమె? 743

తే॥ గీ॥ ప్రకృతిబద్ధుల మగుట సర్వమ్ము మనమె
చేయుచున్నార మనియును చేయనేర్తు
మనెడు భావమ్మె పొడకట్టు నంతమాత్ర
మనకు లోపమ్ముకాదు ధీమాన్యులార! 744

కం॥ మన మేగ్రంథము గాంచిన
మనల నిమిత్తముగఁజేసి మాన్యుఁడెవండో
తన కోరిక కనువగునటు
మనలం దిప్పెడు నటున్న మాటయె తోచున్. 745

కం॥ తెరచాటునుండి యెవఁడో
తెరపై కెక్కించు దిగుచు తెలుపును నెవియో
సురుచిరగాథలు వినమే
అరయమె? అప్పుడు బొమ్మలాటలు మనమున్. 746

ఆ॥ వె॥ అంతకన్న నిందు నధికత కలదొక్కొ?
అరయుఁడమ్మ! మీర లాత్మయందు
నింతమాత్రమునకు నీవగఁ పేటికిఁ
బ్రక్కనుండఁ జక్రపాణి మనకు. 747

తే॥ గీ॥ కలఁడు రక్షకుఁ డనియెడు తలఁపు గలిగి
పౌరుషేయమ్మునందు వెన్పడక మసల
వలయు గేస్తవి శాస్త్రముల్ పలుకు గాన
దగదు సోమరితనము స్వధర్మమందు. 748

తే॥గీ॥ తల్లిదండ్రుల తరువాతఁ దలఁప నత్త
మామలేగద? యెందు సేమమ్ముఁ దలఁచు
వార లెవ్వారలకు నట్టి మీర లొంటి
మై మముంబంపఁదగునె? మీమదినిఁ గనుఁడి ! 749

తే॥గీ॥ ఏడియో యొక్క యుద్యోగ మేరుపడిన
యంతమాత్రన స్వాతంత్ర్య మబ్బునొక్కొ?
ఎన్నఁబుట్టినిల్లు మెట్టిన యిల్లు దక్క
అన్య మెఱుఁగునె? యీ ముగ్ధ అబల కమల. 750

కం॥ మీ యెడదలోని మమ్ముల
నీయెడ మాయంత మేము నేకాకులుగాఁ
బోయెడి వారల యట్టుల
మా యిరువురి విడువ న్యాయమా? మా కిట్టుల్. 751

తే॥ గీ॥ అత్తలో తల్లులో పేర్మిమెత్తని మది
కొన్నినాళులు సరిపెట్టుకున్న నెంత
తెలివిగలిగిన ముగుదలు తలకుమీరి
తారతమ్యమ్ము లెఱుఁగని దారిఁబడరె? 752

కం॥ మా మామలకున్ దెల్పెద
మీ మదినొం డెంచకెలమి మీరు కృపార్ద్రిం
బౌ మానసమున మమ్ములఁ
నీ మాటికి వెంటఁగొనుచు నేఁగన్ వలయున్. 753

కం॥ ఈరీతి జీవికకుఁదొలి
సారిగదా యిద్ది దీని స్వాంతమ్మున యుం
దారసి తొలిసారిగ రం
జేరున్ మెచ్చెదరు మాకు నెంతయు ముదమౌ. 753

చ॥ అని యనురాగమొప్పఁ దనయంతనఁదా వచియించునట్టి గో
పన పలుకుల్ శ్రుతిద్వయికి భావుక భూషణ భాషణమ్మునై
వినఁబడె నంత నెంతయును వేడుకఁబల్కిరి మేనయత్త లో
య్యన స్మిత నూత్నమల్లికల నాననపద్మము లుల్లసిల్లఁగన్.

కం॥ జననీజనకుల యట్టుల
గను మాదంపతుల నెప్పుడుఁ, గనుగొను మా ప
ట్టిని ప్రాణ మటుల మాగో
పన గుణసంపత్తి నెన్న వశమే? మాకున్ ? 756

తే॥గీ॥ లెమ్మె! నాయన! సంధ్యాకృత్యమ్ముఁదీర్పఁ
బయినమున కేమి వెడలంగవచ్చు రేపు
కన్నకడు పంటిమని మమ్ముఁగనకు మెడగఁ
గడుపుకన్నను నెక్కుడుగాదె? కన్న. 757

తే॥గీ॥ అమ్మ! కమలమ్మ! మీతండ్రు లరుగుదెంచు
వేళ గావచ్చె నీవు వేవేగలేచి
వలయు కార్యమ్ములను చక్కబఱుపు మమ్మ!
అల్లదే! సూర్యుఁడస్తాద్రి కరుగఁజొచ్చె. 758

తే॥గీ॥ అనుమఁబెనఁతల్లియును దల్లి మనమలరఁగఁ
బలుకఁ గమలాంబ యెంతయే నెలమి మెఱయఁ
జనియె భవుచెంగటకుఁబతి మనము నందు
మెచ్చి కనుగొను ననురాగ మచ్చుపడఁగ. 759

కం॥ పరువుంబరువునఁ దుమ్మెద
లరిగెన్ వనములకు దెసల నలమెను నిరులున్
మెఱసెన్ ముక్తారత్నాం
బరమై యంబరము మింటవరలెన్ శశియున్. 760

మ॥ ఉరుసాలోఁగడు గొప్పపండితుఁడు రేడుత్సాహముంజెంది వ
హ్వారె! సేబాసని మెచ్చి కానికల సమ్భావించి యుద్యోగ భా
గ్యరమం గూరిచి పంపె నచ్చెరువునాహ్లాదమ్మునుం బొంద నె
ల్లరు సభ్యుల్ మనయల్లువాని కయితల్ వర్ణింప నెవ్వారి కౌ.

కం॥ అలఘుని విద్వన్నుత గుణ
ఖని మనపేనల్లువానిఁ గవితావిభవున్
మన పూర్వపుణ్యరాశిని
మన గోపన నిట్టిఁడనఁగ మనకగు నొక్కొ? 762

కం॥ మనకామమ గుణసంపద
మనలింగనమంత్రి బావ మహితౌదార్య
మ్మును మనకమలా విభవము
మనగోపన గా జనించె మనలం దనుపన్. 763

కం॥ అని యన్నదమ్ము లిర్వురు
నను పమ సచివాగ్రగణ్యు లక్కనయును మా
దనయును మురియుచు నెలమిం
జనుదెంచిరి యెల్లరింటు సమ్మోదమందన్. 764

కం॥ వచ్చిన మామల కెదురయి
యచ్చఁపు భక్తిప్రపత్తి నల్లుఁడు మ్రొక్కన్
హెచ్చిన పేరేమి దీవన
లిచ్చియుఁ దనివోక కౌగిలించియు మామల్. 765

కం॥ ఆనందాంబుధిఁ గ్రుంకిడి
యానందాశ్రువులు గురియ నల్లుని శిరమం
దానందమంది కన్నుల
నానందామృతముఁజల్లి రతివయు నత్తల్. 766

చ॥ వినయవివేకముల్ గలఁడు విజ్ఞులుమెచ్చువదాన్యమూర్తి గో
పన గుణవంతుఁ డల్లుడను భావము దక్క మఱొక్కఁడింత ద
న్కనుఁగొననేరమైతిమి నృకాంతుఁడుమెచ్చి బహూకరించెనో
నని నుతియించి రెల్లరు ముదబ్ధిని గ్రుంకమె? నేటిరాత్సభన్

కం॥ మనమే నల్లుం డల్లుఁడు
మనగోపన యిట్టి సుకవిమాన్యుండతి స
జ్జననుతులగు విద్వజ్జను
లన వింటిమి నేఁడు కంటి మానందమునన్. 768

చ॥ అనుచుముదమ్మునన్ వెలయుచక్కనమాదనలాత్మబంధువుల్
వినఁగ సతీసుతోత్కరము వేడుకఁగాంచఁగ నిట్టులాడెఁ బా
వనతర రాఘవాంఘ్రి మృదుపంకజ భక్తుఁడు సత్కవీశ్వరుం
డెనసిన పేర్మిఁజేకొనియె నీమనబిడ్డను మేనయల్లుఁడై. 769

కం॥ మనపుణ్య మేమనందుము
మనగోపన అల్లుఁడగుట మనవంగడమున్
మనముం దరియించితి మని
యన సందియ మింతకలదె? అరసి వచింపన్. 770

ఉ॥ అలుఁడు మేనయల్లుడట యజ్ఞులువిజ్ఞులు మెచ్చుకోలిడం
జెల్లెడి మేటి దాతయట శ్రీరఘురామ పదాబ్జ సేవనా
సల్లప నోత్సుకుండయిన సత్కవియంట మదీయపుణ్యభా
గ్యోల్లసనమ్మునింతఁగనునొప్పునె? యీమన స్థూలబుద్ధికిన్.

చ॥ అనుచు ముదమ్మునంచుచునుఅక్కనమాదనలన్నదమ్ములం
తనదమమేనయల్లుఁడు,నుదాత్తులుబందుగు,లాత్మమిత్రులున్,
దనరఁగఁ బంక్తియం దతిథితజ్ఞనికాయము లుల్లసిల్ల భో
జనములొనర్చిరెంతయునజస్రముదావహయైకమలాంబ
యొప్పగన్.

తే॥గీ॥ ఇష్టమృష్టాన్న సంతుష్టి నొసఁగి సముచి
తాస నాసీనులగు బంధుతతుల కతిథి
వర్గములకును దమలంపు పళ్లెర మిడి
పలికి రక్కనమాదన లెలమి గదుర. 773

కం॥ కొని గోనెలఁ గండోలము
లను బంప్తకునెత్తియుఁ గమలాంబానతి గో
పన లానందముఁగొన న
క్కనమాదన నెలమిఁగదురఁగని తద్యుగమున్. 779

కం॥ అమ్మా! మీయమ్మయుఁ బె
ద్దమ్మయు మీతోడవత్తు రమ్మా! మదిన
న్యమ్మెందలఁపక పతితో
నెమ్మిం జని రండు పేర్మి నీవున్ బతియున్. 780

కం॥ అని యక్కనమాదన్నలు
మనమలరఁగఁదెలిపి కొమిరెమానితగుణ భా
గ్యనిధానము కమలమ భ
క్తిని కేల్మోడ్చినఁ బెరిమి దీవనలిడియున్. 781

చ॥ అనుపమ భక్తి గోపనమహామతి అక్కన కంజలించి మా
దనకు నమస్కరింపఁ బ్రమదమ్మున వారలు మెచ్చుకొంచు గో
పనమది పల్లవింప నెడబాయుని పేరిమి లేవనెత్తి చో
య్యన నిడి రాశిషమ్ములు ముదశ్రువు లొదలఁ బుష్పవృష్టిగాన్

చ॥ కొమిరెయునల్లుడున్ముదముఁగొల్పుచువంగినమస్కరించు చో
బ్రమదముతో మహాసచివ పత్నులు దీవన లిచ్చి మెచ్చి పే
రిమిమెయి లేవనెత్తియు హరిద్రయుఁ, గుంకుమ, నూతనాంబరాల్
గమల కొసంగి గోపనకుఁ గానుక లిచ్చియు వేడ్కసంధిలన్. 783

కం॥ పుట్టినయిల్లును విధిమై
మెట్టినయిలు దక్క అన్యమెఱుఁగని యీ మా
పట్టిని భద్రాద్రికి నే
డెట్టుల విడనాడి పంపనెసఁగెదు ననుచున్. 784

కం॥ తలఁచుచుఁగమలా గోప
న్నల నొక్కరు గడుసుతనమునం దగ మెలఁగం
గలరే? యని గోపన్నం
గలయంగని పెరిమిఁగమలఁగనుఁగొనునంతన్. 785

తే॥ గీ॥ గుర్రిడ్ల గిరగిర దిరుగు నశ్రువులు బైట
కొంగుఁగెంగేలఁగొని యొత్తికొనెడి కమలఁ
గాంచి శ్రీలక్ష్మి తల్లి! యిక్కరణిఁగనుల
నీరువెట్టుదురే? సతుల్ సారమతులు. 786

శా॥ "తాలూకా" కధికారియై వెడలు భర్తన్ వెంబడంజాలు నీ
వేలా? కన్నుల నీరువెట్టుటలు తల్లీ! నేడు గన్గొమె? యే
బాలల్ నీవలె బేలలైనటులఁదెల్పం జాలుదే? నిన్ను మే
మేలా వీడఁగఁజెల్లునో తెలియరాదే? యంచు శ్రీలక్ష్మితాన్.

తే॥ గీ॥ కనుల నీర్వెట్టుచును రుద్ధకంఠయగుచుఁ
గౌగిటం జేర్చి యక్కునఁ గదియఁబట్టి
నిన్ను విడనాడి యొక యరనిముసమేని
నిలువ నేర్తుమె? యెటు లోప్పు నిలువకున్న. 738

కం॥ అని కన్నుల నీరొత్తుచు
మనమలరఁగఁబలికి కమల మానస మందుం

దనువెంటఁగొనెడి కోరికఁ
గని తానునుఁబయన మాయెఁగడుముద మొదవన్. 789

మ॥ ఇరువుల్ బొర్వ్యులుబంధువర్గములునెంతే మెచ్చుచున్ సాగనం
ప రహీన్ దల్లులుదండ్రులిచ్చఁ మెయిఁబంపంబేర్మిఁ బెత్తల్లియున్
మురిపెంబొప్ప సవారియందుఁ దనపెంపుంగోరి దోతెంచగా
సరివారల్ వినుతింపఁగాఁ గమలమాసాధ్వీవతంసమ్ముఁదాన్. 790

కం॥ తొలిసారి పెండ్లికూతురు
బలె శ్రుతిపేయములు భద్రవాద్య విశేష
మ్ములు మ్రోయఁగా బహువిధ
ముల కాన్కల గోలకొండపురమును వెడలెన్. 791

మ॥ కరవాలాదులు దాల్చి రక్షకభటుల్ గాపాడ నిర్వంకలన్
సరదారుల్ మునువెన్కలన్ నడువనిచ్చన్ రామదాసుండు దా
బరివారమ్ములతోడఁ బాటుఁబడిపోవన్ వాహనారూఢుఁడై
జరిగెన్ రోజులు దాటఁబల్లె లటవుల్ సంతోష మేపారఁగన్.

మ॥ కిటి శార్దూల ముఖోరుఘాతుక మృగాకీర్ణమ్ములై దట్టమౌ
నటవీ మార్గముఁబట్టి యేఁగుతరి బాహాటమ్ముగాఁ బెండ్లివా
రటు నానావిధ వాద్యభేదములు భూమ్యాకాశముల్ ముట్ట ది
వ్యోటులరోదయసంచయమ్ములగుచున్ వెల్గన్ముదంబొప్పఁగన్.

తే॥గీ॥ వెడలు చందందు విడియుచు విశ్రమించు
చంధతమసమ్ము బవలుగా నతిరయమునఁ
బయనముం జేయుచును గతిపయ దినముల
కేఁగి బూర్గుమపాడున కెలమి నంత. 794

## గౌ త మీ మ హా న దీ త ర ణ ము

కనియెన్ గోపనముత్సాముద్రము నమున్కల్ నైచుచున్భక్తిం బా
వని గోదావరి గౌతమీనదిని దివ్యత్తుంగభంగ ప్రవా
హిని మాహేశ్వర మౌళిరంగనటనాహీన ప్రమోదాబ్ధి ము
జ్జన సంసార నిమగ్న భక్తజన నిస్త్రైగుణ్య భావోదయన్. 795

తే॥గీ॥ ధర్మశీలురు నూర్ధ్వరేతస్కు లైన
మౌనివరు లందు నాయుత్తమంపు గతిని
నీదు తీరమ్ము నందుండు నిఖిల జీవు
లందుకొనునంత నీదయ కంతు కలదె ? 796

మ॥ మృతికిన్ జాహ్నవి సత్తపోనియతికిన్ రేవాతటం బెన్న స
త్కృతికిం దానముచేయు ప్రభునఁ గురుక్షేత్రమ్ము కాశియందుఁ ద
త్త్రితయమ్మం బొనరింప శ్రేష్ఠమను ధాత్రీదేవతాసూక్తి సి
యతిలోక ప్రతిభన్ నుతించుటలు గాదా? గౌతమీవాహినీ!

మ॥ జననీ! నీతటమందు సల్పెడు తపశ్చర్యా మహాత్మ్యంబె కా
కునికిన్ భద్రునిసౌఖ్యపైనిలుచునే? యుర్వీజాగున్ వాయునం
దన సౌమిత్రులు గొల్వ నెల్ల జగదానంద స్వరూపుండు పా
వన చారిత్రుఁడు రామచంద్రవిభుఁడంబా! గౌతమీవాహినీ!

శా॥ ఘోరాఘుల్ ఖరదూషణాదులు మహాక్రూరాత్ము లేయయ్యునీ
తీరంబందు వసించి యుండుటనుగాదే? పుణ్యచారిత్రు లౌ
వారల్ బొందెడు సద్గతిం గొనిరి దుర్వారాఘ ఘూర్ధప్రచ్ఛిదా
సారా స్తుత్యుండగు రామభూవిభు సితాస్త్రజ్వాల నో గౌతమీ!

శా॥ నను నీతీరనివాసుఁడన్న నుడికిం, బాత్రమ్ముఁగాఁ జేసి సా
వననామంబగు రామనామమును నా వక్త్రమ్మునన్నిల్పి స

జ్జనసేవ్యుండగు రామచంద్రుని పదాబ్జాతద్వయీ సేవనా
ధనియీతండనుభాగ్యరేఖ పెనుపొందంగాంచుమో! గౌతమీ!

చ॥ అనుచు ననేకరీతుల మహామతి గోపన గౌతమీనదీ
జనని నుతించి కేల్మొగిచి స్వాంతమునందున రామచంద్రుని౯
గనుఁగొనుకోర్కె పెల్లుబుకఁగాంచియు నద్దరి భద్రభూధ్ర మౌ
ళినిగలదేవళమ్మునుబళి! యని మెచ్చుచుఁ గేలుమోడ్చుచున్.

మ॥ బళిరా! రాఘవ! నీపదాంబురుహ సేవాభాగ్య సంపత్తి నా
కెలమిం గూర్చఁగనెంచి తెచ్చితివి కాదో? యిట్లు కాకున్న నా
తలఁపేనాఁడును నాదు పైతృక జనస్థానమ్ముపై వీడెనే?
తలఁమే? నీమహిమమ్ము నాకెఱుఁగ సీతారామచంద్రప్రభూ!

మ॥ అనిప్రార్థించుచుభాస్కరోదయమ? ఆహా! నాదుభాగ్యోదయం
బనఁగాఁజెల్లదె? యంచుభాస్కరునకర్ఘ్యంబీయఁగా నెంచి మ
జ్జనముం జేసియు గౌతమీ జలమునన్ సంధ్యాదికంబెల్ల భ
క్తిసిరూఢిం బొనరించి మౌళితటిఁగెం గేల్దోయికీలించియున్.

భ ద్రా చ ల ప్ర వే శ ము

చ॥ తనపరివారమెల్లఁబ్రముదమ్మునఁ గౌతమి మజ్జనాదికం
బొనరిచి జానకీపతి రఘూద్వహు రామునిభద్రశైల ధా
ముని దరిసింప నెంతయుఁబ్రపూర్ణమనోరథమైనయట్లు దాఁ
గని భజరే! రమాపతి జగన్నుత మానస! యంచు భక్తిమై

చ॥ నలువురితోడ రామభజనమ్మునుఁజేయుచు రామచంద్రునిన్
దలఁచుచుఁ దత్పదాంబురుహదర్శనమున్లభియించెనంచు నా
కలిమికి సంతసించుచు జగమ్ము సమస్తము రామతత్వ మం
చెలమినిఁగాంచుచున్ మఱచె నీజగ మాజగ మేజగమ్మునున్.

ఉ॥ ఎఱుఁగఁడు గోత్రమీనని తరింపఁగఁ గూర్చిన నావయందునన్
జరణము లుంచి నట్టిరుఁగఁ జాలఁడు నౌకయు దీర మంటి న
ట్లెఱుఁగఁడు తోడివార లెవరేని చేయుచు నున్నవారలో
యెఱుఁగఁడు నాఁచుచున్న యటు లేగను పట్టెఁడు మాచువారికిన్

ఉ॥ స్వాగతమీయఁగా నెదురువచ్చియు వేచియునున్న యట్టియు
ద్యోగులుఁ దక్క నౌకరులు నూర జనమ్ములు రైతులెల్లరున్
యోగివరేణ్యుఁడీతఁడని యుల్లమునన్ దలపోసి భక్తిమై
సాగిలి మ్రొక్కి కప్పురపు టారతులీయఁగ సాగి రయ్యెడన్.

చ॥ తెలిపి యొకింత కల్గుట సుధీవరు లౌనని మెచ్చ నెల్ల వా
రలఁగని కేలుమోడ్చి యప్పురా! ననుఁ బేరిమిఁ గాంచవచ్చు మి
మ్ముల శ్రమపెట్టితేననుచు మ్రొక్కెడుచున్ మరియొక్క రీతిగా
దలఁపకుఁడయ్య! యంచును ముదంపడ నెల్లరు పల్కె పేరిమిన్

మ॥ అనఘుల్ మీరలు రామచంద్రుని పరధ్యానార్చనా సేవ నా
ఘన భాగ్యోదయ మింతమంది నిచటన్ గన్విందుగా నొక్కఁటుం
గనుఁగోఁజాలెడు భాగ్యమందితిని మీ కారుణ్య సంపత్తి యుం
తనఁగా నౌనొకొ? పేర్మిఁ గాంచుడి! మదీయంబుల్ నమోవాకముల్

## శ్రీ సీతారామచంద్రస్వామి దర్శన సేవనములు

చ॥ అనుచును మ్రొక్కువెట్టి మనమందర మారఘురామ పాద సే
వనవిధి నందఁగాఁదగిన భాగ్యముఁ గూరిచె రామమూర్తి చ
య్యన మన మేఁగిరాదగదె? యంచన నంతనె యెల్లవారలో
య్యన నరుదెంచిరా రఘుకులాంబుధి చంద్రుని దర్శనార్థులై

## శ్రీ సీ తా రా మ ద ర్శ న ము

శా॥ ఆనందమ్మున నీదు దర్శనముఁ జేయంగోరి యత్నించుటే
గాని నీ నెలనేదియో తెలియు సుజ్ఞానమ్ము లేనట్టి మూ
ర్ఖానీకమ్ముల నగ్రగణ్యుఁడనెనే నట్లయ్యు నీ పేర్మియా
స్థానమ్ముం దెలుపంగ వచ్చితిని సీతారామచంద్రప్రభూ! 811

శా॥ ఆనందమ్మున నీదు దర్శనముఁజేయం గొండపై కెక్క సు
జ్ఞానుల్ పేరిమి నిందు సక్రమముగాఁ గల్పించు నీమెట్లఁ నేఁ
గానన్ ముక్తిరమా వినోదవిమలాగారోరుసౌధాగ్ర సో
పాన శ్రేణులనంగఁదోచెడిని దేవా! రామచంద్రప్రభూ! 812

కం॥ హనుమత్సీతాలక్ష్మణు
లనుచరులుగ భద్రమౌళి యందునఁ గొల్వుం
డిన సీతారాముని పద
వనజద్వయి నాదు మదిని భక్తి భజింతున్. 813

మ॥ బళిరా! రాఘవ! నీదు దర్శనము సౌభాగ్యమ్ము జేకూర్చె మ
జ్జలనారత్నము నన్ను నీదగు సపర్యాలోలురన్ జేయు నీ
తలపుల్ మాతలపూవులై వెలయఁజేతఃప్రీతిని న్గొల్చు మా
తలపుల్ దీర్చెడి వేల్పురాయఁడవుగాదా? నీవు రామప్రభూ!

చ॥ అనుచు నమస్కరించుచు సహస్ర సరోజ సుకుంకుమార్చనల్
బొనరిచి భోగముల్ నెఱపి భూరిదయాపరు రాము నారతిం
గని ముదమంద కేల్మోగిచి కాదగు తీర్థములున్ బ్రసాదముల్
గొని పరివారముల్ మెఱయఁగొండను డిగ్గియు రామకీర్తనన్

ముద్రికా వాప్తి

మ॥ తగురీతిం బరివారమున్ సముచిత స్థానమ్ములందుంచి మే
లగు మూర్తమ్ము సమీపమౌటఱిఁగి ముద్రావాప్తికల్లంత నే
తగు నుద్యోగులతో సమస్త జనసంతానమ్ముతోఁగూడి నా
లుగు వీధుల్ గని శోభనధ్వనులఁదాలూకాకుఁ డానేఁగియున్.

ముదమొప్పం గ్రహియించి ముద్రికను సమ్మోదమ్ముతోధర్మ సం
పద నిల్పన్ దన కార్యభారమును సర్వస్వమ్మనుం దీర్చి యిం
పొదవన్ సర్వజనమ్ములున్ మనమునం దుత్సాహముంబొందరా
ము దయన్ గూరిచి తేటమాటలనుసంబోధించియున్భక్తిమై

కం॥ అనుదినమును రామాయణ
మును పఠియించుటయు భజనముం జేయుటయున్
దనకుం బనిగాఁ దెలిపిన
విని తమ యనుమతినిఁ దెలిపి వెడలిరి యితరుల్. ౪౧౪

ఉ॥ నేను జితేంద్రియుండనని నెక్కొనుగర్వమునన్ వచించు నె
వ్వానినినైన మోహరసవారిధి గర్భమునందు ముంచి ప్ర
జ్ఞానయ హీనునట్టు తెలనాగల వెంబడఁ జేసి యంత సు
జ్ఞానమొసంగి బ్రోచును జగత్పతి శ్రీ పతిభక్త సంతతిన్.

ఉ॥ ఏనకమైన గర్వమొకయింత యెదం గను పట్టుచున్న న
వ్వారలు భక్తులేయయినఁ బండితులైనను కర్మమూర్తి సం
చారులెయైన ముక్తిపద సంపదనంద ననర్హులంచు న
వ్వారల గర్వమూడ్చి యెడబాయని పేరిమి దైవమేలెడిన్.

భక్తిప్రబోధము

మ॥ హరినామమ్ము రుపాపభూమిధర వజ్రాగ్రఘాతమ్మై ఘోరసం
సరణాంభోనిధి బాడబాగ్నిముఖమై సద్భక్త కల్పాగమై
వరలున్ సోదరులార! యేటికితరవ్యాపారముల్ రండు శ్రీ
హరినామంబిడుఁ జావుపుట్టువులు బాయం జాలు భోగ్యోన్నతుల్.

మ॥ హరియించున్ బహుజన్మసంచితములాగాముల్ దరింజేర వె
వ్వరు బ్రారబ్ధమునంది తీరవలె నా బ్రహ్మాదు లాదేవతా
ధరణీనాథులెయేరికిన్ హరిపదధ్యానమ్మె దిక్కింద్రు శ్రీ
హరినామస్మరణమ్ము జేయుటతురా నా! సాయముంజేయరా!

చ॥ భవపాథోధిఁ దరింప శ్రీహరి పదాబ్జాతమ్ము పోతమ్ము సం
భవమౌ నెల్లరి కింతకన్న సులభోపాయమ్ము వేరొండు శే
దవలోకింప నటుండు రాహరి పదధ్యానాదులం గొల్వ నీ
యవకాశమ్మును రిత్తపుచ్చ మనకేలా? రండు! సేవింపఁగన్.

మ॥ మనసంకల్పము దుష్టదూరమయి ధీమన్ముఖ్యు లగ్గించు స
జ్జన సేవ్యంబగు కార్యరూపమయి యాచంద్రార్కమున్ వెల్గుభూ
జన నుత్యంబగు సద్యశోలలన కాస్థానమ్మునై వెల్గు నో
జనులారా! రఘురామ పాదజలజాస్థానమ్ము సేవించుచోన్.

వ॥ అని మరియు భద్రాద్రిపురమాదర్శ భక్త నివాసమ్ముఁగా
నెంచి.

మ॥ అకలంకాత్ముఁడు భక్తశేఖరుఁడు గోపన్నార్యుఁ డింటింటి వం
కకు నేతెంచుచుఁ దెల్పు చెల్లరిని నాకారించుచున్ రామ సే
వకు నుద్యోగులతోఁ బురీజనులతో భక్త్యున్నతిన్ బ్రాహ్మణ
ప్రకరమ్ముల్ వినుతింపఁ జేరెను గృహారామ ప్రదేశానకున్.

తే॥ గీ॥ అందరును రామభజనఁ జేయంగ భక్తి
జానకీజాని పదనీరజములు గొలిచి
మోదముఁగొల్పఁ దీర్థప్రసాదము లిడి
అందరికిఁబెట్టె భోజన మాదరమున. 827

కం॥ అనుదిన ముదయము సాయం
తనమును శ్రీరామచంద్రు దర్శనమును సే
వనభజనమ్ములు జేయఁగఁ
గొనకొని యెల్లరకుఁ దెలిపె గోపన భక్తిన్. 828

ఉ॥ ఇక్కరణిన్ రఘూద్వహునహీనమతిన్ భజియించు చుండియున్
దక్కక రాజసేవయు నుదాత్తమతిం బొనరింపఁజొచ్చి పే
రెక్క "బకాయిసిస్తు"ఁ బృథివీశ్వరుఁ డౌనని మెచ్చ పెట్టఁ బె
న్మక్కువ నారులక్ష లోకమానములోన నిజాము కంపయున్.

చ॥ హరిభజనల్, పురాణములు, నాలయమందున నిత్యపూజలున్
వరలఁగ నేర్పరించి గురుభక్తియు, దైవతభక్తి హెచ్చఁగాఁ
బురములు, గూడెముల్, జిగిగిబోటులు, కోయలు, మున్నుగాఁ వనే
చరులునుఁగూడ రాముపదసారస భక్తులుగాఁగఁ జేయుచున్..

కం॥ ప్రతియేకాదశి నియమ
వ్రతుఁడై శ్రీరామనామ భజనలఁ బూజా
ప్రతతులఁ గమలాసాధ్వీ
యుతుఁడై జాగరముఁజేసి యుత్సాహమునన్. 831

తే॥ గీ॥ ప్రథిత భక్తిప్రపత్తిమై బ్రాహ్మణులకు
ద్వాదశీతిథియందు సంతర్పణమ్ము
షడ్రసోపేత రుచిరభోజ్యముల మధుర
పాయ సపూప పక్వాన్న ప్రతతిఁజేసి. 832

తే॥ గీ॥ ఎలమి దక్షిణ తాంబూలముల నొసంగి
వందనముఁజేసి యావిప్రవర్యు లనఘు
లలరి యిచ్చెడి యాశీస్సు లందుకొనుచు
స్వాంతమందున గోపన్న సంతసపడు. 833

కం॥ అనువత్సర కల్యాణము
లును, నవరాత్రములు, తీర్థములు పుణ్యతిథుల్,
ఘనతరములు, సప్తాహము
లును, నిత్యాతిథి సపర్యలును, విధికృతముల్. 834

ఉ॥ ఏమఱుపాటెఱుంగఁ డొకయింతయు రాముని సేవనాదులన్
భూమిపు కార్యముల్ నెఱపఁ బూనెడుపట్టున నన్యకోటికిం
బ్రేముడి సీగిపట్టున నరిం గొనుపట్టున రైతులోకపుం
గామితముల్ గ్రహించుచు సకాలమునన్ నెరవేర్చుపట్టునన్.

కం॥ ఇటు రాచఠీవి వెలయఁగ
నటు బ్రాహ్మణ్యమ్ము మెఱయ నటునిటు సముఁడై
షటు నాఘటు నాకృతితతి
ఘటు నాఘటునార్థ చతుర గమనుం డగుచున్. 836

కం॥ పరిపాలనమ్ము దక్షత
నెఱపుచు శ్రీరామపాద నీరజ సేవా
పరతం గాలముఁ బుచ్చుచుఁ
దరిసింపఁగ నెంచుమదిఁ దద్దయు భక్తిన్. 837

## రామదర్శనాసక్తి

మ॥ నిను సేవించెడు దాసులం దొక్కఁడనై నీరూపముం గాంచనే
రని నిర్భాగ్యుఁడనైతి నే సకట! శ్రీరామా! ననున్బోలు మూ
ర్ఖుని వేరొక్కని నెందునేసియును కన్గొనేర్తువే? యెందుచే
తను నన్నిట్లు సృజించియుంచితివొ? సీతారామచంద్రప్రభూ!

మ॥ నను నీదాసుని దాసవర్గమున నిందన్కాన్ "నమోద్" జేయకుం
డినచో నాపొరబాటు నాదనఁగ నీడెందంబెటుల్ సైచు సై
చిననీగుండియు రాచగుండెయగుటన్ సీతమ్మ మాయమ్మెటుల్
దన యాంతర్యమునందు వీడెడివి సీతారామచంద్రప్రభూ!

మ॥ తెలియన్ దాసుల నెందనాదరణ బుద్ధిన్ గాంచు రాజన్య గా
థలు, నీవా! సకలమ్మునన్ మనుచు భూదారుండవంద్రయ్య! నా
తలఁపుల్ నీమధురస్వరూపమునుఁ జింతంజేయుఁ బ్రత్యక్ష సే
వలకై నీతలఁపేమొ వేరగుడు దేవా! రామచంద్రప్రభూ!

మ॥ అలవైకుంఠపురీవిహారుఁడవు దివ్యానీక కార్యార్థివై
యిలకేతెంచిన యాదివిష్ణువవు లక్ష్మీశుండ వీవంచు
లలనారత్నము సీత లక్ష్మి యని యాలాపించె వాల్మీకి మా
తలఁపుల్ నిన్ననఁగోర కుండుటెటు సీతారామచంద్రప్రభూ! 841

మ॥ నినుఁజూడంగల కన్ను లెజనికి లేనేలేవ? లేకున్న నీ
యనురాగం బొకయింత చిల్కునెడ నా కాకన్నులుం గల్గవా?
ధనికుల్ బేదల నాదరించుతరిఁ బేదల్ విత్తసంపన్నులై
తనరంజూడమె?క్రొత్తయా?యిదియు? సీతారామచంద్రప్రభూ!

మ॥ నినుఁబ్రత్యక్షపరోక్ష రూపవిభవాన్వితున్ మహారాజనం
దనునిన్ దాసజనానురంజను నెదం దర్శించి సేవించు భా
గ్యని ధానుంజేసియు నాయొనర్చు పరిచర్యానీకముం బేర్మిగై
కొని నన్నుం బరితుష్టుఁజేయఁదగవా కోర్కె? రామచంద్రప్రభూ!

చ॥ నిరుపమ దివ్యవైభవము నీదగు రూపముఁ జూచినంత నే
పురుషులుగూడ మోహామునుఁ బొందెదరంట ధరాసుతామనో
హర! నుతకోసలేంద్రతనయాసుత! దైవతసార్వభౌమ । సుం
దరవదనారవింద శుభదర్శనమీగదె ? రామభూవిభూ ! 844

ఉ॥ పట్టితి భక్తినీదు పదపంకజయుగ్మము,నీసపర్యకుం
బెట్టితి నీశరీరమునను విశ్వజనీనమునాదువాక్కునం
గట్టెద నీపయింగయితఁ గారుణికత్వముఁజూపి యేలెదో?
యిట్టటుఁజూచి గౌతమికి నీడ్వఁగజేసెదొ? రామభూవిభూ?

ఉ॥ ఔనని నీదుదర్శనమునందఁగఁజేసిన సంతసింతు న
జ్ఞానినటంచు నీవుననుఁగాదనినన్ నిను నేను వీడ వం
శానుగతమ్ము గాదె? భవదంఘ్రి సరోరుహసేవ., యెట్టిదేన్
బ్రాణమువోయినం గొలముపాడిని వీడునె? రామభూవిభూ !

మ॥ అనుచున్ రామపదారవిందయుగ సేవానీక కార్యక్రమ
మ్మునకున్ డిగ్గిన మానసమ్మునఁ గరమ్మున్ భక్తిసంపత్తిఁబూ
జను గావించియు రామచంద్రుని పదాబ్జాతద్వయిన్ మైగొలుం
గని చిత్తమ్మునుండి కొంతతడ వానందాశ్రుధారాక్షుఁడై 847

శా॥ అంతా రామయమ్ము విశ్వమని స్వాంతారామ సీమమ్మునం
దంతుంబోతును లేని విశ్వమయు సాత్మారాము దర్శించి ని
శ్చింతానంద సుధారసాంబునిధి వీచీడోలికా కేళికా
స్వాంతుండై బహుభంగులన్ భజన సేయంజాలి గోపన్నతాన్.

ఉ॥ స్వామిప్రసాదముంగొని ప్రసాదమునెల్లరి కీయఁబంచి శ్రీ
రాముని పాదసేవకు ఫలమ్మను గైకొనఁజాలితతచు మా
రాముఁడు దుష్టరాక్షసవిరాముఁడు భక్తమనోబ్జపీఠికా
ధాముఁడుదారుఁడంచుప్రమదమ్మునుఁబొందుచుసంస్తుతించుచున్.

చ॥ కతిపయవత్సరమ్ములు జగన్నుత రామపదాంబుజాత సం
తతభజనాదికమ్ము జననాథుఁడు మెచ్చఁగ రాజకార్య సం
తతియు గ్రమంబెఱింగిన హితప్రకరమ్ము నుతింపఁజేయు చెం
దతిథిసపర్యఁజేయుచు మహాత్ముఁడు గోపన పుచ్చెఁగాలమున్.

## విప్రదర్శనము

చ॥ ఒకయెడ రామనామ భజనోత్సుకుడై భజియించుచుండఁగా
నొకఁడు మహానుభావుడుమహోజ్వలతేజుఁడు బ్రాహ్మణోత్తముం
డకట! యిటుండఁగాఁదగునె? యాలయ మెన్నిశరత్తులైన నూ
రక యిటులుండు పీవని తలంపక పోతిని నామనమ్మునన్. 851

శా॥ "త్యాగాకా"కధికారివై విమలభక్తశ్రేణిలో పెద్దవై
యీలాగీవ యుపేక్షసేయునెడ నేరేమెత్తురే? ఔర! యీ
కాలక్షేపముమాత్రఁ దీరెనొకొ? నీకార్యమ్ము నీవాక్కు వి
ద్యాలంకారము నీయుదారత యమేయంబౌగదా? సత్కవీ!

కం॥ కవులును, భక్తులు గలరీ
యవనిని నీనాఁడు భక్తులందునఁ గవినిన్
గవులన్ నినుఁబోల్ భక్తునిఁ
గవిపర్యునిఁ దెలుపగలమె? కలయం గనియున్ 853

మ॥ నెరవేరున్ భవదీయనామమున నిన్నెమొత్తు రెవ్వారును
ర్వర నారాముఁడు నీకుఁదోడగుచు సర్వమ్మున్ సమర్థించు నీ
కరమందున్ ధన మింతలేదనెడు శంకబొంద నీకేల? శ్రీ
వరులున్ భూవరు లెల్లవారలును నీపాదాబ్జముల్ బట్టరె? 854

కం॥ నీ వేకోరిక లేకయ
యావత్కాలమ్ము సేవనార్చన భజనల్
భావించి సేతు వైనను
వావిరి సత్కీర్తి వెలయ వరలుమ! సుకవీ! 855

కం॥ అని నొక్కి పలికి యంతనె
కను మోఱగిన విప్రవర్యుఁ గనఁజాలమి నో
యనఘా! విప్రరేవణ్యా!
నను నిటు మోసమ్ముఁజేయ నాయమొ? నీకున్. 856

కం॥ నిను విప్రవరునిఁగామదిఁ
గనియేవియొ మాటలాడఁగడఁగితిఁగానీ
నిను దేవ దేవునిగ నే
గననైతిని తెలుపవైతి కమల దళాక్షా! 857

కం॥ నను నీపద దాసుని నీ
పని నొనరుప తెలిపి తనుచుఁ బ్రమదముఁగొననా?
నినునెఱుఁగు కన్ను వెట్టక
చనితని వేదనముఁగొనన? సారసనయనా! 858

కం॥ రామా! నీదాసుడనై
యేమరితినటంచుఁబేరిమి నీకార్యమునా
పై మోపితి జేయుదు నే
సామాన్యుఁడనయ్యు నీదు సాయముకలిమిన్. 859

కం॥ అని ధృఢసంకల్పుండై
పని మొదలిడు టెటులో యనుచు భావమునందున్
గనికని పరిపరి విధములఁ
గనె నొక్కఁడుపాయ ముదయకాలమ్మునకున్. 860

# ఆలయ నిర్మాణ కార్యక్రమము

గ్రామస్థుల్, గలవారు, రైతులును, లోకజ్ఞుల్, గలారాధకుల్
ధీమన్ముఖ్యులు, గోపనాహ్వయునిసందేశానుసారమ్ముగా
నామధ్యాహ్నము దాటి యామసమయం బౌనప్పుడెవ్వార లా
యామాన్యుల్ సనుదెంచి రూర్జిత సమాహ్లాదార్ణవంబోయనన్

మ॥ తగుమర్యాదల భక్తియుక్తిఁ "దహసీల్దారు"న్
మహాభాగు భ
క్తగరిష్ఠుండగు గోపనాహ్వయుని సందర్శించి కేల్మోడ్పు లొ
ప్పఁగఁ బాదమ్ముల సన్నిధింబడి నమోవాకమ్ము లర్పించి యొ
ప్పుగ నవ్వారలఁ బెద్దవారలు జనమ్ముల్ మెచ్చి సేబాసనన్.

కం॥ అంత సమిష్టిగ వందన
మెంతే భక్తిప్రపత్తి నెల్లరుఁ జేయన్
స్వాంతము రంజిల లౌకిక
లంతర్వాణులు వచించి రందరు మెచ్చన్. 863

తే॥ గీ॥ అంతఁ గార్యక్రమమ్ము సుస్వాంతు లాగ
మాంత విద్యావినోదు లౌ యవనిసురుల
వాక్కులన్ విని సభనున్న వారలెల్ల
వార లొప్పిరి భక్తి ప్రపత్తి మెఱయ. 864

తే॥ గీ॥ కరణములు తాటియాకులు ఘంటములును
బూని వ్రాసిన పద్దుల మొత్తమెన్న
వచ్చె నిరువదివేల రూప్యములవరకు
రామచంద్రుని యాలయారంభమునకు. 865

కం॥ అని నొక్కి పలికి యంతనె
కను మోఱగిన విప్రవర్యుఁ గనఁజాలమి నో
యనఘా! విప్రరేవణ్యా!
నను నిటు మోసమ్ముఁజేయ నాయమొ? నీకున్. 856

కం॥ నిను విప్రవరునిఁగామదిఁ
గనియేవియొ మాటలాడఁగడఁగితిఁగానీ
నిను దేవ దేవునిగ నే
గననైతిని తెలుపవైతి కమల దళాక్షా! 857

కం॥ నను నీపద దాసుని నీ
పని నొనరుప తెలిపి తనుచుఁ బ్రమధముఁగొననా?
నినునెఱుఁగు కన్ను వెట్టక
చనితని వేదనముఁగొనన? సారసనయనా! 858

కం॥ రామా! నీదాసుడనై
యేమరితినటంచుఁబేరిమి నీకార్యమునా
పై మోపితి జేయుదు నే
సామాన్యుఁడనయ్యు నీదు సాయముకలిమిన్. 859

కం॥ అని ధృఢసంకల్పుండై
పని మొదలిడు టెటులో యనుచు భావమునందున్
గనికని పరిపరి విధములఁ
గనె నొక్కఁడుపాయ ముదయకాలమ్మునకున్. 860

# ఆలయ నిర్మాణ కార్యక్రమము

గ్రామస్థుల్, గలవారు, రైతులును, లోకజ్ఞుల్, గళారాధకుల్
ధీమన్ముఖ్యులు, గోపనాహ్వయునిసందేశానుసారమ్ముగా
నామధ్యాహ్నము దాటి యామసమయం బౌనప్పుడెవ్వార లా
యామాన్యుల్ సనుదెంచి రూర్జిత సమాహ్లాదార్ణవంబోయనన్

మ॥ తగుమర్యాదల భక్తియుక్తిఁ "దహసీల్దారు"న్
మహాభాగు భ
క్తగరిష్ఠుండగు గోపనాహ్వయుని సందర్శించి కేల్మోడ్పు లొ
ప్పఁగఁ బాదమ్ముల సన్నిధింబడి నమోవాకమ్ము లర్పించి యొ
ప్పఁగ నవ్వారలఁ బెద్దవారలు జనమ్ముల్ మెచ్చి సెబాసనన్.

కం॥ అంత సమిష్టిగ వందన
మెంతే భక్తిప్రపత్తి నెల్లరుఁ జేయన్
స్వాంతము రంజిల లౌకికు
లంతర్వాణులు వచించి రందరు మెచ్చన్. 863

తే। గీ॥ అంతఁగార్యక్రమమ్ము సుస్వాంతు లాగ
మాంత విద్యా వినోదు లా యవనిసురుల
వాక్కులన్ విని సభనున్న వారలెల్ల
వార లొప్పిరి భక్తి ప్రపత్తి మెఱయ. 864

తే॥ గీ॥ కరణములు తాటియాకులు ఘంటములును
బూని వ్రాసిన పద్దుల మొత్త మెన్న
వచ్చె నిరువదివేల రూప్యములవరకు
రామచంద్రుని యాలయారంభమునకు. 865

తే॥ గీ॥ అంత నొకపెద్ద యిటులాడె నెంతయయిన
నీ సభాస్థలి నున్నవారె సమస్త
ధనము లే నున్నవారు ముద మ్మెసంగఁ
క్రమముగను జేయుపనుల యక్కఱకు ననుచు. 866

తే॥ గీ॥ అంత గోపన్న యెలమి సుస్వాంతులార !
రామభక్తి పరాయణులార ! నేటి
తలఁపులును వాక్కులును సత్యధర్మనియతి
నలరవలె కీర్తిచంద్రికల్ వెలయవలెను. 867

తే॥ గీ॥ అన్నిలోకాలు గర్భమం దున్నవాడు
నన్నిలోకమ్ము లందున నలరువాడు
నెల్లలోకమ్ము లెల్లెడ నేలువాఁడు
నఘవిదూరుఁడు రాముఁడు రఘుకులుండు. 868

తే॥ గీ॥ అతని వదనోద్గతం బగు నట్టిమాట
అతని ధనువును విడివడునట్టి బాణ
మతఁడు పరిణయమందిన నుతమతి సతి
సార్థకము లాతఁడుత్తమ క్షత్రియుండు. 869

తే॥ గీ॥ అతనిపని సేఁయజూనియు నతనిదయను
బడసి బంధవిముక్తినిఁ బడయనున్న
మనకు నొండేల నతని సమక్షమందు
నిలువ నాతని గానముల కలిమి వలయు. 870

అనుచు నుపన్యసించియు మహాత్ముఁడు గోపనఁ భక్తశేఖరుం
డినకులవార్ధి శీతకరు నిద్ధచరిత్రుని రామచంద్రునిన్
మనమున నిల్పి ధ్యానము నొనర్చుచు నంతసమాధియుక్తుఁడై
దనరిన నెల్ల సభ్యులును దత్‌స్థితినింగని కేలుమోడ్పులన్

కం॥ మౌనవ్రతులై నిలిచియు
మానసమున రామనామ మహిమము భక్తిన్
గానముఁజేయుచు నెల్లరు
నా నవియెడుధ్యానయోగ మందిరి బళిరే ! 872

శా॥ అంతన్ గోపన రామనామ భజనవ్యాసంగియై జానకీ
కాంతా స్మేరముఖాంబుజ భ్రమర! రాకాచంద్రకీర్త్యంగనా
రంతానంతదిగంతరా ! ఇనకులాలంకార ! శ్రీ మారుతీ
స్వాంతానూన మనస్సువర్ణమణిపీఠా ! రామచంద్రప్రభూ !

## సభాస్తారులతో కలిసి శ్రీరాముని దర్శించుట

మ॥ అని ప్రార్థించుచు నెల్లవారు తనతో నాహ్లాద మేపారఁగాఁ
జనుదేరన్ శ్రితపారిజాతు రఘువంశ క్షీరపాథోధి చం
ద్రుని భద్రాద్రిశిరోనివిష్టు గుణభద్రున్ శిష్టు శ్రీరామచం
ద్రుని దర్శింపఁగ నేఁగి దేవళమునందుం జొచ్చి భక్త్యున్నతిన్

సీ॥ తపుడురొట్టియ నీకుఁదగిన భోజనముగ
నొప్పితో యెన్నాళ్ళనుండి యిచట
తాటిపండ్లే నీకుఁదగు ఫలాహారమం
చుంటివో యేనాటినుండి యిచట

దమ్మకకు యేనాఁడుదంచితభక్తి నీ
యాజ్ఞఁబెట్టినదో యీ యాలయమ్ము
పాడువారిన యింటఁబడియుండ నీకేల ?
నీ యాజ్ఞతోఁ పాటు నీదుపేరిమి

తే॥ గీ॥ నింత రూపయిఁజిల్కుచో నెంతలేసి
పనులు మా కింతలగుగాదె? పద్మసంభ
వాది సురనాథసేవ్య! దేవాదిదేవ!
రఘుకులాంభోధిచంద్ర! శ్రీరామచంద్ర! 875

కం॥ అమ్మా! సీతమ! నీ దయ
నిమ్మహిఁ జేయంగరాని దెదియుం గలదే ?
నెమ్మిం గనుమా! నీ సా
యమ్ముంగొని స్వామి కాలయమ్మునుఁబెట్టన్. 876

బలహీనుండనటం చెటింగియును నాపైఁబెట్టె రాముండు దే
వళముంగట్టెడు కార్యభార మది నీపై మోపుచున్నాఁడ నా
బలమున్ గల్మియు సర్వమీావయని సంభావించి నీ పేరిమిన్
జిలుకన్ నాకు నసాధ్యమెుండు కలదే? శ్రీయాంజనేయప్రభూ!

నినుబోల్ సోదరుఁడుండ వాయుఁజుఁడుమన్నిడుండఁగా భక్తులన్
ననుఁబోల్ నీరసు దేవళంపుకృతి కాజ్ఞాపించె రామప్రభుం
డనఘా! లక్ష్మణ! స్వామికార్య మిది చేయన్ సాయ మర్థింతుఁగా
దనుటల్ మీాకులమం దెఱుంగరుగదా? అర్కాన్వయుల్
క్షత్రియుల్.

మ॥ అనఘా! రాముని యాలయంపుపనికై యత్నించుచున్నాఁడమ
జ్జననీరత్నము సీతమానతియు నిచ్చెంజూపె నాపైనఁ బా
వనియున్ లక్ష్మణుఁడున్ తథాస్తనిరి నీభావం బుదారమ్ము నేఁ
గనఁగా రాదె? ఖగేశ్వరా! యిదె నమస్కారమ్ము మన్నింపవే

మ॥ మరియును దేవళమునఁగల
పరిచారములకును మ్రొక్కి బహుభంగుల శ్రీ
వరునకు శ్రీరామునకుం
గరుణాలయునకును భక్తిఁగై మోడ్పిడియున్. 880

కం॥ తన వెంటవచ్చు పురజను
లను నుద్యోగులనుఁగూడి లక్ష్మికి నినయా
వనితామణి కమలాసతి
యనుసారిణిగాఁగ నింటికరుగం జొచ్చెన్. 881

## సప్తాహము - ఆపద్రక్షణము

మ॥ క్రమముందప్పని వేదపాఠకులు, శాస్త్రజ్ఞుల్, గళాపూర్ణులున్,
రమణీయామలసత్కవిత్వ రచనారమ్యుల్ గవుల్, గాయకుల్
ప్రమదల్, సాధ్వులు, కన్యకల్ దరుణులున్, రంజిల్లు నేతత్సభా
క్రమముంగాంచముదంబురాశియొ యనంగానొప్పెఁగన్పండువై

తే॥ గీ॥ రామపట్టాభిషేక విరాజితమ్ము
అర్చనాపీఠ మెదురుగ నగ్రభాగ
మందు సర్వాధికుఁడు రాముఁడన్న భావ
మంకురింపఁగఁ జేయుచు నలరఁజొచ్చె. 882

చ॥ అనఘుఁడు రామదాసుని మహాత్తరమైన తపఃఫలమ్మొ శ్రీ
ఖనియగు రామచంద్రుఁడు జగన్నుతకీర్తి కృపాఫలమ్మొ యే
దినమునఁ బంక్తిబంక్తికి నదేపనిగా శతముల్ సహస్రముల్,
జనము భుజించుచుండుటయె, చాలదు, లేదను, మాటలేదహో!

కం॥ అన్నఁపురాసులు జూచితె ?
అన్నా ! పులిహోర, కూర, లాపచ్ఛళ్ళె
రెన్నంగలరే ? యా క్షీ
రాన్నంబాపులుసు, పెఱుఁగు నాజ్యఘటంబుల్. 891

తే॥ గీ॥ వైదికాచారసంపత్తి వఱలు ద్విజులు
భుక్తిఁగొను నప్డు వచ్చియు మ్రొక్కి రామ
నామ భజనమ్ముఁ జేయుచు నడచు మధ్య
మధ్య గోవింద ! యనుచును మాఱుపలుక. 892

కం॥ పూజామందిర మందలి
పూజయు ద్విజవరుల పంక్తిభోజనములపై
యోజయుఁ దక్క మఱేదియు
యోజింపడ రామదాసుఁ డొక్కపుడు నహో ! 893

తే॥ గీ॥ ఎంతధనమున్న బంధుగు లెందరున్న
దాసదాసీశతమ్ములు దనరియున్న
నింతఁవైభవ మేర్పడ నింతమహిమ
నిర్వహింపఁగ నెవ్వారేనిం గలారె ? 894

కం॥ ఇది మానవమాత్రునికిం
గుదిరెడు పనికాదు నిజము కోవిదు లలరన్
ముదమందఁజేయనెవ రా
విధికిన్ శక్యంబె? రామవిభు కృపకాకన్. 895

సీ॥ ఇది రామదాసుని మదిలోని సంకల్ప
బలముగా యనుచునుఁ బలుకువారు
కాదురా తొలినుండి కన మొక్కె?యిద్ది రా
మానుగ్రహంబని యనెడివారు
రాముఁడెవ్వనికిచ్చురా తల్లి సీతమ్మ
తలఁపే నిజమ్మని తలచువారు
పతిభక్తి సీతమాసతికెన యీశమ
లాంబ యంచును మది నరయువారు.

తే॥ గీ॥ ఏమహాత్వంబు కానిండు రామదాసు
సిద్ధసంకల్పుఁడని మనశ్శుద్ధిగ మన
మెట్టిఁగి తత్పుణ్యదాంపత్య చరణరజము
తొదలం దాల్చఁ దరియింతు మనెడువారు. 896

కం॥ ఈరీతి నెంచు చెల్లరు
శ్రీరామపదారవింద సేవామగ్నుం
డౌ రామదాసునిన్; మన
సారన్ సప్తాహమహము నరయుచు భక్తిన్. 897

తే। గీ॥ ఎలమిఁ దీర్థప్రసాదమ్ము లిడెడు తరినిఁ
దత్పదాంభోజ రజము లౌదలను దాల్చి
కొనుచుఁ దీర్థప్రసాదముల్ మనము నందు
ధన్యతను గాంచితి మటంచుఁ దలఁచుకొనుచు. 898

అమితానందముతోడ భక్తతతు లేకాకారులై రామ నా
మముఁ గీర్తించుచు నుండ బ్రాహ్మణుల ధీమద్వాదముల్ వేదనా
దము లానాకధునీతరంగముల నీదం జేయ గోపన్న రా
మమయంబీసకల ప్రపంచమని బ్రహ్మానందముం జెందఁగన్

జరుగన్ జొచ్చె మహావిభూతి మెఱయన్ సప్తాహ మేయొక్క రే
నెఱుగంజాలని దేశకాలగతి నెంతేమోద మేపారఁగాఁ
నరిగెం జక్కఁగ నైదురోజు లటుపై నామోదపాథోధియం
దరరే! పుట్టిన దొక్కపెట్టునన వాయ్వావర్త మగ్నిచ్ఛటన్.

## ఆర్తరక్షణము

తే। గీ॥ కొండపయినుండు దేవతాతండములను
నిలకు రప్పించి యాహుతు లిచ్చి నవ్య
గవ్యముల లోకముల మన్చు కారుణికులు
భువన కల్యాణమూర్తులు భూమిసురులు. 901

తే। గీ॥ కబళకబళమ్మునకు భక్తి గదుర మదిని
కెరలి గోవింద నామసంకీర్తనమ్ము
జేయుచును భోజనమ్మునుఁ జేయుచుండ
రామభజనార్థియై యుండ రామదాసు. 902

తే గీ॥ నోములెన్నొ నినోచి ననోచి మదాయె
దైవమని లేక లేక తద్దైవ కృపను
కమలమాసాధ్వి కడుపారఁ గన్న బిడ్డ
ఎలమి మురిపించి మురియు మూఁడేండ్లనిసువు. 903

తే॥ గీ॥ తల్లియొడినుండి యేడకుఁ దరలినాఁడొ!
జనని యెరుఁగదు కానరు జనము లెవరు
తండ్రిపోలిక మూఁడుమూర్తాల ననుచు
రమణు లెలమినిఁ గొను రఘురాముఁ డకట! 904

తే॥ గీ॥ జననియననేల? నెవ్వరు కనిన వినినఁ
గడుపు తరుగుకుపోయెడు బుడుతఁడేమి
యాయనో! యని కమలాంబ అరయుచుండ,
గంజిగుంటను బిడ్డఁడు గానఁబడియె. 905

కం॥ మునుగుచుఁ దేలుచు గుంటం
గనుపడు ముద్దారుపట్టి గైకొని కన్నె
టినిఁదడుపుచు నోర్వెప్పిన
యనఘులు విప్రులు భుజింప రారా! యనితాన్. 906

సీ॥ పోయినబిడ్డకై పొంగిపొరలు దుఃఖ
మాపుకోఁజాలని యబలతనము
నేడ్చిన నవనీసురేంద్రభుక్తి విఘాతు
కాత్త మహాధర్మహాని భయము

నిరువంకలను గ్రుమ్మ చురుతర గర్భశో
కాగ్నికీలల నణగారఁ ద్రొక్క
నణఁగక తనకుఁ దానై రేగి తలఁదాటి
కనుగోళములనుండి కాల్వలగుచుఁ.

తే। గీ॥ వారియేరయిపర్వ మున్నీరుగాఁగ
పొంగి మిన్నంటి దుఃఖతరంగ భంగ
వితతి నుక్కిరిబిక్కిరై వినుత చరిత
మానినీమణి కమలాంబ మ్రానుపడియె. 907

తే। గీ॥ విప్రవర భోజనాంత గోవిందనామ
కీర్తనము శ్రోత్రములఁబడి కేలుమోడ్చి
లిడుచు వచ్చెడు గోపన్న కొడుకు గాంచి
తుళ్లుగుమ్మడికాయటు కూలఁబడియె. 908

కం॥ తనకంటఁబడిన పెనిమిటిఁ
గనునంతన మొక్కవెట్టు కమలాసతి యే
డ్చును మాన్ప నేమితోచక
తనభుజమున వైచికొనియుఁ దనయుని రఘువున్. 909

ఉ॥ రాముదయన్ మదీయము కొలమ్మును నిల్పగఁ
బుట్టియుంటి విం
కేమియు లోటులేదనుచు నిందసుకన్ ముదమందుచుండఁ గ
ట్టా! మము దుఃఖవారినిధి గర్భమునం బడవైచిపోతె? కు
మ్రా! మము మన్చువారెవరురా! ఓరఘు రామ! తెల్పరా!

చ॥ నినుఁగడుసారెఁగాంచి కడునెమ్మిని శ్రేబవలెత్తి పెంచి నీ
కనులను గన్నులుంచి చిరకాలతపఃఫల మీవటంచు నిన్
గని మురుపందు నీజనని కన్నులు కాయలుగాయ నేడ్వ నా
యన! యిటుపోవ నీకుఁదగునా? రఘురామ! వచింపవేమిరా?

అని దురపిల్లుచుండ మహితాత్ములు భూమిసురేంద్రు లంత స
జ్జననుత! రామదాస! ఇది సర్వము రాముని లీలయంచు మా
మనమునఁదోఁచుచుండె ననుమానములే దిఁక లెమ్ము రమ్ము రా
ముఁనిగుడి కారఘూత్తముఁ డమోఘవదాన్యుఁడు బిడ్డనిచ్చెడిన్.

తే॥ గీ॥ ఆడితప్పని మహితాత్ము లగ్రజన్ము
లఖిల కల్యాణమయులు మీరాడుమాట
వేదవాక్యమ్ము ధృవమంచు వెంబడింప
నఖిలజనములు కమలగోపన్న లంత. 913

ఉ॥ చయ్యన లేచి రాముపద సారసముల్ మదియందు నిల్పి యో
యయ్య! భవత్ప్రసాద మహిమాతిశయమ్మున నిల్చె వంగడం
బెయ్యెడ లోటులేదనుచు నేము ముదంబుధి నోలలాడుచో
వ్రయ్యలు జేసితే? హృదయభాండము నీక్రియ రామభూవరా!

మ॥ నిను మది నేను నాసతియు నిక్కఁపుభక్తిని గొల్తుమేని పా
వనతరనామ! నీచరణపంకజముల్ దలఁదాల్తుమేని, మా
మనమునఁ గష్టసౌఖ్యములమాటఁ దలంపక నీదు లీలయే
యని తలపోతుమేని మనసారమముం గృపఁజూడు రాఘవా!

మ॥ అనుచున్ రాముని భక్తరక్షకుని దివ్యద్వైభవో పేతునిన్
గనుకోర్కెన్ గుడికేఁగి గోపన నమస్కారమ్మునుం జేసి యో
యనఘా! యీ పసిబిడ్డ నీదయనుఁ జెన్నారున్ మదీయాన్వయ
మ్మునునిల్పన్ నిజమంచువచ్చితిమిమమ్మున్ బ్రోవవే? రాఘవా!

ఆనాఁడొక్కఁడు విప్రపుంగవుడయోధ్యన్ బాలకుం దెచ్చి స
మ్మానమ్మ్నుం బొనరించి పంపితివి అస్మత్పుత్రునిం దెచ్చి తే
నీనాడిచ్చుటి కోమహాత్మ! నను నక్లే ప్రోతు వీవంచు దే
వా! నన్నున్ మురిపించి పేర్మిలుపుకోమ్మా! రామచంద్రప్రభూ?

శా॥ రామా! వేదవిదుల్ మహీసురులు నీరాజత్కృపావ్యాప్తిమై
నీముందీ పసిబిడ్డ గంతులిడెడిన్ నిక్కంబటంచాడి రీ
భూమిూదేవుల వాక్కువ్యర్థమగుచో భూమిూధరాల్ కృంగవే?
ఆమూలమ్ముగఁ జాపమట్టమయిపోదా? భూమి రామప్రభూ?

మ॥ నను నీభక్తుని పుత్రవంతునిగ సన్మానించి నావంగడ
మ్మును నీవంగడమున్ వెలుంగఁగజగమ్ముల్ వెల్గునందనకుఁ బా
వనమా తావక నామకీర్తన మహత్వత్త్రాత్త భక్తప్రజా
వన సంజాత యశః ప్రభాసురభి ద్యావాభూములం జిమ్మవే?

తే. గీ॥ అనుచుఁ బ్రార్థించు నంత నమ్మా! యటన్న
ముద్దుబిడ్డని మురిపెంపు ముద్దుపలుకు
వీనుదోయికి విందాయెఁబెరిమి కమల
చంకఁగొన మేను బంగారు చాయమెఱసె. 920

కం॥ ఆ రఘురాముని కృపచే
సీ రఘురాముండు మెఱసె నెల్లరుఁ గనుఁడ
య్యా! రండయ్యా! యనియె
వ్వారలు నొండొరులఁబిలిచి వహ్వారె! యనుచున్. 921

కం: భద్రాద్రి రామమహిమం
బద్రిసుతాపతి యెఱుంగు నగజ యెఱుంగున్
భద్రుం డెఱుఁగును మన యీ
భద్రాచలరామదాసవర్యుం డెఱుఁగున్. 922

కం॥ మనపుణ్యము ఫలియించెను
మనజన్మము ధన్యమయ్యె మన మీ భద్రా
ద్రిని రాముని మహిమమ్మును
గనినార మటంచు జనము కదలఁగఁజొచ్చెన్. 923

తే. గీ॥ ముద్దుపాపని రఘురాము ముద్దుగొనుచుఁ
జంక నిడుకొని కమలాంబ సమ్మదమున
వెంటరా రామదాసుఁడు వేడ్కమీరఁ
దిరిగి యింటికి వచ్చెడి తీరుఁగనిన. 924

తే. గీ। మోడువారిన కల్పకభూమిరుహము
మరియు మోసెత్తి సుమ, ఫల భరిత మయిన
కరణికను పండువై నేడు గానవచ్చె
ననుకొనుచు కొంద రుత్సాహ మునను గనిరి. 925

అల చింతామణి, కామధేనువులు, కల్పాగమ్మనున్, మున్నుగా
గల వెవ్వారల కోర్కెదీర్చునని పల్కన్ విందు మా నాటిగా
థల నీనాఁడిట రామదాస వరపుత్రప్రాప్తి ప్రత్యక్షపుం
ఫలముం గాదొకో? యంచు రామపదసేవన్ మగ్నులై రెల్లరున్

సీ॥ కొల్వఁగావలెఁగాని కొలిచిన ఫలమందు
కొనకుందురే? యని యనెడి వారు
కొలిచిన ఫలమందుకొనుట తథ్యంబైన
నది పట్టుబడుట లెట్ల నెడి వారు
అగ్నిపరీక్షరా! ఆరాము పదసేవ
యనిన సామాన్యమా? యనెడి వారు
పెద్దల సుద్దులఁబెడబుద్ధి లేకున్న
నదియు సామాన్యమే యనెడి వారు
తే. గీ॥ రామభక్తులఁగొల్చిన రాముని కృప
నంద నేర్తుముగా! యని యంద రొక్క
మొగిని శ్రీరామదాసాంఘ్రి మూలమునకు
వంగి వందనముల్ జేయు వార లైరి. 927

తే. గీ॥ అంత నిర్విఘ్నముగను సప్తాహమహము
వేదవిహితమ్ముగా నెరనేరె నిఖిల
భూమిజనములు భూసురుల్ ముదము పడ మ
హేంద్రవైభవముగ రామచంద్రు కృపను. 928

## విప్ర ప్రబోధము

మ॥ ఒకతరి రామదాసు తనయుండు నిజాంకమునందు నుండ నో
పికమెయి సాథ్వి వీవసలు వేయుచు రాముని పాదసన్నిధిన్
బ్రకటిత భక్తియుక్తి నెడబాయక పాడుచునుండ భక్తపా
ళికి వినవింపు నింప నుతకీర్తి ద్విజోత్తముఁ డొక్కఁడిట్లనెన్.

ఉ॥ మీరిడు కేలుమోడ్పులకు మీ వినయాది గుణప్రపత్తికిన్
మీరొనరించు పూజలకు మేము ముదంపడుచుంటిమైన సం
సార మహార్ణవోత్తరణ సాధనరాజ మనంత కీర్తి వి
స్తారము రామునాలయ ప్రశంసము నెత్తరిదేటి భక్తియో!
అని యనిపించుచున్నయది యాపని సేయఁగఁ జూనరయ్య! యే
పని నొనరింపఁజూనిన నపారధనమ్ము వ్యయమ్ము సత్యమై
నను మది సందియమ్మునుఁగొనం బనిలే దొనరింపఁజూనుచో
బనిఁగొని యాకృపానిధియె ప్రాపగు నానుడి నిక్కమయ్యెడిన్.

అనివచియించు బ్రాహ్మణునియంఘ్రియుగమ్మునుఁబట్టి ప్రమొక్కి పా
వనతరమైన నీదుపదపంకజ మాదలఁదాల్చి తెల్పు దో
జననుత! వేదవిప్రుల వచస్సులు సత్యము! లీరు తెల్పిన
ట్లనుపమభక్తి నావిభుని యానతి యియ్యది యంచుఁజేసెదన్

కం॥ అని ప్రమొక్కె రామదా సం
తనె రఘురాముంను ప్రమొక్కెఁ దద్దయుఁ గమలా
వనజాస్యయు ప్రమొక్కెడియెన్
జనె దీవనలిచ్చి పెరిమిఁ జయ్యన ద్విజుఁడుఁన్. 933

## పరితాపము

ఆ॥ వె॥ అంతభజనపాళి యాశ్చర్యమగ్నమై
అనఘ! రామదాస! ఆమహాత్మ,
డెవఁడో వానిపల్కులెల్లను వింటిమి
వానిరూపు కంటఁబడకపోయె. 934

కం॥ అని విలపించుచు గురువర!
కనుగొని ముదమంద నీదు కరుణాదృష్టిం
గనవే? మమ్ముల నని వా
రనుచో శ్రీరామదాసుఁ డార్తుం డగుచున్. 935

తే॥ గీ॥ మున్నొకప్పుడు తెలిపియుఁ జన్న విప్ర
వర్యుఁడే యిప్పుడుం దెల్ప వచ్చెననుచుఁ
దలఁచితిని గాని నాస్వామి దయను నన్నుఁ
దనుపవచ్చె నటంచునుఁ దలఁపనైతి. 936

చ॥ అనుచును రామచంద్రునిపదాంబుజ యుగ్మము మాళిదాల్పనై
తిని ననుఁబోలుమందు నతిదీనుని భాగ్యవిహీను నెందునేఁ
గనుఁగొన నేర్తుమే? యనుచుఁ గన్నుల నీరము కుండపోతగా
బనిగొని రామదాసు రఘువంశశశిన్ గనలేమి నేడ్చుచున్.

మ॥ నిను నేనెప్పుడు చక్రవర్తిగ జగన్నేతగా నెంతు నా
మనమన్యమ్మున నిన్నుఁగాంచు టెటుసంప్రాప్తించు నేవస్తువున్
గనినన్ నీదుస్వరూపమే యనుచు వక్కాణించు శాస్త్రమ్ములై
నను నోదేవ! భవత్కృపామృత దృగంతంబంద కెట్లబ్బెడున్.

కం॥ చదివితి నెన్నేనియు నా
చదువులు నిన్ దెలియఁజేయఁ జాలక యుండెన్
ముదమునగన నిను దంతివ
రద! దాశరథీ! వచింప రారా! పెరిమిన్. 939

కం॥ అని ప్రార్థించియు నెఱిఁగిన
పని మొదలిడ నాలసింపఁ బనిలేదని యా
య్యాన దెలుపం దగువారల
కునుఁ దెలుపఁగఁజేసి తెలిపెఁ గోవిద తతికిన్. 940

---

## ఆలయ నిర్మాణోపక్రమణము

మ॥ కరణాలెల్లరు భక్తియుక్తిని నమస్కార ప్రపూర్వమ్ముగా
మఱియున్బల్లెలు కోయగూడెములు, గ్రామాల్,
వడ్డెఁగూడెమ్ములున్
దిరుగం దజ్జను లిచ్చు విత్తమును బ్రీతిం దెచ్చి యర్పించి రె
వ్వారు శ్రీరాము ననుగ్రహమ్మెడద సమ్భావించి నిష్కాములై.

చ॥ ఇదివరకే లభించినవి యిర్వదివే లిఁకఁగూడ నేఁడు ము
ప్పదియగు వీనితోడ నొకపాటిగఁ గార్య ముపక్రమించి స
మ్మదమునఁదొల్త ప్రాతగుడి పూర్తిగఁదీసియునూత్న
కార్యముల్
మొదలిడి సేయ నా ప్రభువె పూర్తినొనర్ప ననుగ్రహించెడిన్

మ॥ అని యారాముని భక్తమానస జలేజాస్థాన ధాముస్ జగ
జ్జన కల్యాణ గుణాభిరాముని మనస్స్వర్ణ మాణిక్యపీ
ఠిని సీ తానిలపుత్ర లక్ష్మణుల తోనంతే భక్తిమైనిల్పి స
జ్జనవంద్యా! భవదాలయమ్మునిడ నిచ్చన్ జొన్పనిన్ గొల్చెదన్.

ధనహీనునన్ నను దేవళమ్మునిడఁ బ్రోత్సాహమ్మునుంజేయు నీ
మన మేమో యొకయింతెరుంగను మహాత్మా! ఐననీయాజ్ఞ పా
వనమా నీపదనీరజద్వితయ సేవావిత్త సంపత్తియే
ధనమంచుం దలఁదాల్చి తీకృతికి సీతారామచంద్రప్రభూ! 944

చ॥ కలికాలంబిది, లోభపూరితమతుల్ నిష్కారుణ్య చిత్తమ్ము దు
ష్కలుషాలాప వినోద సంభరిత మీకాలంపు వాగ్దానఁపుం
గలిమిన్ బల్మిగ నెంచి సత్కృతుల నీగంజూచు నాయత్నమున్
దలఁపన్ బావక కుండముం బడుటగాదా? రామచంద్రప్రభూ!

కం॥ తలదాటిన పనిభారము
తలపై నిడినావు మోయ దక్షుఁడనని నా
తలఁపేదియైన నీదే
తలఁపన్ నెరవేర్పఁజూతు తథ్యము రామా! 946

చ॥ నాయత్నమ్ముల మంచిచెడ్డలకు నేనా! బాధ్యుఁడన్ గాను గా
నీ యెవ్వారలు నమ్మబోరుసుమి! నాయీవాక్కు నద్దానబా
గో యోగో యెదియో జనించెడిని తద్యోగంబ దేదైన నే
మోయంజాలను తద్భరమ్ము సకలమ్మున్ నీదె సుమ్మాప్రభూ!

ఉ॥ కీరితివచ్చుగాక యపకీర్తియె గల్గెడుగాక భోగముల్
గూరెడుగాక కష్టములకుం గురియయ్యెడుగాక సర్వమున్
భారము నీదెయంచును భవత్కృతి సేతకుఁ బూనినాడ నన్
క్షీరమునందుముంచెదవొ నీరమునందునొ జానకీపతీ! 948

శా॥ బాల్యంబందుననే భవచ్చరణ సేవాభాగ్య సంభావనా
కౌల్యంబబ్బెఁ దదాది సర్వము భవల్లక్ష్యమ్ములై సాగ నీ
కల్యబ్దమ్ములఁ బ్రోవ దిక్కెవరు నీకన్నన్? గనన్ నీదు వా
త్సల్యంబే ఘనపారితోషికము గాదా? రామచంద్రప్రభూ!

మ॥ నను నీపాదసరోజసేవకును నానందాబ్ధి వీచీ నిమ
జ్జన భాగ్యోదయుఁగాఁ బొనర్చియు భవత్స్వామిత్వమున్ నిల్పుకొ
మ్మనయమ్మున్ భవదాకృతిం గనెడుభాగ్యమ్ముం బ్రసాదించి యో
యనఘా! భాస్కరవంశ వారినిధిసోమా! రామచంద్రప్రభూ!

కం॥ నీచేయూతను జేసెద
నాచంద్రార్కమ్ము వెలయు నాయా కృతులన్
నీచనవున సురవర! నీ
రాచరికపువాడ నగుట రాఘవరామా! 951

తే. గీ॥ అనుచు దమ్మక్కనాటి యా యాలయమ్ము
విప్పి క్రొత్తపునాదులు వెలయఁ జేసి
పై పనుల్ జేయ విత్తసంపత్తి లేమి
నకట! వాగ్దానములు రిత్తలగుట లెటిఁగి. 952

చింతాక్రాంత మనోవికారుఁడగుచున్ శ్రీరాము గీర్తించుచున్
స్వాంతంబందున; నెత్తిమొత్తుకొనుచో స్వామీ! యెటుల్ సేతునా
సొంతం బింతయు లేదయిత్తుమను బచ్చ్బల్ బొచ్చెలైనారు నా
యంతన్ నేనెటు సేతుఁ దెల్పఁగదవయ్యా. రామచంద్రప్రభూ!

చ॥ క్రమముగ నిత్తుమంచును విరాళము లిచ్చెడు వేళఁ దెల్పి రా
క్రమమును దప్పి రిప్పు డెటు కావలెనో తెలియంగ రాద వ్య
త్క్రమణపుచావుగాదొకో? బలాత్కృతి సేత యొకప్పుడేని దు
ర్భ్రమలకుచోటొసంగక పరాత్పర! ప్రోవర! రామచంద్రుఁడా!

అని మొఱవెట్టు దాసునకు నారఘుపుంగవుఁ డేదియో యొకం
డను పమమై తనర్చు సలహా యిడినట్టులఁ దోచె నా
వినికియు రూపు నొక్కపుడు విన్చిన విప్రుని వౌ ఔరింగి శ్రీ
ఖనియగు రాము సేత ఇదెగా! యని వెంబడి రామదాసుఁడున్.

మ॥ తలపం దీన నెదే జనించెడి నగాధంబైన దొక్కండు గా
థను నట్టుల్ గనుపట్టుచున్న దెది యేమా గాక శ్రీరామచం
ద్రుని యాజ్ఞన్ జవదాటకుండుటయె యెందున్ నాకుఁ గర్తవ్యమం
చని రామాలయ కార్యరంగమునయం దారూఢ చేతస్కుఁడై.

ద్రుతగతిఁ గార్యరంగమున దూకియుఁ బైపడు కష్టసౌఖ్యముల్
మతిఁ గనఁ బోక శ్రీరఘుకులప్రభుఁడై హరి జానకీసతీ
పతి పదనీరజమ్ము లెడ బాయనిభక్తి నెదం గదించి శ్రీ
పతి! నన్నుఁ బ్రోవవే యనుచుఁ బ్రార్థన జేయుచు రామదాసుఁడున్

మ॥ కనుపింపై కనుపట్టు నాలయముఁ బ్రాకారమ్ములున్ గోపుర
మ్మనుకల్యాణఁపుమండపమ్మునుధ్వజమ్మున్ గూటమున్ మేలువా
హానముల్ వాహనశాలలున్ రథములాయా దేవళమ్ముల్ మఠ
మ్మును బాగాముఖమండపమ్ము శిఖరమ్మున్ భర్మరత్నమ్ముగాన్.

తే. గీ॥ అర్చనాదులకగు పాత్రలమల భర్మ
రత్నమయములు రాజత రాజితమ్ము
లుత్సవఁపు విగ్రహములు నేత్రోత్సవమ్ముఁ
జేయు సౌవర్ణమయమ్ములై సెలఁగ నెఱపె. 959

కం॥ మూలవిరాట్టులు వెనుకటి
యాలయమున వెలయునవియ యాదట నీనూ
త్నాలయమందున నిలిపెను
శ్రీలం దైవార బుధులు సెబాసనఁగన్. 960

ప్రమదంబొప్పఁగ రామదాసుకవి సమ్రాట్ దైవసమ్రాణీయో
గమునన్ దాశరథి ప్రతిష్ఠ నిగమాఖ్యానమ్ము శ్రీవైష్ణవా
గమమై యొప్పఁగ జేసె నెల్ల బుధలోకస్తుత్యమై బ్రహ్మలో
కము పర్యంతము కీర్తిచంద్రికలు వెల్గం జంద్రతారార్కముగన్

సీ॥ అనుదినమ్మును వైష్ణవాగమక్రమమున
నర్చన సేవల నలర జేసి
ఆగమనిష్ణాతలగు వైష్ణవుల కిండ్లు
వాకిం ట్లోసంగియు వరలఁజేసి

అనువత్సరమును కల్యాణోత్సవమ్మును
బ్రహ్మోత్సవాదులు బ్రబలఁజేసి
కనులు వైకుంఠమ్ముగాదే? యీ భద్రాద్రి
యని యెల్లరును ముదమందఁజేసి.

తే. గీ॥ అనుదినమ్మును రామాయణ పురాణ
రామ భజనోత్సుకతయుఁదీర్థ ప్రసాద
ములను వెలయంగఁజేసిన పుణ్యమూర్తి
రామసేవన ధనరాశి రామదాసు. 962

కం॥ అటు రాజకార్య పరుఁడై
యిటు సీతారామ సేవ నేచ్ఛారతుఁడై
తటమధ్యం బ్రవహించెడు
తటిని యటుల్ వరలు రామదాసుఁడు బళి రే?

కం॥ అని యెల్లరు వినుతింపఁగ
మనమున శ్రీరామనామ మనన్యాదుల స
జ్జన సాంగత్య విభూతిని
దనరుచు నొకనాఁడు రామదాసుఁడు మదిలోన్. 964

కం॥ ఏను ప్రభుత్వపుం ధనము నెంతవ్యయుం బొనరించినాడనో
కానకపోతి నేల్బడి నికారమొనర్చిన యట్లు లౌకిక
జ్ఞానము నొక్కిపక్కడిని కావుననేడె గ్రహింపనెంతు నం
చూని "ఖజాన" లెక్కఁగనియూపిరియాడక రామదాసుదాన్

తే. గీ॥ కొయ్యవారియు నెట్టులో కొంతవడికిఁ
తెలివిఁగొనిసర్వమునకు నా దేవదేవు
డినకులేంద్రుఁడె దిక్కు నేనేడ నారు
లక్షల ధనము దేడఁ దలంపఁదీర్చ. 966

తే. గీ॥ అనుచు వాపోయి దేవదేవా! సమస్త
జగదధీశ్వర! శ్రీరామచంద్ర! రఘుకు
లేంద్ర! నాచేయి దాటిపోయినది గార
వమ్ముఁ గాపాడుకొనఁ జూడరమ్మ! రామ! 967

కం॥ తానీషా యేమనునో
యేనెటు జమకట్టవలెనో యీవిత్తంబో
జానకినాథా! యింతేఁ
గానంబడకుండె నెటులఁ గాతువో! రామా! 93

చ॥ అనుచు సమస్త భారమును నారఘురాముని మీఁదఁబెట్టి చి
త్క్షనియగు రామదాసు జనకప్రభు వట్టుల రాజకార్యముల్
గొనకొని పూని చేయుచును కోవిదముఖ్యవచఃప్రసూనమా
ధ్వనిచెవులారఁగొంచును సుధీనుతు నారఘురాముఁగొల్చుచున్

కం॥ దినదినమును రామాయణ
మును పారాయణముఁజేయ పూనికఁ గలఁడై
మనమలరన్ హరికథలం
దనరెడు సుజ్ఞాని రామదాసుం డొకటన్. 970

శా॥ గ్రామస్థుల్ నిజభక్తవర్గములు దూరగ్రామవాసుల్ సుధీ
గ్రామమ్ముల్ నిజదారపుత్రులును శ్రీరమ్యల్ మహాసాధ్వులున్
శ్రీమంతుల్ దనుచుట్టువారుకొను నా శ్రీరామ దాసాహ్వయ
శ్రీమించెన్ సురధారుణీధరము ధాత్రిన్ వెల్గ నే తెంచెనాన్. 971

సీ॥ కదలివచ్చెడు కనత్కనక నీరేజ వి
స్ఫారమానస సరోవర మనంగ
నడచివచ్చెడు లసన్నాక భాగ్యాన్విత
నందనోద్యాన వనంబనంగ
తరలివచ్చెడు జగత్సంసృష్టి వైభవా
లోకాంచితము బ్రహ్మలోక మనఁగ
కనులు గాయలుగాచి కనరాని హరిగను
కోర్కెమైవచ్చు వైకుంఠ మనఁగఁ

తే. గీ॥ దనరి చూపరు లానంద వనధిఁ గ్రుంకి
భక్తిఁ గేల్మోడ్పుఁ దనతోడి ప్రజలఁగూడి
జానకీపతి దర్శించు మానసమున
రాము నాలయమున కేఁగి రామదాసు. 972

కం॥ దరిశించి రామచంద్రుని
పరిపరివిధములను మదిఁ బ్రార్థించియుఁ దాఁ
బరివారమ్ముల తోడుత
మురియుచునుం గొనె ప్రసాదమునుఁ గడుబత్తిన్. 973

## రామాయణ పురాణము

వ॥ అంతరామాలయమ్మునుండి తిరిగి వచ్చు తరిదనకుం బొడకట్టు దుర్నిమిత్తమ్ములకు శంకంగొనియు సర్వమ్మునకు నారఘుకులార్ణవ చంద్రుండు శ్రీరామ చంద్రుండె రక్షకుండని దృఢనిశ్చయుండై బాలభాను ప్రభావిభాసిత వికసితారవింద మ్మగు సరోవరము చందమ్మున శ్రీమద్రామాయణకథా పురాణశ్రవణోత్సుక భక్తజన సురుచిర స్మితవదనారవిందమ్మగు సభాస్థానమ్మున కరుదెంచి రామదాసు గురుదైవత సభా ప్రార్థనమ్ములం గొంతతడవుండి యేకముఖమ్ముగ సభాజనమ్ము రామనామ సంకీర్తనమ్మొనర్ప.

ఉ॥ అత్తరి రామనామ మహిమాతిశయమ్మునుఁ దెల్పుఁబూనె శ్రే
కెత్తిన భక్తి యుక్తి మెయినెంత యుమేదుక విన్చు లోకమున్
బొత్తిగ గుర్తెఱుంగని ప్రమోద సుధాంబుధి గ్రుంకు వెట్టి బల్
చిత్తరువట్లు దోచఁగ నశేష సభాస్థలి కేలుమోడ్పుతోన్.

ఉ॥ అయ్యెడ క్షీరసాగరమునందున ఘోరవిషాగ్ని పుట్టిన
ట్లయ్యయొ రామనామ చరితామృత వార్నిధి సేదులాడు నే
యయ్యకు నమ్మకెందు హృదయార్ణవ బాడబమై జనించె నే
రయ్యది యియ్యదంచు నొకరైన వచింపఁగరాని బాధయై.

## నిగళ బంధము

క॥ అత్తరి తానీషాభటు
లుత్తర మీయంగఁ జూచి యూపిరి రాకే
యుత్తర మీయఁగ నంత ని
రుత్తరుఁడై రామదాసుఁ డూర్జితమతియై. 977

కనుగొంటే? రఘురామ! యీచరిత్ర లోకంబెల్లఁ గన్గోయిఁగా
గను నీవేటికిఁ జూడకుండెదవు? నాకష్టంబు గట్టెక్క చ
ల్లని నీచూపులు నాపయింగురిసి యాహ్లాదామృతాంభోనిధిన్
మునుకల్ వేయఁగఁ జేయవే? నినుజగమ్ముల్ మెచ్చ సీతాపతీ!

ఉ॥ నన్ను నిజాము నేలు నరనాథుని వానిగఁజూతు రన్యులీ
వెన్నఁగ నట్లుచూడఁదగునే? భవదంఘ్రిసరోజ సేవయే
అన్నము, వస్త్రమంచు, సకలార్థము నీదయ యంచు నీపయిం
గన్నిడి యున్న వాని నొరుఁ గాననివానిని జానకీపతీ! 973

ఉ॥ కన్నకుమారు ప్రాణమునుఁ గాచితి నాయిలు నిల్వఁబెట్టితో
యన్న యిదేటిలెక్క? భవదాదరపాత్రునిఁ జేయుమన్న! రా
మన్న! దయామృతాబ్ధివి గదన్న! కృపారసదృష్టివృష్టి భా
గ్యోన్నతిఁగావు మన్న! అభయోన్నతి నేమన జానకీపతీ!

ఉ॥ ఏను నిజాము నేలెడు నరేంద్రుని వాడనె యైనఁ జెల్లుగ
వ్వేనియుఁదీసియీయఁగలనే? భవదాలయ నిర్మితి కన్న! యే
గానియుఁగాని, కానియటు కన్ననుఁ గానక యారులక్షలె
వ్వాని ధనమ్ముఁగాఁ గనుచు వాడితినే భవదాజ్ఞ రాఘవా! 981

శా॥ నాకున్ నేనయి చేయనైతి భవదాజ్ఞన్ పీడలేనైతి, నా
యీకర్మంబెటులున్నదో యెఱుఁగనైతిం తేని నేనాటికీ
బాకీ తీర్చక తప్ప దెట్లయినఁదద్భారమ్ము నీదే యగుం
గా కెన్నాళులు మోయవత్తు రకలంకా! తెల్పుమీ! రాఘవా!

మ॥ అయముల్ గూర్చెడు వేల్పవంచుభవదీయాంఘ్రిద్వయం బెల్లెడన్
నయమొప్పన్ భజియించుచుంటిని గదన్నా!సంకెలుల్ వేయఁగా
భయదూరుల్ గరయుగ్మ మీయమన నీయం గాదనన్ జెల్లునే?
దయరాదా? కనుచుండియున్ మనుప సీతారామచంద్రప్రభూ!

మ॥ ఎవరయ్యా! యిఁక నాకు దిక్కెచట లేనేలేరు నిక్కమ్ము సుం
దవసీనాథున కీయఁగాఁదగిన యా యార్లక్షలీజానకీ
ధవుఁడే యీయఁగఁ జెల్లు నిక్కమది తద్ద్రవ్యమ్ము నీయంగ నే
స్తైవఁడో పున్ నను నీయమంచ నిన నేదేమున్న దే?యీయఁగన్

మ॥ అనుచుం బాదయుగమ్ముఁ బడిన భార్యాపుత్రులం బేర్మిమై
గని మీ శ్రేష్ఠకుఁ డిద్దియుం దలఁప నీకాముత్సవం శాఖిచం
ద్రమసి గారాబఁపు చూపులందొకఁడుగాఁ దోమన్ భవన్మాన స
మ్మునవెక్కుండఁగుభక్తిఁ గొల్వఁడు శుభమ్ముల్ గూర్చు నీ రాముఁడే.

మ॥ తలఁపం బ్రాకృతకర్మసంచయ నిబద్ధంబైన యీ దేహి త
త్ఫలభారం బదియెట్టిదైన ననుభోక్తవ్యంబ యద్దానికిన్
విలపింపం బనిలేదు సర్వసముఁ డావిశ్వేశ్వరుండైన శ్రీ
కలితుం డద్ది యథార్థ కాలమునఁ జక్కం జేసెడిన్ సర్వమున్.

శా॥ అయ్యో! నాయన! యెందుకేడ్తు? రఘురామా!
యెత్తి లాలింపలే
వయ్యా! చేతులు, కాళ్లనుం గదలలేవా? నేనుమీయయ్య లే
డయ్యా! ఉండియునంచు నశ్రువులుకుల్యల్ గాఁగ మాబాబు!రా
వయ్యా!యంచెటో యెత్తి ముద్దుఁగొనినాన్నా!యేడ్వకేవచ్చెదన్

కం॥ తానీపా పుణ్యాత్ముఁడు
మీనాయనఁగనిన విడుచు మేదురఁపు కృపన్
మానాయన! నే వచ్చెద
నేనాటికి నయిన రాముఁ డేలున్ మనలన్. 988

తే. గీ॥ అమ్మయును నాన్నయును నీకు నమ్మయె సుమి!
అయ్యవచ్చెడు నందాక నా పెమాట
కెదురు సెప్పక రేబవ లెదఁగదించి
రాము భజియింపుమా! రఘురామ! భక్తి. 989

మ॥ మన కేనాఁడును రక్షకుండు మన రామస్వామియేసుమ్ము పా
వనచారిత్రవు నీవు నిజనువు సౌభాగ్యమ్మునం దూఁగు వ
చ్చిన రాకుండిన నేను వెంబడిగ శ్రీ శ్రీరామచంద్రాంఘ్రి పూ
జన సేవా, భజనల్, యథాతథముగా సాగింప యత్నింపుమా!

అని యర్ధాంగికిఁ జెల్పియుం గమల కాయిాభక్తులంగాంచి యో
జనులారా! సుగుణాఢ్యులార! వినుఁడస్మద్వాక్కు లీసంకెళుల్
మన కీనాడో మరొక్కనాడో విడు లో లక్షింప నేనాటికిన్
మనలన్ వీడని సంకెళుల్ విడెను రామస్వామి నర్చించుచోన్.

తే. గీ॥ ఈపె మీ సోదరీమణి యితఁడు మీకు
మేనయల్లుఁడు మీపయి నేనొకప్డు
పెట్టఁదలఁపని బాధ్యత పెట్టె నిపుడు
రామచంద్రుఁడు మన రఘురాముఁ డకట ! 992

సీ॥ అని యిట్లు తెల్పిన విని రామదాసునిఁ
గన్నీరు మున్నీరుగాఁ గనుఁగొని
మాయొనర్చిన పాపమా ? యిది కాకున్న
నీస్థితి మాకన్ను లేలగాంచు
కనుఁగొంటిమే యమ్మ కన్నంత ఋణ మీఁగ
నెల్లరముం గూడి యెంచరాదె ?
యెంచితిమే యను మీఋణమ్మనుఁదీర్చఁ
జాలని దారిద్ర్య మేలఁగలుగు

తే. గీ॥ ఎన్నివిధములఁ గనుఁగొని యున్నఁ గేవ
లమ్ము నిర్భాగ్యులమన నిజమ్ము సుమ్మ
కానిచో గురువర! యిటు కన్నులార
కాంచుచును నూరుకొనియెడు కర్మమేల ? 993

తే. గీ॥ అనుచు విలపించి గురుచరణాబ్జ యుగముఁ
బట్టి ప్రణుతించి యెల్లరు పాదపద్మ
రజము నౌదలఁదాలిచి రామచంద్ర
మూర్తి కృప వచ్చు మద్గురుమూర్తి యెలమి. 994

వ॥ అనుచునెల్లరు కేలుమోడ్పులిడ కమలాంబాసతి ముమ్మారు పతికి ప్రదక్షిణ మొనర్చి సాష్టాంగ ప్రణామమ్ము లొనర్చి యిట్లను. 995

ఉ॥ ఏము ప్రభుత్వపుం ధనము నేరెుకకానియు ప్రింగ మేని మ త్స్వామి యథార్థభక్తిమెయి దాశరథిన్ భజియించునేని మ త్కామితదేవతాప్రభునిగా మది మత్పతిఁగొల్తునేని శ్రీ రాముఁడె అప్పుదీర్చి బళిరా! యన నీ నెలలోనె ప్రోచెడిన్. 996

వ॥ అని కమలాంబా మహాసాధ్వీరత్నము ప్రతిన యొనర్చు నంతకు దేవాలయపుగంట తనంతదాను ముమ్మారు మ్రోగుటయు యావత్ప్రజానీకము నీమాట తప్పదు తల్లి! నీవు మహాపతివ్రతవు నీమాట యేల తప్పెడు మద్గురు వరేణ్యులు యథార్థ సద్భక్త శిరోమణి యనుట తథ్యము మీరు సహజౌదార్యసంపన్నులరు వదాన్య శేఖరులరు ప్రభుత్వ ధనము మీరేల ముట్టెదరు ? ఆమాటయు నిజంబ. శ్రీరామ చంద్రమూర్తి ఆపద్రక్షకుఁడు, భక్తకల్పద్రుమము అను నదియు ధ్రువము ధ్రువము, ధ్రువము, అని తెల్పుటకేగద గంటముమ్మారులు మ్రోగినది. కావున ననతికాలమ్ములనే తానీషాప్రభువు వలన బహుసన్మానితుఁడై రామదాసు భక్త శిఖామణి, మద్గురువరేణ్యుఁడు వచ్చి యానందింపఁ జేయఁ గలఁడని నమ్ముచున్నాము తల్లి! అని పల్కిరి. మరియు, కమలాంబ తమ ముద్దుబిడ్డఁడు రఘురామునిచే భర్తకు

నమస్కరింపఁజేసి తానును దండవత్ప్రణుతులొనర్చి. భర్తృ పాదజలేజమ్ములు కన్నుల నద్దికొని తత్పదరజములు శిరోధార్యమ్ము లని తలఁదాల్చి శ్రీ సీతారామచంద్రమూర్తికి కేలుమోడ్చి ప్రార్థించి, దుఃఖాశ్రువులు, నదీ ప్రవాహములుగాఁ దోయిలొగ్గి నిలువంబడునంత, తన్నదీ ప్రవాహమ్ము నంబడి చనునావయొనా రాజభటగృహీంతుడై రామదాసు తానీషా ప్రభు దర్శనమునకునై గోల్కొండపురి కేఁగఁజొచ్చె నయ్యెడఁ బురమధ్య బాడమి నల్దిక్కుల వ్యాపించిన జ్వలితాగ్ని జ్వాలా కీలల తాళం జాలక నొక్కుమ్మడి బయటపడు ప్రజానీకమ్ము చందమ్మున నెల్ల ప్రజలు గౌతమీనదీ తటమ్మునకుఁ జేరి నది దాట నావ నవరోహించిన రామదాసు మొగంబు దిక్కై క ప్రణామించి విచార సాగరమగ్నులై కనుమేర చూపునఁ గాంచుచు మరలి రాజాలక, మైమఱచి ఖండిత కదళీకాండమ్ము చందమ్మున, భూమింబడిన కమలాంబ నెట్టులో లేవనెత్తి వెంటంగొని కమలాంబా రఘురామ కుమారుల నిజగృహమ్మునఁ బ్రవేశపెట్టి, యందు కొందరి సన్నిహిత భక్తతతుల, సాహాయ్యంబుగనునిచి, తక్క ప్రజానీకము, వారి వారి గృహమ్ముల కరుగఁజాలిరి. అంత బహుశ్రమ భరితమ్మగు మధ్యేమార్గమ్మును, క్రమక్రమమ్ముగ గమించి, కతిపయ దినమ్ములకు రాజభటులు, రామదాసుం, గోల్కొండపురికిం జేర్చి, రాజసమక్షమున, నిల్పిరి. యంత రామదాసు వినయ

విధేయతలు మెఱయఁ గేల్మోడ్చి నమస్కరించి, యనవత వదనుండై నిలువంబడిన, రామదాసుం గాంచి తానీషా ప్రభువిట్లను.

---

## కఠిన కారాగార శిక్ష

ఉ॥ అచ్చుగ మాకిడందగిన యంత్రధనమ్మును నారులక్షలం
దెచ్చితె? గోపనా! యనిన దేవ! యొకానొకయింత యేనియున్
దెచ్చెడిశక్తి చాలమినిఁదే కయవచ్చితి మీదుముంగటన్
హెచ్చిన మీదుపేర్మిఁగాని యేఁగమదిం దలపోసిభక్తిమై.

ఉ॥ కట్టితిరామునాజ్ఞ గుడి, కాదగువాహనవస్తుసంతతుల్
బెట్టితిరాజగౌరవము వెల్తి పడన్ మనసొప్పకుంట మి
న్ముట్ట భవత్ప్రతిష్ఠజగముల్ బళి రే! యన, రాముపాదముల్
బట్టితి నేడు నీయెదుటఁ బాయకనిల్చితిఁ గట్టుగుడ్డలన్. 999

కం॥ నీవిడు వేతనమున నా
జీవన మొకభంగి నడువఁ జిత్తమునందున్
జావున్ బుట్టువునందని
త్రోవంగాని పోవుదారకు దోయిలియిడుదున్. 1000

కం॥ నే నేమి చేయుచుండిన
గానీ శ్రీరాము నాజ్ఞగాఁ దలపోతున్
గానీ యన్య మెఱుంగను
నానుడి సత్యంబటంచు నన్నఁ బ్రోవఁగదే ? 1001

కం॥ అని విన్నవించు గోపన
మనముం గనఁబోక రాజు మరి యుగ్రుండై
ధనమీక విడువ నెప్పటి
కని నిన్నన రామదాసు కేల్మోడ్చిడితాన్. 1002

కం॥ నామాట విశ్వసింపుము!
భూమీవర! బిచ్చగాని పోలికనుంటిన్
నా మనసు వాక్కు కాయం
బేమాత్రము వేరుకావ హీనచరిత్రా! 1003

ఉ॥ ఈయఁగవిత్తమున్నయెడ నీదశయేటికి వచ్చునయ్య! నా
ప్రాయమునాటి జీవితము వైఖరి నీవ యెఱుంగు దయ్య! యీ
హేయఁపు జీవనమ్ము వరియించును నన్నిరియెంచ నైతి న
య్యా! యెటు బ్రోతువో యెఱుగనయ్య! దయుంగనుమయ్య!
భూవరా! 1004

ఆ॥ వె॥ మరియు నిటుల దెలుపు మాటలకును ప్రభు
వగ్గిపయినవడిన గుగ్గిలమటు
భగ్గుమనుచు మండిపడి నీవు ధనమిచ్చు
దనుక కఠినశిక్ష తప్పదనియె. 1005

కం॥ జననాథా నను దీనునిఁ
గనవా! యీకఠినశిక్షఁ గడువం దరమా
ధనమీయ రామునాలయ
మునకును ననుఁబ్రోవ నెవరు జూనెదరనఘా! 1006

కం॥ ఉన్నాడు కాదె? మీరా
మన్న ? యతండిడడె యనుచు నతికుపితుండై
నిన్నున్ విడిచిన రాజ్యం
బెన్నాళ్లుండెడిని నుండనిత్తురె? యెవరేన్. 1007

తే. గీ॥ ఎవని యేల్బడినుంటివో ? యిన్నినాళ్ళు
తెలిసికొనియుంటివా? నీవు దేవళములు
కట్టఁగావస్తువాహనాల్ పెట్టనిచ్చి
నారమే ? నీకుఁదహసీలుదారు పదవి ? 1008

తే. గీ॥ ఇంతసాహసమా ? నీకు నెవరియాజ్ఞఁ
జేతఁగొనిచేసి యుంటివో చెపుమ! అనుచు
అతికఠినశిక్షవిధియించె నతిభయంక
రమ్ము మోమగ్నికణములఁజిమ్మ నృపతి 1009

తే. గీ॥ కరకుకత్తులఁ జేబూని యిరుగడలను
నిలిచి పురమున నాల్గువీధులను ద్రిప్పి
రాజవిత్తాపహారి యీరామదాసు
శిక్షితుండయ్యెనని చాటి చెప్పవలయు. 1010

కం॥ అతికఠినవృత్తి నీతని
నతిగా బాధింపుఁడేఁగుఁ డతిభీకర పుం
గతిఁ గారాగృహపతికిన్
ధృతమతినాయాజ్ఞ తెల్పుడీ! వేగముగన్. 1011

కం॥ అని తానీషాయను నం
తనెభటవర్గమ్ము రామదాసుంగొనిచ
య్యన కారాగృహపతికిన్
వినిచియురాజాజ్ఞ పురికివెడలిరి యంతన్. 1012

సీ॥ వేలాది ప్రజలతో వేయిదీపాలతో
నొనను వివిధవాద్యములతోడ
బంధువర్గములతో బహుశాస్త్ర పాండితీ
ధనులగు భూసురోత్తములతోడ
మేనమామకొమెరి మెయిసగంబయి వెల్గు
కమలతో దాంపత్య గరిమతోడ
నే రాజధాని నూరేగెఁ బెండ్లికుమారుఁ
డయి భద్రగజముపై హరువుతోడ

తే. గీ॥ ఆపురమ్మునఁ గాల్నడననదయగుచుఁ
అడుగడుగునకు సంకెలులడ్డుపడఁగఁ
గరకుకత్తుల భటులిరుగడల నడువ
నడువవాసెనె విధియన నడువఁజొచ్చె
రామరామా! యటంచును రామదాసు. 1013

కం॥ ఆరామదాసుఁగన్గొని
యేరామాపురుషులెల్ల రేడ్చెడివారే
ఆరాజభట కదంబము
నారాజునుఁదక్క యెల్లరాపురమందున్. 1014

తే. గీ॥ అంత శ్రీరామవిభుఁడు సుస్వాంతుఁడితఁడు
గణితమందునఁ బేర్పడ్డ గణికుఁ డింత
మాత్ర లెక్కించుననుచు లక్ష్మణుని వఁక
గాంచ లెక్కింపఁబూనె లక్ష్మణుఁడు ధనము. 1060

కం॥ మిరుమిట్లు గొలుపు ధనములఁ
బరికించుచు మ్లేచ్ఛ భూమిపతి మనమందున్
పరికింపనొక్కొ ? పసిడిం
బరికించిన యిట్టిపసిమి వరలెనె ? యెందున్. 1061

కం॥ అని యానాణెమ్ముల తీ
రును గని మురియుచును నొక్కరుండే యితఁడీ
ధనమును లెక్కించెడి నీ
తని చురుకుందనము నెన్న దగునను నంతన్. 1062

తే. గీ॥ కమలమాసాధ్వి గొనిన దీక్షాఫలమ్మొ !
రామదాసుని భక్తిఫలమ్మొ ! నాగ
పదులు వందలు వేలుఁగా బరిగణించి
లక్షలుగఁ జేసి ప్రోవిడె లక్ష్మణుండు. 1063

కం॥ అంతన దానీషా సు
స్వాంతుఁడు వెంటనే "రశీదు" వ్రాసి యొసంగెన్
సంతకముఁ జేసి ప్రొద్దుట
నెంతయు ముదమార విడుతు నే గోపన్నన్. 1064

కం॥ అని పలికిన యది మంచిద
యనినట్లులఁగానుపించి యంతర్హితులై
చని రంత నె బందిగమం
దున నుండిన రామదాసుతో మాటాడన్. 1065

కం॥ ధనమిచ్చినార ముత్తర
మునుఁగొంటిమి యప్పుతీరె భూమిపుఁ డుదయ
మ్మున వీడును నిను బందిగ
మున నుండియు, రాజవిభవముల దైవారన్. 1066

కం॥ అని మొలకువఁగొనియెడు గో
పనకున్ వినిపింపఁబలికి భద్రాచలమం
దున నున్న కమల సాధ్వికి
మనమలరన్ దెలిపి స్వప్నమందున నంతన్. 1067

కం॥ యావద్విషయము సీతా
దేవికి ముదమారఁదెలుప దేవియుభక్తిన్
దేవా ! నీమాహాత్మ్యము
నేవారికిఁదెలియు ననుచు నెలమిని మ్రొక్కెన్. 1068

---

## రామదాసుని శుభోదయము

వ॥ అక్కడ బందిగమ్మునఁ గలరామదాసు మేల్కాంచి
యిట్లనుకొను. 1069

కం॥ నీవో నేనో రాజున
కీవేళో రేపో ధనము నిడ కుండినచో
నీవా దెట్టులఁ బోయెడు
నీవే! కనుమయ్య! మది సుధీనుతరామా! 1023

కం॥ అని కనుమూసియుఁ దెఱచినఁ
గనుపడె దివ్యాన్నమ్ముల్లు కరుణానిధి! నీ
యనురాగమ్మున మనియెదఁ
గొనియెద సత్కీర్తియును వికుంఠము రామా! 1024

కం॥ అని నైవేద్యము నిడియును
మనమరల భుజించి రాము మహిమమ్ము నెదం
గనుఁగొన నెడబాయని చిం
తను దనరంజొచ్చె రామదాసుండంతన్. 1025

వ॥ రాజభటులరుదెంచి మోయంజాలని బరువెత్తి మోయుమనుచు బాధింపం దొడంగి రయ్యెడ. 1026

కం॥ అరరే కొరడాదెబ్బలు
పరికింపుము! రామచంద్ర! భరియింపఁగ నా
తరమా! ఒడలంతయు నె
త్తురుకాల్వలై యిచట నెవరు తుడిచెడివారల్? 1027

కం॥ మండుచున్నవి దద్దురు
లండజవాహనుఁడ! నీ వెయుండ గదయ్యా!
కండలు పైబడ కొట్టిరి
దండిమగల్ రాజభటులు దశరథరామా! 1028

ఉ॥ కాలువఁగట్టె నెత్తురును కండలుచీమలు పీకుచుండె నే
లీల భరింతునయ్య! యెడలేక కరమ్ముల నిన్ని సంకెళుల్
గ్రాలెడు కేల్ కదల్చుకొనఁగాదగు వీలును లేకపోయె నో
శ్రీలలనామనోహర! హరీ! దయఁ బ్రోవవ! రామభూవరా!

కం॥ ఈమేనెల్లను కుట్టుచు
నీమెయి రక్తమ్ము పీల్చి చీమలు నీ
దోమలు బాధించెడు నో
రామా! నను బ్రోవ రావ! రాఘవరామా! 1030

కం॥ బారుల్ దీరిచి నామెయి
బారుచు మత్కుణపురాశి బాధించెడు నో
శ్రీరామా! ననుఁ బ్రోవఁగ
రారా! సహియింపఁజాల రఘుకులరామా! 1031

సీ॥ ఈమండుటెండలో నీసైకతాగ్నిలో
నేలాగు నిల్చెదు నినకులేశ!
యీకారురాళ్ళలో నీబండ లెత్తుకు
నేలాగు నడతు వినీలగాత్ర!
యీకేలుదోయిలో నీచింతనిప్పుల
నేరీతి నిల్పెదు నీరజాక్ష!
యీసున్నపుంగాష్ఠ నిటులుండి యిందునే
చక్కిలాగఁగ నేర్తు చక్రహస్త!

తే. గీ॥ అనుచు విలపించుచును ననుదినము ఘోర
కష్టముల కగ్గమయ్యును నిష్టదైవ
మయిన రఘురామలీలయే యనుచు నెటులొ
ప్రాణములు నిల్పుకొనుచుండె రామదాసు. 103

కం॥ ఒకదినముకన్న మరియుఁక
నొకదినమున బాధహెచ్చ నోర్వఁగలే కే
నిక నోర్వఁజాల బాధల
కకటా! యెటు బ్రతుకఁజాలెదయ్యా! రామా! 103

తే. గీ॥ అభయహస్తుఁడవనియును నఖిలభక్త
వరదుఁడవటంచు భక్తి నీపాదయుగము
పట్టితిని ప్రోవకుండిన కట్ట! యిద్ది
క్షత్రియకులమ్మునకు కళంకమ్ముకాదె? 103

కం॥ ఇకనే బ్రతుకుట కష్టము
ప్రకటితమతి దెలుపుచుంటి భక్షించెదవో!
సుకరమ్ముగ రక్షింతో!
ఒకఁడేదియొ నేడు చేయు! మూర్జితశక్తిన్. 103

సీ॥ తెల్లవారకమున్న తేలుకుట్టియు నేడ్చు
తరి రాళ్ళమోతకై తరుముచుంట
డొక్కలో శూలించి యొక్కడఁ బడియుండ
లెమ్మని గూటాల కుమ్ముచుంట

అడుగడ సంకెలు లడ్డుపడుచు నుండ
దోలుకట్టలగొట్టి త్రోయుచుంట
నెత్తిపై బరువెత్తి నేలఁ బల్లెరులుంచి
ఆగక ముందుకు లాగుచుంట,

తే. గీ॥ నీవు చూడవా? యెఱుఁగవో? బ్రోవ నన్ను
నిన్నుమది నమ్మి బ్రదికెడు నేనె నీకు
బరువుగాఁదోచుచో నిక బ్రదుక నేల ?
నయిన నీనాడు చూచెద నంబుజాక్ష. 1036

కం॥ రామా ! యేయో ! నామొర
యేమాత్రము నీదు చెవికి యెక్కకపోయెన్
గామిత ఫలదాయిని సీ
తామాత్రకు వినుతుఁ గన్న తల్లియు వినదే ? 1037

## రామదాసు సీతమ్మను ప్రార్థించుట

కం॥ అమ్మా ! సీతమ్మా ! మా
యమ్మా ! వినుమమ్మ ! రామదాసుఁడనమ్మా !
నమ్మితినమ్మా ! నా బా
ల్యమ్మాది భవన్మృదంఘ్రి రాజీవమ్ములే. 10౩

కం॥ రాముని చెవిలోఁబడ దది
యేయో నామొట్ట ! యెంతయేడ్చినఁగానీ;
నీమాటన్ వినకుండునె ?
నామాటన్ దెలుపుమమ్మ ! నయముగఁదల్లీ. 10

ఆ। వె॥ అతని పత్ని, కమల ఆనాడు చేసిన
ప్రతిన మనము వినమె? రామ! ఆపె
మదియు రేగ నేడు మనుపంగ నీనాడు
పూనకున్న జగము బుగ్గికాదె? 1045

శా॥ ఆసాధ్వీమణిమోము చూడుమదె! ఆసాధ్వీవతంసమ్ము వి
శ్వాసమ్ముం గనిపెట్టు మీదినముతో సర్వమ్ము బహ్మాండము
చ్ఛ్వాసస్ఫార మహోగ్ర వహ్నిశిఖలన్ భస్మమ్ము కాకుండునే?
ఓ సర్వేశ్వర! యెల్లలోకములకీ వుత్సాహముం గూర్పవే?

ఆ. వె॥ అనుచు సీత పలుకునంత మైంగప్పిన
పచ్చటమ్ముఁ దొలచి పడతి! కనుమ!
అనిన రాముఁజూచి హారామ! నీమేన
నెత్తురేమి టనుచు నెలతసీత. 1047

కం॥ వాపోవుచుండ నేటికి?
పూబోడీ! యిటుల దుఃఖముం గొనెదవు నా
పాపఁడుగాడే? గోపన
యీపగిదిని వానికష్ట మేఁగొనుచుంటిన్. 1048

కం॥ ఆకమలమ్మ ప్రతిజ్ఞయె
చేకుండిన నితనికర్మ చెల్లునెయింతన్
వాకొనఁ బండ్రెండేండ్లగు
గాక దినాల్ పదియు రెండుగాఁ గమలాక్షీ. 1049

శా॥ అమ్మా! జానకి! నీపతిం దలఁచుచున్నానమ్మ! ఇందన్కలే
శమ్మున్ లాభము లేకపోయినది! నీస్వాంతమ్మునం దేని నన్
నెమ్మిం గాంచెదవంచుఁ దెల్పుకొనుటల్ నీకన్న కష్టాట నో
యమ్మా! రామునితోడఁ దెల్పగదవమ్మా! బ్రోవఁగా సీతమా!

ఉ॥ ఈదిన మెట్టులో సయితు నియ్యెడ నీదగు పేర్మికల్మి న
భ్యుదయము నందనేర్తునని పూర్తిగ నామదిఁగల్గునాస, నే
యదనునఁ దెల్పినన్ విని దయన్ నను మన్పనొ రాఘవుండు నీ
మదిఁగని తెల్పి నేడె ననుమన్పఁగఁజేయఁగదమ్మ! సీతమా!

ఉ॥ రాముఁడు లోకపాలనవిరామములేని సమిష్టిదృష్టి న
న్నేమఁగఁ జూచునంతవర కోపికపట్టఁగఁజాల నేడె న
న్నేమి కృతార్థుఁజేయు మను మూపిరిపోయిన వాడుపోడు శ్రీ
రాముఁడు భక్తరక్షణధురంధరుఁడంచు జగమ్ము మెచ్చగాన్.

కం॥ అని రామదాసు సీత
మ్మనుఁగోరియు రామనామ మహిమమ్మును నె
మ్మనమునఁదలఁచుచు నిద్దురఁ
గొనె సీతమ రాముచెంతకుం జని పేరిమిన్. 1043

---

## రామదాసుని శ్రమము సీతమ్మ రామునకుఁ దెల్పుట

కం॥ మన రామదాసుమనుగడఁ
గనకుందురె? అతఁడు మిగుల కాతరపడుచుం
డెనుగద వేగమ పేరిమిఁ
గనకుండిన బ్రదుకఁగల్గఁడె? కరుణావార్థీ!

కం॥ ఆకమలమ్మ ప్రతిజ్ఞయె
నాతను నాభూమిపతికి నాయను బుద్ధిన్
మేకొనఁజేసిన దట్టుల
గాకుండిన నిట్టి శిక్షగరపునె ? నృపుఁడున్. 1050

ఉ॥ ఒక్కొక రోజునందునసె ఒక్కొక వత్సరకాల శిక్షలన్
స్రుక్కఁగఁజేసె భూమిపతి చూడుము నాతనువెల్ల కోమలీ !
దక్కనె? రామదాసు కడుదక్షత నేనుగ్రహింపకున్న ! నే
డక్కజమంద నెల్లజను లాతని నే విడిపించి తెచ్చెదన్. 1051

కం॥ అతండియెడు శిక్షల
నేతద్విధమునను సర్వమేఁగొనుచును ద
ద్యాతనలు గొనెడి వర్ష
ఖ్యాతిన్ రోజులనె తీర్చగలిగితి సకియా ! 1052

కం॥ ఇఁకనే నిల్వఁగ రాదిట
సకియా ! గోపన్న పూర్వజన్మఁపుకథ వే
రొకయప్పుడు దెల్పెద నీ
కకలంకము వాని చరిత మంతయు నెఱుఁగన్. 1053

---

## రామలక్ష్మణులు తానీషాకు ధనమిచ్చుట

అని యనుఁజుండు లక్ష్మణుని యంతనఁ గైకొని గోలుకొండప
త్తనమునయందు నంతిపురి తానిష నిద్దురనున్నవాని మే
ల్కొన మెయిఁదట్టి లేపి యివె గోపనయీఁదగు నారులక్షలన్
గొను మిడవచ్చినార మని నొక్కివచించిన సోదరద్వయిన్.

కం॥ అరసియు ముగ్ధుండయి యెం
దరయని యీ దివ్యమంగళాకారుల శ్రీ
కరుల భటవేషధారులఁ
బరిపరిగని భూమిపతియుఁ బ్రశ్నించె నిటుల్ 1055

కం॥ మీ రే డెవ్వఁడు వేతన
మేరీతిగ నుండు? పేరు లెయ్యవి మీ రుం
డూ రెయ్యది? సర్వమ్మును మే
మారయ వచియింపు డనిన ననె రాముఁడిటుల్. 1056

తే. గీ॥ రామదాసుని దాసుల మేము మమ్ము
గారవాదర బుద్ధి నిఁగాంచుఁ నతఁడు
నతని తీర్థ ప్రసాదమ్ము లందికొనుచు
నతని సేవల నుండు మే మనవరతము. 1057

తే. గీ॥ రామలక్ష్మణు లనియెడు నామములను
వెలయుచున్నాము భద్రాద్రి విడెదె మాకు
సొమ్ముఁగైకొని వేరశీదివ్వ మాకు
నిలువ వీల్పడ దిట నొక్కనిమునమేని. 1058

తే. గీ॥ అనుచు రాముఁడు వల్కిన యంత నిట్టు
లనియెఁ దానీష యీ ధనమంత యిప్పు
డెవరు లెక్కింప నుండిరి? యిద్ది రేప
కడను గాదగు పనియన గరిమ మెఱయ. 1059

తే. గీ॥ అంత శ్రీరామ్మవిభుఁడు సుస్వాంతుఁడితఁడు
గణితమందునఁ బేర్వడ్డ గణికుఁ డింత
మాత్ర లెక్కించుననుచు లక్ష్మణుని వంక
గాంచ లెక్కింపఁబూనె లక్ష్మణుఁడు ధనము. 1060

కం॥ మిరుమిట్లు గొలుపు ధనములఁ
బరికించుచు మ్లేచ్ఛ భూమిపతి మనమందున్
పరికింపనోర్కొ ? పసిడిం
బరికించిన యిట్టిపసిమి వరలెనె ? యెందున్. 1061

కం॥ అని యానాణెమ్ముల తీ
రును గని మురియుచును నొక్కరుండే యితఁడీ
ధనమును లెక్కించెడి నీ
తని చురుకుందనము నెన్న దగునను నంతన్. 1062

తే. గీ॥ కమలమాసాధ్వి గొనిన దీక్షాఫలమ్మొ!
రామదాసుని భక్తిఫలమ్మొ ! నాగ
పదులు వందలు వేలుఁగా బరిగణించి
లక్షలుగఁజేసి ప్రోవిడె లక్ష్మణుండు. 1063

కం॥ అంతన దానీషా సు
స్వాంతుఁడు వెంటనే "రశీదు" వ్రాసి యొసంగెన్
సంతకముఁ జేసి ప్రొద్దుట
నెంతయు ముదమూర విడుతు నే గోపన్నన్. 1064

కం॥ అని పలికిన యది మంచిద
యనినట్టులఁగానుపించి యంత్వర్థిశులై
చని రంత్రనె బందిగమం
దున నుండిన రామదాసుతో మాటాడన్. 1065

కం॥ ధనమిచ్చినార ముత్తర
మునుఁగొంటిమి యప్పుతీరె భూమిపుఁ డుదయ
మ్మున పీడును నిను బందిగ
మున నుండియు, రాజవిభవముల దైవారన్. 1066

కం॥ అని మెలకువఁగొనియెడు గో
పనకున్ వినిపింపఁబలికి భద్రాచలమం
దున నున్న కమల సాధ్వికి
మనమలరన్ దెలిపి స్వప్నమందున నంతన్. 1067

కం॥ యావద్విషయము సీతా
దేవికి ముదమారఁదెలుప దేవియుభక్తిన్
దేవా! నీమాహాత్మ్యము
నేవారికిఁదెలియు ననుచు నెలమిని మ్రొక్కెన్. 1068

---

## రామదాసుని శుభోదయము

వ॥ అక్కడ బందిగమ్మునఁ గలరామదాసు మేల్కొని
యిట్లనుకొను. 106

కం॥ ఆకాశవాణి పలుకో!
కాకా! రఘురామవిభుని కబురో యనుఁగా
కే కాకి నయిన నాకిట
కీకరణినిఁ దెలుపవత్తురే? యెవరే నిన్. 1070

మ॥ అనిచింతించుచు రామభూమి విభు పాదాంభోజ యుగ్మంబు హృ
ద్వనజాతమ్మున నిల్పి మ్రొక్కి గురుభట్టారార్యాంఘ్రిపద్మద్వయీ
ఘనసేవా సుఫలోదయమ్ము మునిహృత్కంజాతసంచార! నీ
యనురాగమ్మను నాపయిం గురియఁజేయంజాలె రామప్రభూ!

కం॥ నన్నీ చీకటి గదియం
దున్నాతని బాలసూర్యు నుదయముఁ జూడన్
గన్నియు దేవదేవుని
నెన్నెద శ్రీరామచంద్రు నినకులతిలకున్. 1072

## తానీషా పశ్చాత్తాపము

కం॥ అని రామదాసు బందిగ
మున రాముఁదలంచుచుండె భూమీపతియుం
దన జాయతోడ సర్వ
మ్మునుఁ దెలుపుచు ముదముఁగొనుచు ముగ్ధుండగుచున్

తే. గీ॥ రామదాసింతవాఁడని తాము! తలఁప
కెన్నియో బాధలం బెట్టి తింతదనుక
నితరసేవకు లట్టుల యీతఁడు నొకఁ
డనుచు ద్రోహి యటం చును నక్కటకట! 1074

తే. గీ॥ ఎన్నిమారులో ఉత్తముఁడేమొ యీతఁ
డన్న భావమ్ము పొడమ నాయన్నువయును
తథ్య మయ్యదియని బహుధావచించి
యున్న నదియేమొ గ్రహియింపకుంటి నకట! 1075

ఉ॥ ఆతఁడు రామభక్తుఁడు మహాత్ముఁడు సత్యము, సత్యమాడెవి
ఖ్యాతచరిత్రుఁ డాతఁడు మహా కవి త్యాగి యటంచెఱింగియో
యాతనికిచ్చినాడఁగద యాపద మాస్మృతిలేకపోయె నే
నాతనిపెట్టు బాధలకు నంతును బొందునుకద్దె? దైవమా!

ఉ॥ ఏమనుజుండు వనిని సహింపఁగనోపెడు నేమహీశ్వరుం
డేమెయి శిక్షలం బరపు నెవ్వని నెంతటి ద్రోహినైన నీ
బామున నెన్నఁడేని నిటువంటివి చేసితినొక్కొ? మున్న నే
డేమిటి కిట్లుచేసితిని నేమనుకోదగు? దీని దైవమా! 1077

కం॥ అని యింతకు దుర్మంత్ర
మ్మునసెడియెద రెంత లేసి భూమిపులేన
క్కన మాదన లిర్వురు నూ
రను లేకుండుటను నిట్టి రభసు జనించెన్. 1078

తే. గీ॥ రాముఁడే యీయఁగావలె రామ! రామ!
చేతఁ గానేని లేదని చెప్పె మున్న
రామదా సాతఁడన్నట్టు రాముఁడిచ్చె
ప్రభువునై యిప్డు నేచేయు పనియదేమొ ? 1079

తే. గీ॥ రామభక్తుఁడు సత్కవి, బ్రాహ్మణుండు
మనమహామాత్యులకు నల్లుఁడనియు నేనిఁ
దలఁపకయ నేను ఘోరపాతకము లొడినిఁ
గట్టుకొన్నాడ నెటుతీరుఁ గాంత ? నేడు. 1080

సీ॥ ఐనది యేదియో యైనది యానాఁడె
యేనుగంబారి నూరేఁగజేతు
నాయుత్సవంబేఁగి యరుదెంచునంతకు
"తాలూక" జహగీరు దఖలు పఱతు
పఱచుటయేగాక భద్రాద్రిపురికి శ్రీ
రాజలాంఛనముల రాజుఁజేతు
రాజమాత్రుఁడె గాక రాజన్యునిం బలె
ఇటనుండి యేన్గుపై నేగఁజేతు.

తే. గీ॥ అనుచు నారామదాసుని యంతరాత్మ
యేమి క్షోభించుచున్నదో యేమొ యనుచు
స్వయముగాఁ దానె తీయుదు సంకెళులని
స్వాంతమందెంచు తరిఁ దానిషావిభుండు. 1081

వ॥ మంగళతూర్యనాదంబులు సెలఁగఁ బ్రాతఃకృత్యమ్ములు నెఱవేరుటయె దడవుగ నూరేగింపు టుత్సవమ్మునకు నాజ్ఞాపించి సూర్యోదయమ్మునకు నెదురు చూచుచుండ నయ్యెడ రామదాసు నిరంతర శ్రీరామ పదారవింద ధ్యాన పరాయణుండయి యించుక తెలివిం గొనునంత. 1082

---

# సూర్యోదయము

సీ॥ పతిసేవనారతసుతగుణ కమలాంబి
కోజ్జ్వలభాగ్య మహోదయంబొ
తనభక్తుఁడగు రామదాసు నోమెడు రాఘ
వోదార కరుణారసోదయంబొ
అఖిలమ్ము రామమయంబను రామదా
సోత్కటపుణ్య ఫలోదయంబొ
దయయు సత్యము నెందుఁదలచు తానిషాప్రభు
సూర్జితత్యాగ ఫలోదయంబొ

తే. గీ॥ తలఁప నజ్ఞానగాఢాంధతమస మెల్ల
యెడల వ్యాపించి యేమియు నెఱుఁగఁబోని
యఖిలలోకమ్ము జ్ఞానోదయమ్ము నాఁగ
నొప్పెఁ దూర్పున బాలసూర్యోదయమ్ము.

# రామదాసు బంధవిముక్తి

వ॥ అత్తరి తానీషా ప్రభువరుండు కతిపయ నిజపరివార యుతుండై వచ్చి రామదాసుండు బందిగమ్ముం గని రామదాసునకు సమస్కరించి పదరజము తొదలందాల్చి స్వయమ్ముగ సంకెళులూడ్చి యిట్లను. 1084

కం॥ ఇన్ని దినమ్ముల నుండియు
నెన్నే బాధలనుఁబెట్టి తెరుఁగక నిన్నో
అన్నా! గోపన్నా! న
న్నెన్నక మరియొక్కరీతి నెలమిం గనుమా! 1085

కం॥ నిన్నెన్న నెంతవాడను
అన్నా! ఓరామదాస! ఆచంద్రార్కం
బున్నే రాజ్యము, ధనములు
నున్నే కష్టములు? కీర్తి యొక్కఁడు దక్కన్. 1086

కం॥ శ్రీరామ పాదభక్తుఁడ
వారాధ్యుఁడ వేరికయిన నట్లయ్యెను నా
శ్రీరామలీలయో! మన
ప్రారబ్ధమొ! రామదాస! పండిన దిట్టుల్. 1087

వ॥ అని యనేకవిధమ్ముల నుతించి శ్రీరామపదారవిందధ్యానాసక్తుండయిన రామదాసునకు మరియు నిట్లను.

తే. గీ॥ రామదాసుఁడ! నిన్నామ రామచంద్రుఁ
డారులక్షల ధనము మా కందఁజేసె
లెక్కపెట్టెను లక్ష్మణాలం డక్కజముగ
నిచ్చియుంటిని "సెరశీ" తెలమి శ్రేయి. 1089

కం॥ నీకున్ నేను "రశీ" దిడఁ
బ్రాకట భక్తిప్రపత్తి వచ్చితిఁగొనుమా!
నీ కేలిడుమా! మాతో
నేకమ్ముగ వెడల మదిని నెలమినిఁగనుమా! 1090

కం॥ అని సమ్మతింపఁజేసియు
జనపతియును రామదాసు సంబరమందన్
మనమున కెక్కెడి పలుకుల
ననుమానముఁ బాయఁజేసి యాదర మొప్పన్. 1091

ఉ॥ రాజమహేంద్రునట్టుల విరాజిల నూతన వస్త్ర, భూషణ
భ్రాజితుఁజేసి దివ్యసుమ వాసనలీను సుపుష్పమాలికా
రాజి నలంకరించి రఘురామపదాంబుజ దివ్యవాసనా
యోజితు రామదాసు కరముంగొని తెచ్చె విభుండుకోటకున్

---

## రామదాసునకు గజారోహణోత్సవము

చ॥ తెలియక రామదాసునకుఁ దీవ్రతరంబగు శిక్ష వైచి సం
కెలులిడి బాధపెట్టితిని కేవల దుష్కర ముష్కరమ్మునన్
దెలిసితి రామదేవుకృపఁ దెల్లముగా సకలమ్ము నేడు లో
దలఁపక పూర్వగాథలు కృతార్థునిఁజేయుడు! నన్ను భూప్రజల్!

కం॥ అని పురమెల్లనుఁ జాటం
బనిచియు శ్రీరామదాసు భద్రమదేభ
మ్మున నునిచియు నూరేగిం
ప నియోగించెఁ బతిరాజవైభవ మొప్పన్. 1094

సీ॥ వేదనాదమ్ములు వినుముట్టఁ బురమెల్ల
భూమిసురోత్తముల్ ముందునడువ
ధీమన్తు తామాత్య, సామంత, హితపరి
వారమ్ము లుత్సాహపరత వెలయ
ఢంకా, నగారాల ధ్వాంకృతి శ్రీరామ
భక్తసామ్రాజ్య వైభవముఁజాట
దశదిశల్ వ్రచ్చు శతఘ్నినాదము రామ
దాస రక్షాదక్షతను వదింప

తే. గీ॥ విభుని కేలూతనంబారి యిభమునెక్కి
సజ్జఁదానిపవరల దివ్యద్విభూతి
నెలమిగోల్కొండ పురవరమేఁగు రామ
దాసు నెన్నంగవశమె? బృందారకులకు. 1095

సీ॥ కపురంపుటారతుల్ కన్యకామణు లీయఁ
బాలహారతులు పూబోఁడు లీయ
రత్నంపుటారతుల్ రమణీమణు లొసంగ
మౌక్తికారతులను మగువలొసఁగ

కరుదెంచి యుత్సవమ్మునఁ బాల్గొన వేగిరపాటున సపరివారులై యమాత్య సోదర్యు లెదురేఁగి రాజమర్యాదలఁ దానిఁబాకం జలించి శ్రీరామభక్తాగ్రగణ్యుండగు మేనల్లుండిడు నమోవాకమ్ము లందికొని యాశీర్వచించుచు గన్నీరు మున్నీరుగా విలపించియుఁ గించిదానందవర్ధన భావోదయులై యపరిమిత చింతాకల్లోలి తాంతరంగుండగు రేసమోముంగని సంజ్ఞా మాత్రమ్మున నీశ్వరేచ్ఛం దాటనేరికగు నన్నటు లుపశమ భావప్రకటనులై కర్పూర, ముక్తా, ఫల, సువర్ణ, సుమ నీరాజితులం జేసి సౌధోపరితలమ్మున నుండి కన్యకాహస్త విభ్రష్ట పుష్పసంచయమ్ములం గని యుత్సవ దర్శనాగత మరున్నారీ నివహమ్ము లంబరమ్మున నుండి కురియు కల్ప ప్రసూన వర్షమ్ములోయని చూపరు లానందపరవశులై యంబరమ్ము నవలోకింప నక్కన మాదనామాత్య భవన ద్వారమ్ములు దాటియుత్సవమ్ము ముంగలికేఁగ నందందుంగల యుత్తమదంపతులు ముదావహు లయ్యును నీశ్వర విలాసమ్మున కాశ్చర్యభరి తాంతరంగులై. 1097

సీ॥ కనువిందుగా నాడు కమలతో రతిరాజు
నట్టు లీ యేన్గుపై నలరెనితఁడు
అక్కటా! నినమొన్న దిక్కేది యీరాజ
భటులిడు దుర్భర బాధలకును

అనుచు నుతించి మెచ్చుకొను నారఘురామ పదారవింద మా
ధ్వాని గయి పెక్కు మానసగతిం జగముం గనబోని రామదా
సుని హరిభక్త భృంగపతిఁ జోద్యముగాఁ గనుచున్ ధరావరుం
డనుపమభక్తి నిల్పె మహితాత్ములు మెచ్చఁగ రత్నపీఠికన్.

ఉ॥ మేలు సువర్ణ రత్నమయ మేదుర నీరజపీఠినున్న శ్రీ
లోల పదారవింద మధులుబ్ధము రామకృపారసార్ద్రదృ
క్పాలిత రామదాసమధుపమ్ము నితాంత నిజాముభూప్రజా
పాలక గోకరాజ్జముగ భాస్వరపూజిత భూరితేజమున్.

చ॥ కనుగొను చెల్లవారలు జగన్నుత సాత్వికమూర్తి రామదా
సునకునుఁ గేలుమోడ్చి కృపుచొప్పునకుం బ్రమదమ్ము విస్మయ
మ్మునుఁ గొనుచున్ ధరావసుని పూర్వజనుః ఫలమెన్న నౌనె? రా
ముని దరిసించు భాగ్యఫలముం గొనె నంచుఁ దలంచు నత్తరిన్.

## తానీషా రామదాసునకు జహగీరొసంగుట

వినుఁడీ! యెల్లరు నానుడిం బెరిమి సంవిన్మూర్తి యీ రామదా
సుని యౌదార్య మెఱింగి యున్నతపదస్థుం జేసి, వెన్వెంట నీ
తని యుద్యోగపు ధర్మనిర్వహణకాత్మన్ మెచ్చి మన్నించు బు
ద్ధి నిఁగించిత్తను ఘోరశిక్షలిడి బాధింపంగ నే నెంతునే? 1110

మ॥ ననుఁబెన్మూర్ఖునిగా దురంతకునిగా నా సేయు శిక్షావిధిం
గనినన్ విన్నఁ దలంతు రెవ్వరును నిక్కంబద్ది సత్యమ్ముఁ దె
ల్ప నదో దేవరహస్య మున్నదని సంభావించి వాక్రుచ్చు న
మ్మహ మే నన్యముఁ దెల్పలేకునికి ధీమన్ముఖ్యు లే మెంతురో!

మ॥ జననం బందితి భూమినేతనయి సాతాత్మానుజుండైన రా
ముని సందర్శన భాషణాది విభవమ్ముం గాంచి శ్రీరామదా
సుని కారుణ్యవిశేషసంపదను సుశ్లోకుండు శ్రీరామచం
ద్రునకున్ భక్తుడు వీని క్షేమ యుడసేర్తున్ సేబుణంబీగంగాన్

తే. గీ॥ సకలలోకమ్ము లేలెడు చక్రవర్తి
దాశరథి రామదాసాజ్ఞ దలనుదాల్చు
నట్టి యీ రామదాసున కెట్టిదిడినఁ
జంద్రునకు నూలుపోగను చంద మొప్ప. 1116

ఉ॥ ఐనను నాకొలందిగ మదాత్మఁ దలంచిన కాన్క వెట్టి సు
జ్ఞాని వదాన్యమూర్తిఁద్రిజగన్నుతు నీ మనరామదాసు న
జ్ఞాన మహాంధకారపథవర్తన మామకమత్త చిత్తదృ
గ్జ్ఞానదివాకరుంగొలిచి సంసృతిబంధ విముక్తి నందెదన్.

తే. గీ॥ అఖిలలోకమ్ము లెవ్వాని యాజ్ఞ వెలయు
నావిభుఁడు రామదాసుని యాజ్ఞ నలరు
నంతవాడన్న దాజ్ఞ నొదలఁగొన
నన్న హాస్యాస్పదునిగ నెన్నదె? జగమ్ము. 1118

ఇందన్కన్ "జహాసీలుదారు" డవునై యేభద్రమూర్తమ్మునం
దెంమన్ వెల్గెడు రామదేవళము నీ వేర్పాటు గావించితో
అందున్ నిన్ "జహాగీరుదారు" నిగఁ జేయంబూని తీపత్ర మే
సందేహమ్మనుఁ బొందకేగొనుమ! యిచ్చెన్ రామదాసప్రభూ!

కం॥ తాలూకా సకలము నీ
యేలుబడిన్ వెలయుఁ గప్ప మిడ నక్కర లే
దేలాకో యోజన సేసెదు!
జాలము సేయక యకొనుమ! సమ్ముదమిడుమా! 1120

తే॥ గీ॥ రామచంద్రమూర్తి రారాజుగావున
రాజలాంఛనముల రాజవగుచు
రామసేవనలరి బ్రహ్మణ్యవరాళివై
తనరుమయ్య! రామదాసవర్య! 1121

కం॥ నినుఁజూపె రామచంద్రుఁడు
ననుఁదరియింపంగఁ జేయ నామనవిని గై
కొని పేరిమి నీ పత్ర
మ్మునుఁగొనుమా! రామదాస! మోదంబిడుమా!

అని ప్రార్థించు తురుష్క భూమిపతి దానాశ్చర్యముం బొందన్తో
జననాథా! యిద్ది రామచంద్రుని పద్మాబ్జాతద్వయీ సేవనా
ధనమై రాజిల భావుకమ్ము భవదౌదార్యమ్ము యీ వజ్జగ
జ్జన రత్నావిభవమ్మునై వరలు నిచ్చల్ భక్తిసర్పించుమా!

సు సామాన్యుని మేరుశృంగముగఁ గానంజాలి సమ్మానముం
బొనరింపం దలపోయు నీదు హృదయమ్మున్ మెత్తు రెవ్వారలీ
తనువున్ విత్తము సర్వ మావిభుని పాదద్వంద్వ సేవార్పణ
మ్మొనరింపంబడెఁ జిన్ననాడ యిపుడెట్లూహింతు జేజాచ్ఛఁగన్,

ఆ. గీ॥ అతని సేవ జేయు నంత యో యింత యో
తినకఁ దప్ప దెదియొ తనువు నిలువ
మానరక్షణ కెదొ మాద్రి వల్వాలు గృహి
నగుట నతిథి సేవ లవసర మగు. 1125

కం॥ నావంటివాని కేటికి
నీవసుధా రాజ్యవిభవ మెలమినిఁ గనుమా!
భూవర! "జహాంగీర్ దా రుఁడు"
యావల్లో కాధినాథుఁ డగు నీవిడుచోన్. 1126

ఉ॥ పన్నునుఁగట్టి నీకు నను బంధ విముక్తునిఁ జేసె నీదు సం
పన్నతఁ గాన్క వెట్టి భవబంధ విముక్తులఁజేయు నిన్ను నున్
నన్నును, నీదు చాగము ననంత ఫలప్రదమౌను వేరుగా
నెన్నక నారఘూద్వహున కిచ్చి తరించి తరింపఁజేయుమా!

కం॥ అని రామదాసు పలికిన
విని భూపతి యిట్టి త్యాగి, విజ్ఞానధనిన్
గనుఁగొన నేర్తునె? అని మది
ననుకొని యీ పుణ్యమూర్తి కర్పించు కెటో. 1128

మ॥ అని యోజించియు రామదాస! రఘువంశాంభోధి
చంద్రుండు రా
ముని పేరన్ వెలయింతుఁ బత్రమును నీమోదంబె నా మ్రొక్కమై
ననుఁ దత్త్వాలన భార మీవెగొన నానందింతు నీ రాజలాం
ఛనముల్ రామునియట్టులీవును గ్రహించంజూడ వాంఛించెదన్

ఉ॥ నీవు మహానుభావుఁడవు నే నినుఁబేదగఁజూడఁజాల మ
ద్భావము రంజిలన్ విబుధవర్యులు మెచ్చఁగ రాజయోగివై
భూవరలాంఛనమ్ములఁ బవుల్ మెఱయన్ శుభవాద్యముల్ జనుల్
గ్రేవలనిల్వ భద్రగిరికిన్ జనఁగావలె భద్రదంతిపై.

కం॥ నిరతాన్నదాన దీక్షా
పరుఁడవు నవ్యాజదాన వైభవుఁడవు నీ
కరమున కడ్డున్నదియే ?
వరలును! సర్వాధికారివై భద్రాద్రిన్. 1131

వ॥ అని భూదారుండు రామదాసునకు మనంబలరఁ దెలిపి ఛత్ర, చామ, రాందోలికాది రాజలాంఛనమ్ములు దైవార నుత్తమాశ్వభద్ర గజమ్ములొప్పార నూరేగింపు టుత్సవము నేర్పఱచి అక్కన మాదనామాత్య శేఖరుల ప్రార్థనమునకు సమ్మతించి రామదాసును మహితమర్యాదల నత్తవారి గృహమ్మున కనిపిన కతిపయ బంధుమిత్రాతిథి, బృందమ్ముల నిష్టమృష్టాన్న సంతుష్టుండును బహువిధ పుణ్య క్షేత్ర మాహాత్మ్యకథా శ్రవణామోదభరితుండును నీశ్వర విలాసాలోచన సంభాషణ వినోదుండును నై అత్తమామలకు సాష్టాంగ ప్రణామమ్ము లొనర్చి, శుభాశీః పూర్వక సమ్మానమ్ము లంది గజారూఢుండయి మహారాజయోగమ్మున దివ్యోత్సవ మొప్పార బయనించి క్రమక్రమమ్ముగ బూర్గమ పాడుపురీవరమ్మునుఁగని యఖండ గౌతమీమహానదిం దరిసించి నమస్కరించి బహువిధమ్ములనుతించుచు.

తే. గీ। నిగళబంధమ్ముఁ బాపి మన్నించి నొనర్చి
మరియు నీదర్శనము జేయ తెలివుఁ జూపి
తమ్మ ! భవబంధమూర్పగదమ్మ ? పేర్మినీకు
గౌతమీ వాహినీ ! నమస్కారమమ్మ ! 1133

కం॥ భవసుత్తుంగ తరంగము
లవునట సోపానపంక్తు లాముక్తి సతీ
భవుక ప్రాసాదమునకు
భవదీయ కృపార్ద్రదృష్టి బలుపుము ! తల్లీ ! 1134

వ॥ అని భక్తిప్రపత్తి నంజలించు నత్తరి 1135

కం॥ మెలమెల్లనఁ జనుదెంచియు
నెలమిని స్పర్శాసుఖమ్ము నిడియెడు తరుణీ
విలసత్కర జలజములటు
లలమెన్ మెయిఁ జల్లనగుచు ననిలాంకురముల్. 1136

---

## భద్రాచలపుర ప్రవేశము

వ॥ అంత నమందానంద కందళిత హృదయారవిందుండునై యల్లంత గనుపట్టు శ్రీ సీతారామచంద్రస్వామి దేవాలయ ప్రాకార, గోపురమ్ములంగని బ్రహ్మానందమ్ము నంది కేల్మోగిచి ప్రార్థించునంతఁ దనరాక నెఱింగి స్వాగతం బీయ నెదురుగ నరుదెంచు సమస్త పురిజనమ్ములును కర్పూరఁపుటారతింగొని

వినయ, వినమ్ర, భావోదంచిత స్మితవద నారవిందయగు కమల మాసాధ్వీమణియు, ముద్దుసుద్దుల నలరు పసిబిడ్డ రఘురాముఁ డున్న కన్నులపండువుసేయ నొడ్డుదరిం జేరు నావ డిగి యొక్క యంగం బరువిడి వచ్చిన ముద్దుకుఱ్ఱని రఘురాముని కౌగిటం గ్రుచ్చి యెత్తుకొని ముద్దాడుచుండ నేను గంభీర నాయత్త పఱచి పురప్రముఖులు రాజకీయోద్యోగులు వినయ వినమి తాంగులై పూర్ణకుంభమ్ముల నెదురయి కర్పూరపుటారతులిడి వందనమ్ము లాచరించి కమలమాసతీ సుత సమేతమ్ముగ మంగళ వాద్యభేదమ్ములు మిన్నుముట్ట నూరేగింపుచుండ సౌధతల మ్ములనుండి లాజలక్షతలంజల్లువారును, పుష్పవృష్టిం గురియు వారును, ప్రతి గేహద్వారమ్మున కర్పూరపుటారతు లిచ్చు, వారునునైన, ముత్తైదువలంగనా, తరుణీ, కన్యకా సముదా యమ్ములున్న స్వస్తివాచనమ్ముల నలరు బ్రాహ్మణ ప్రవరులును, నలరార కనువిందుం జేయ్యున మహోత్సవంబొప్ప, శ్రీ సీతారామచంద్ర స్వామిం దర్శించి ప్రణమిల్లి సహా ప్రసుమతులసీ పూజలం జేసి నీరాజనమంత్ర పుష్పమ్ము లొసంగి తీర్థ ప్రసాదమ్ములు స్వీకరించి, మరియుఁ బ్రార్థింపదొడఁగె.

కం॥ స్వామీ! నిగళంబూడ్చిన
నేమమునన్ భవముఁ బాప నిసుమదిసీతా
రామస్వామీ! కొలిచెద
నేమరకయ ప్రోవఁగదవె? ఇనకులచంద్రా! 1138

వ॥ అని బహువిధమ్ముల బ్రార్థించి నుతించి సతీసుత సమేతుండై పరివారమ్ములు గొలువ మహారాజయోగమ్మున గృహమ్మున్జొచ్చి సుఖంబుండె, మరియు, నిరతాన్నదానాది యథాక్రమ నియమవ్రతుండై శ్రీ సీతారామచంద్రస్వామి సేవాపరాయణుండై సతీసుతులు సేవింప సమస్తజనమ్ములు సన్నుతింప తానీషా ప్రభు వరుడును నియమపాలకుండై యనువత్సర కళ్యాణమహోత్సవమ్ము ముక్తారత్నాంజలుల నొనర్పంజేయ నిత్యకల్యాణము పచ్చతోరణమ్ముగ దివ్యస్థల ధర్మంబులు పాటించుచు కతిపయ సంవత్సరములు స్వామి సేవలనలర నొక పుణ్యదినమ్మున ప్రాతఃకాలమ్మున ధ్యాన నిష్ఠాగరిష్ఠుం డగుతరి నందిన దివ్యప్రబోధమ్మున ఆకసమ్ము నవలోకించి అంబరాగత విమానాబద్ధాలోల ఘంటికావళీ నినాదమ్ము వినియత్యంత కుతూహలాయత్త చిత్తుండయి యర్థాంగిం గమలమా సాధ్వీరత్నముం బిలిచి ప్రత్యుత్తర మందుకొనఁ దగుతరి సాక్షాద్వైకుంఠమూర్తులో యనఁదగు దివ్యమంగళస్వరూపులగు విష్ణుదూతలచే నాహూతుండగుచు తత్రత్యబహుప్రజానీకమ్ము లచ్చెరువందఁ బ్రాణేశ్వరునితో నరుఁగంజాలు పుణ్యభాగ్యోపేతం గాకుంటి ననుచుఁ గమల మాసాధ్వీరత్నంబును పుత్రరత్నంబగు రఘురాముండును విలపించుచు నంబరమ్మంగొని వెడలువిమానమ్మంగనుచుండ యావత్ప్రజా సందోహమ్మును నీమహాభాగుఁడు కారణ

జన్ముండు మహామహిమాన్వితుండు తెలుంగక పోతిమని వాపోవుచు నభినందించుచుండ శ్రీ భద్రాద్రి రామదాస వర్యుండు. 1139

కం॥ అలరాముఁడంపు పుష్పక
మెలమి నధిష్ఠించి వెడలె నీతనువునఁదా
నలవైకుంఠపురమ్మున
కలవియె ? శ్రీరామదాసు నభివర్ణింపన్. 1140

వ॥ అంతఁ బతియే దైవమని సేవించి తరించనెంచు మహా సాధ్వీవతంసమ్ము కమలాంబ నిజభర్తృవియోగంబు సహింపంజాలమి నత్యంత దుఃఖాక్రాంత చిత్తయై సహగమనోద్యోగినియై గౌతమీ మహానదీ ప్రవాహజలమ్ములఁగ్రుంకి యసువులు వాయనెంచు టెఱింగి పురప్రజలు భక్తగణములు మున్నగు నెల్లరు అమ్మా! రామదాస ప్రభువును మహారాజుగ నిన్ను మహారాజ్ఞిగనెంచి సేవించు మా భావియు శ్రీ సీతారామచంద్రస్వామి సపర్యయు పుత్రరత్నము రఘురాముని యభ్యుదయమును సమస్తభారము నీయందుంచి తన ప్రతిబింబంబగు కుమారుని నీకు రక్షగ దెల్పి యీనాడు మముమెల్లర నీపరివారమ్ముగఁ జెప్పకయ శాసించిగురుదేవులు వైకుంఠమలంకరించిరని మామనమ్ములు దృఢమ్ముగ విశ్వసించుచున్నవి. కావున మాకోర్కె మన్నింపుమనిన ప్రజావాక్య

మ్మున నొకప్పుడు పతివలన నెఱింగిన దివ్యప్రబోధమ్ము స్మృతికింపట్టి స్తిమితాంతఃకరణయై తదాది నిరంతర శ్రీ సీతారామ సేవాపరాయణయై వినయవిధేయతల నలరారు నుత్తమ దంపతులు కుమారుఁడు కోడలు పరిచర్యచేయఁ భావిజీవితమ్ము సుఖోదంతమ్ముగఁ బుచ్చంజాలెనని సోమయాజి తెలిపిన విని మహానందభరితులగు సభాస్థితాఖిల విద్వన్ముఖ్యులు నంజలించి సోమయాజి నభినందించుచు సాయంసమయమగుడు సంధ్యాకార్యక్రమమ్మునకుఁ జనిరి. 1142

ఇది శ్రీమత్పర దేవతా కరుణాకటాక్షలబ్ధ సరసకవితా వైభవ భారద్వాజ పవిత్రగోత్ర చెళ్ళపిళ్ళాన్వయ పయఃపారావార రాకా సుధాకర జోగావధాని ప్రపౌత్ర వెంకటావధాని పౌత్ర జోగావధాని పుత్ర వెంకటేశ్వర కవీశ్వర ప్రణీతంబగు భక్తరత్నాకర మహాకావ్యమ్మున ప్రథమతరంగము.

మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 6 | నీతీ | నీతి |
| 17 | 5 | నిషులు | నిష్ఠులు |
| ,, | 14 | కర్త | కర్మ |
| 23 | 10 | హితులన్ | హితులున్ |
| 25 | 15 | సందుచు | మందుచు |
| 26 | 20 | గురుల్ న్ | గురులన్ |
| 28 | 20 | బ్రతుకుకనుచున్ | బ్రతుకునకనుచు |
| 32 | 1 | కామాబా | కామాంబా |
| ,, | 12 | లల్లకల్వ | నల్లకల్వ |
| 33 | 5 | జ్ఞానియన్ | జ్ఞానియున్ |
| 34 | 17 | మియ్యావి | యియ్యావి |
| 35 | 8 | మెఱియున్ | మెఱయన్ |
| 36 | 20 | డాశీర్వాదించి | డాశీర్వదించి |
| 37 | 8 | చొన్పియున్ | చొచ్చియున్ |
| 38 | 8 | కామము | కామమ |
| ,, | 10 | స్తంప | సంప |
| ,, | 12 | బదయును | బదమును |
| 42 | 5 | నిశ్చయమై | నిశ్చయమై |
| 196 | 1 | భక్తిని | భక్తినీ |
| ,, | 17 | వాయుజుడున్ | వాయుజుడు |
| ,, | 20 | మీకల | మీకుల |

ముద్రారాక్షసము లింకను నందందుంగాన వచ్చెడు విజ్ఞుల దయతో సవరించుకొనం గోరుచుంటిని.